| | | |
|---|---|---|
| | | పుట. |
| 115. ముదుంబి—వేంకటరాఘవాచార్యుఁడు. | ... | 210. |
| 116. అక్కెనపల్లి—నృసింహకవి | ... | 211. |
| 117. పైడిపాటి—వేంకటనృసింహకవి. | ... | 213. |
| 118. కొటికలపూడి—వేంకటకృష్ణకవి | ... | 214. |
| 119. కాకర్పర్తి—కృష్ణకవి | ... | 216. |
| 120. కృష్ణయ్య. | ... | 217. |
| 121. తిరుకొండ—వేంకన్న. | ... | 218 |
| 122. పిండిప్రోలి—లక్ష్మణకవి. | ... | 221. |
| 123. అల్లమరాజు—రామకృష్ణకవి. | ... | 225. |
| 124. కాకర్పర్తి—అప్పిపాత్రకవి. | ... | 227. |
| 125. శిష్టు—కృష్ణమూర్తికవి. | ... | 229. |
| 126. మంత్రిప్రెగడ—సూర్యప్రకాశకవి. | ... | 233. |
| 127 ఘట్టు—వేంకటనరసయ్య. | ... | 235. |
| 128 వేల్పూరి—వేంకటేశ్వరకవి. | ... | „ |
| 129. తిరుమల కృష్ణపట్టణపు—చినతాతాచార్యుఁడు. | | 238. |
| 130. మాడభూషి—నృసింహాచార్యుఁడు. | ... | 239. |
| 131. కోటమరాజు—నాగయ. | ... | „ |
| 132. కొరాలపాటి—రంగయకవి. | ... | 240. |
| 133. రామరాజు—లక్ష్మీనారాయణ | ... | ౨౪౧. |
| 134 త్యాగరాజ మొదలి. | ... | |
| 135. ఓగిరాల—జగన్నాథకవి. | ... | |
| 136. నడకుదిటి—రామకవి. | ... | |
| భూషి—వేంకటాచార్యకవి. | | |

# ఆంధ్రకవులచరిత్రము.

## మూఁడవభాగము_ఆధునికకవులు.

### హరిభట్టు.

ఈకవి మత్స్యపురాణమును వరాహపురాణమును తెలిఁగించెను. ఇతని నివాసస్థానము కంబముమెట్టు; ఇది బెజవాడ కాతామడలదూరములో నున్నది. ఇతఁడు తన వరాహపురాణమునందు కంబముమెట్టుగ్రామము నీప్రకారముగా వర్ణించియున్నాఁడు_

సీ. వరుణదిగ్వీథి నేపురిగిమునఁ బ్రవహించెఁ బావనసలిలసంపన్న మున్న
దీపించె నేపురి గోపికామానసాస్పదవర్తి చెన్నగోపాలమూర్తి
భాసిల్లె నేవీటఁ బ్రహ్లాదభక్తివిశ్రాణి శౌండనృసింహశార్ఙ్గపాణి
యేపట్టణంబునఁ జూపట్టె హితపద్మహేళి పీఠేశబాలేందుమౌళి
చతురచతురంగబలరత్నసౌధయూథ । సాలగోపురతోరణసకలవర్ణ
వారవారాంగనాజనప్రముఖవస్తు । మేదురం బట్టికంబముమెట్టుపురము.

కవి వైదికబ్రాహ్మణుఁడు; భారద్వాజసగోత్రుఁడు; రామపండితుని పుత్రుఁడు. ఇతఁడు మొదట వరాహపురాణమును కొలిపాక యెఱ్ఱనామాత్యుని కంకితము చేసెను.

మ. ఘనతేజుం గొలిపాక యెఱ్ఱనికిఁ గాశ్మైర్యగాంభీర్యస
త్త్వశుభోక్తిధురీణయోగ్యనయశస్త్యాగక్రియాశాంతులన్
సవితన్ సాత్యకి సింధు సీరి సురశాస్తన్ భూతసేనాని సైం
ధవవిర్భేదను సోము సౌమ్యయుత సంతానంబు సస్యాధిపన్.

ఇత్యాది పద్యములచేత గుణోత్క్రమమునఁ గవి కృతినాయకుని నెంతగా నభివర్ణించినను,

క. శ్రీమహితస్తంభాచల । నామసముద్దామపట్టణస్థలగణికి
గ్రామణికి బంధుహితర । క్షామణికిఁ గవీంద్రపంకజనభోమణికిన్.

అను షష్ఠ్యంతపద్యమువలన నతఁడాయూరికి కరణమయినట్లు స్పష్టపడుచున్నది.
ఇట్టి నాయకగ్రామణి నిప్పుఁడు విడిచి

మ. అమృతప్రాయవచోవిశేషరచనాహంభావసంభావనా
గ్రమణీమూర్తివి వేదశాస్త్రవివిధగ్రంథార్థనిర్ణీతి నే
కముఖబ్రహ్మవు యాజుషప్రకటశాఖాధర్మధుర్యుండవ
ర్యమతేజుండవు రామనార్యహరిభట్టా సత్కవిగ్రామణీ.

గీ. అష్టఘంటావధానవిశిష్టబిరుద । నీవు రచియింపఁ దలఁచిన నిరుపమార్థ
రమ్య మగు నీవరాహపురాణకావ్య । మంకితము చేయు నాపేర నభిమతముగ.

అని పలికినట్లు కవి వ్రాసికొనియున్నాఁడు. పయిపద్యమునందే గాక యాశ్వాసాంత గద్యమునందును "అష్టఘంటావధానపరమేశ్వర బిరుదవిఖ్యాత" యని కవి వ్రాసికొనెను గాని యీబిరుద మెవ్వరిచే నియ్యఁబడినదో తెలియఁబడదు. అయినను కవిత్వముమాత్రము పయిపద్యమునందుఁ జెప్పఁబడిన రీతిగా నమృతప్రాయముగానే యున్నది. ఇతఁడు తా నాపస్తంబసూత్రుఁ డయినట్టును తిమ్మాంబపుత్రుఁ డయినట్టును మత్స్యపురాణములో నీక్రింది పద్యమునఁ జెప్పుకొన్నాఁడు—

శా. భారద్వాజసగోత్రసంభవుఁడ నాపస్తంబుఁడన్ తిమ్మకాం
బారాజద్వరగర్భసంభవుఁడ రామక్ష్మాసురానేకజ
న్మారూఢాధికపుణ్యలబ్ధహరినామాంకాప్తసంస్తుత్యుఁడన్
శ్రీరామావరపాదపద్మయుగళీచింతాసమాయుక్తుఁడన్.

ఇతఁడు మొదట రచించిన వరాహపురాణమును నరాంకితము చేసి యట్లు చేయుట పాపకార్యమని తలఁచి తత్పాపపరిహారార్థముగా మత్స్యపురాణమును శ్రీరంగాంకితము చేసి యందీక్రిందిపద్యమును పొందుపఱిచెను—

గీ. ఆయురారోగ్యనిత్యైశ్వర్యములు గల్గి విభవంబుతో ధాత్రి వెలయుకొఱకు
ధనమునకై నరాధముల సన్నుతిచేయఁ బొడమిన పాపము ల్వెడలుటకొఱకు
హృదయంబు లక్ష్మీశపదపంకజములందు నిశ్చలవృత్తితో నిలుచుకొఱకు
కాకవాదులఁ బాసి రయమున వైకుంఠసదనంబునకు వేడ్కఁ జనెడుకొఱకుఁ
బరమవైష్ణవజను లెల్లఁ బ్రస్తుతింప । మత్స్యరూపంబయి హరికథామాన్య మగుచు
నుత్తమం బగు విష్ణుధర్మోత్తరంబు । రంగనాథున కర్పింతు రమణ మెఱసి.

కవికాలమును నిర్ణయించుటకుఁ బుస్తకములు రెంటిలోను నాధారము లేవియుఁ గానరాలేదు. అక్కడక్కడఁ గొన్ని యల్పదోషము లున్నను మొత్తముమీఁద నిర్దుష్టమని చెప్పఁదగిన గ్రంథరచననుబట్టియు శైలినిబట్టియు చూడఁగా నీపుస్తకములు చిరకాలము క్రిందటనే రచియింపఁబడినవయినట్టు తోఁచుచున్నది. "అష్టఘంటావధాన" యని రెండు పుస్తకములయందును గనఁబడుచున్నది. గంటమును తెలుఁగుశబ్దమునకుఁ

బ్రకృతియయి లేఖరియని యర్థమిచ్చెడు "ఘంట" శబ్దము సంస్కృతమున నున్నదేమో! అప్పటివి యీగ్రంథములనుండి లక్ష్యములను జేకొనక పోవుటచేత నీకవి యంతనికిం దరువాతనున్నాఁడేమో యని యూహింపఁ గలుగుచున్నది. కాఁబట్టి తగిన యాధారములు దొరకువఱకును మన మిప్పటికీకవికాలము క్రీస్తుశకము ౧౬౬౦ వ సంవత్సర ప్రాంతమని భావింతము. తెలియవలసిన విషయముల నూహించి పెంచి వ్రాయుటకంటె కవికృత గ్రంథములనుండి కొన్నిపద్యముల నుదాహరించి యువాటిలో విర్ణయించుట యుక్తమని యెంచి యిట్లు చేయుచున్నాను.

వరాహపురాణము.

ఉ. మిక్కిలి శీతలాంబువులు మేఁకిఁ గీడు మహోష్ణవారిచేఁ
బొక్కు శరీరమాయుధ చయంబు గోళి ... నింపానచ్చుని
క్కొక్కసమయంబు నొందె భయము నొడె నొసఁగక తద్వ్యయంబు దా
నొక్క వెతింగి చూపు మనుజేంద్రునకు న్వశు లౌదు రందఱున్.—ఆ. ౧.

మ. సమతా జేంద్రునిగూర్చి సామము భుజాశౌర్యాధికుం గూర్చి దా
నము దీనుం గలయంగ నేరనిమహీనాథాగ్రణిం గూర్చి భే
దము శక్తిత్రయహీనుఁ గూర్చి కడిమిం దండంబుఁ గావింప యు
క్తము భూపాలు కార్యగా ర్యహరిగష్టాకారయ్యి స్తంద్రదెన్.—ఆ. ౨.

శా. వేదాగంబులు వేయుగాఁ దెలిసి దుర్వ్యజ్ఞాను లాత్మేశ్వరా
భేదధ్యానమేతులై తుది భవత్ప్రీత్యర్థమై కర్మముల్
మోదం బొప్పఁగఁ జేయు నేరక మహామోహాంధులై యుందు రం
తాదివ్యాప్తిహీనసుస్మృతిసముద్రాంతర్నిమగ్నాత్ములై—ఆ. ౩.

ఉ. దేహవినాశమూల మగు తీవ్రవిషావృతి నైనయట్టి యా
బాహువుఁ ద్రెంచి మేను నిలుపంచిన యందుబగాని సోదరీ
స్నేహము చేయు గొప్ప దని లెలిముండల వట్టి యాజగ
ద్ద్రోహి గిశంబుఁ ద్రెంచుటకు ... నెత్తినఁ జూచి యుత్తరీ—ఆ. ౪.

చ. ఘనతరకష్టలోభిఁ దమకంబునఁ బంపెనుసంతయుల్క నె
మ్మనమునఁ బుట్టనేని విషమార్గణకృత్యప్రాణముఖ్యసా
ధనములు గూర్ప నేల ప్రమదంబున దగ్గఱి కాను వీసమి
మ్మనుటయె చాలు వాని నిమిషార్ధమున స్మృతి నొందఁ జేయఁగన్.—ఆ. ౫.

మత్స్యపురాణము.

చ. చవిపిరి వేదశాస్త్రములు సాంగపదస్వరవర్ణరూఢి నం
దాదన మార్గముల్ వివిధయోజ్యములై విలసిల్లు వానిలో

నెరిసిన కర్మకాండమున హింసయు జ్ఞానమునందుఁ గర్మమున్
వదలక పల్కుచుండుదు ప్రవాహముల న్విపరీతవృత్తులై. — ఆ. ౧.

చ. తిరిగితిఁ గాననంబు లతిక్లిష్టతఁ జలింపక తద్వనంబులన్
దొరకవు కందమూలములు తోయజనాభ యాజ్ఞఁ గాక యి
ప్పురమున నన్నపూర్ణ ప్రభూతయై విహరింపుచుండఁగాఁ
గలదని నే తదన్నము లకాలమున న్నమందిరంబులన్. — ఆ ౨.

ఉ. విప్రుఁడు నీచకర్మపరుఁడై జనవాదిక మంత్రతంత్రముల్
తప్పినఁ బ్రత్యవాయమును దారొదవించుటె కాని దానఁ దే
దప్పరమేశుఁ బొందదనుపద్ధతి నేనిట నీకు వేడుకం
జెప్పెద గుప్తమార్గమునఁ జేయుము తత్క్రియ భూసురోత్తమా — ఆ ౩.

మ. రమణీబంధుజనాప్తుల న్విడిచి తద్రాజ్యంబు వర్జించి దు
ర్దమకామాదులఁ జెదరీక హృదయస్థైర్యంబు వర్తించి నీ
నమితోద్యద్గుణకీర్తనామృతముచే నాహ్లాదయుక్తుండనై
విమలాంతఃకరణుండనై వనిని నే వీక్షించితిం బుణ్యకా. — ఆ. ౪.

మ. హరి సంగీతవినోదలోలుఁ డగుచో నత్యంతశీఘ్రంబునన్
వరగానంబుల నాత్మసద్గుణకథావర్ణంబులై నట్టి గీ
తరసంబుల్ రసనం జపింగొనెను మగ్రశ్రేణి కిష్టార్థముల్
పరిపూర్ణంబులుగా నొసంగును దయాపాకీణుఁడై వేడ్కతో — ఆ ౫.

## ఒప్పెపూడి-పెద్దయ్య

ఈకవి వాయుపురాణమును తెనిఁగించి, పురుషోత్తమపట్టణనివాసుఁ డయిన దాసరి చిన్నగంగయ్య యను కమ్మవారికి కంకితము చేసెను. పురుషోత్తమపట్టణము కొండపల్లెకుఁ బ్రాగ్భాగమున నున్నట్టును, దానిని వీరపురుషోత్తమగజపతి తనపేరఁ గట్టించినట్లును గవి చెప్పియున్నాఁడు. వీరపురుషోత్తమగజపతి కొండవీటి కధిపతిగా నుండి క్రీస్తుశకము ౧౪౬౧ వ సంవత్సరము మొదలుకొని ౧౪౯౬ వ సంవత్సరము వఱకును రాజ్యపాలనము చేసెను. ఈతని తరువాత రాజ్యమునకు వచ్చిన యితని మనుమఁడైనవీరభద్రగజపతిని ౧౫౧౫ వ సంవత్సరమునందు కృష్ణదేవరాయలు జయించి కొండవీటిని స్వాధీనము చేసికొనెను. దీనిబట్టి వాయుపురాణము కృష్ణదేవరాయనికాలమునకు ననంతరముననే రచియింపఁబడినట్లు తెలిసినదికాని యెప్పుడు చేయఁ

బడినదో తెలియదు. అప్పకవి యీపురాణమునుండి పద్యముల నుదాహరించియుండక పోవుట మొదలయిన కొన్ని హేతువులనుబట్టి హరిభట్టకవికాలమువలెనే యీకవికాలమును ౧౬౬౦ వ సంవత్సరప్రాంతమని యూహింపఁ దగియున్నది. ఈయిద్దఱుకవులును కవిత్రయమని ప్రసిద్ధిగన్న నన్నయతిక్కనశంభుదాసులనుదక్క నితరాంధ్రకవులను దమగ్రంథములయందుఁ జేర్కొనియుండలేదు. కవి కృతినాయకుఁడయిన చినగంగయ్య కొలువునఁ గూర్చుండి తన్నుగూర్చియు సభికులనుగూర్చియుఁ బలికిన వాక్యముల నిట్లు చెప్పియున్నాఁడు—

సీ. అతులితశాస్త్రేతిహాసంబు లొకవంక నొకవంక దండకావ్యకగణంబు
తతచతుర్విధవేదతత్త్వజ్ఞు లొకవంక నొకవంక నిపుణశాబ్దికచయంబు
ప్రకటితప్రౌఢతార్కికబృంద మొకవంక నొకవంకఁ జతురవాక్సుకవినికర
మకళంకపౌరాణికకదంబ మొకవంక నొకవంక జ్యోతిషప్రకరవేత్త
లొక్కచో బంధుచయంబు లొక్కయెడ స
మగ్రసామంతవిసరంబు మహిమఁ గొలువఁ
గొలువుకూటంబు నందుండి కలితవచన
గౌరవముమీఱ సభికులఁ గాంచి పలికె.

* * * *

చ. వినుతసమస్తభూభుజుని వేంకటమంత్రికిఁ బేరమాంబకున్
దనయునిఁ బుణ్యవర్తుని దానగుణాన్వితు నారసింహహృ
ద్వనరుహచంచరీకు ననివార్యవచోరచనావిశారదున్
నను బినయొడ్డెళ్లేశపురినాథునిఁ బెద్దకవీంద్రచంద్రునిన్.

తోటకము.—వినయంబునఁ గన్గొని వేడుక ని
ట్లనియెన్ సుకవీంద్ర మురోచకఫల్
వినినంత నభీష్టనవీ ఫలసం
బనయంబులు గల్గు జనావళికిన్.

* * * *

ఉ. పంకజగర్భదారకటిభాగవిభాసితభర్మమేఖలా
కింకిణికావిరావములఁ గేరు తదీయకరాగ్రవిస్ఫుర
త్కంకణనిక్వణంకనినదంబు నగున్ బినయొడ్డెపూడిమా
వేంకటమంత్రిపెద్దన నవీనవిలాసవచోనిగుంభనల్.

ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; కాశ్యపగోత్రుఁడు; వేంకటమంత్రి పుత్రుఁడు; ఒడ్డె

పూడి గ్రామమునకు కరణము. ఇతఁడు వాయుపురాణములోని కొంతభాగమును మాత్రమే తెనిఁగించి యున్నట్లు కనఁబడుచున్నది. ఈతని కవిత్వమునం దక్కడక్కడఁ గొన్ని దోషము లున్నను మొత్తముమీఁద కవిత్వము రసవంతముగానేయున్నది. వాయుపురాణమునుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను.—

మ. కరశోచ్చాళితమై ఘనాఘనబృహద్గర్జారవోపేతమై
కరవిద్యుల్లతికాతతిప్రబలమై వాస్తోష్పతీష్వాసబం
ధురమై సర్వదిశాభిభాగములు నస్తోకాంబుపూర్ణంబుగాఁ
గురిసెన్ వర్షము నీరజప్రజము సంక్షోభింప భీమంబుగన్.—ఆ. ౧.

ఉ. పొంగిన వేడ్కచే నతఁ డపూర్వముగా విహరించుచుండి యా
చెంగటఁ గాంచె దివ్యసరసీరుహశోభితమత్తభృంగస
త్సంగతరంగదోయహరిలోపపక్షిగణబలాకచక్రచ
క్రాంగనభంగరంగ నికటాగతసంయమిసంగ నెంతయున్ —ఆ. ౨.

మ. కడుమూలంబున నుండి మేను వడఁకంగాఁ బావకుల్ తొట్రిలన్
వడచేఁ జిక్కి హరిల్పటించుచు గృహద్వారంబుఁ జేరంగ నే
నిడఁగాఁ బంచితి నీరసాన్న మతఁడున్ హేయంబుగాఁ జూడ కే
కడిచెం దక్కలుషంబు చేయుకతనన్ ఘోరాటవీభూములన్.—ఆ. ౩

మ. మునిసంఘంబులు మ్రొక్కఁ దామరలు సమ్మోదంబునన్ నిక్కఁ గో
కనికాయంబుల కింపు లెక్కఁ గుముదౌఘంబుల్ రుచుల్ తక్క స
ర్వనిగర్వంబులు దూలి జాలి బడి జీవంజీవముల్ స్రుక్కఁ దూ
ర్పున మార్తాండుఁడు గానిపించె భువనంబుల్ రంజిలం జేయుచున్ —ఆ. ౪

ఉ. ఇంద్రుఁడ వీవు దక్షపద నేటికిఁ గౌశికమౌని చేయుని
స్తంద్రతపంబు మాన్పుటను శక్యము గాదన నేల భీకతన్
రుంద్రమతి న్సుఖింపుము నిరూఢిగ నే నిదె చిక్కఁ జేసెదన్
జంద్రముఖీవిలోకనసుసంగతిఁ జొక్కరె యెట్టివారలున్.—ఆ. ౫.



## కాకమాని - మూర్తి.



ఈకవి కాకమానికులజుఁ డైనబ్రాహ్మణుఁడు; కౌండిన్యగోత్రుఁడు; రామలింగభట్టపుత్రుఁడు. ఇతఁడు పాంచాలీపరిణయము, రాజవాహనవిజయము, అను రెండు

ప్రబంధములను రచియించెను. రాజవాహనవిజయములోని యీ క్రింది పద్యమునబట్టి యీకవి యింటిపేరు పెన్నావారని తెలియవచ్చుచున్నది.—

సీ. గుణధన్యుఁ గౌండిన్యగోత్రు నాపస్తంబసూత్రుని వెలనాఁటి శుభచరిత్రుఁ
గాకమానీమహాగ్రామాబ్జమిత్రుఁ బెన్నాకలశాబ్ధితారాకళత్రు
సరసవిద్వత్కవి సార్వభౌముని రామబుధసంభవునకుఁ బ్రబోధసుధికిఁ
బౌత్రునిఁ బినరామభట్టాగ్రజన్ముఁడై తనరు శ్రీరామలింగనకుఁ దిమ్మ
మాంబికకుఁ బుత్రు సూర్యనారాయణద్వ । యైకసహజన్ము నుభయభాషాకవిత్వ
తత్త్వనిధి నన్ను మూర్తిపద్వత్కవీంద్రు । హర్షమునఁ జూచి యిట్లని యానతిచ్చె.

ఇతఁడు తనగ్రంథములను నరాంకితములఁ జేయక రాజవాహనవిజయమును శ్రీవేంకటేశ్వరులకును, పాంచాలీపరిణయమును శ్రీరంగపతికిని, అర్పించినందునఁ గృతిపతులను బట్టి కవికాలమును నిర్ణయించుట కాధారము లేదు. ఇతఁడు కవిస్తుతిలో నైనను పాంచాలీపరిణయమునందిలఁ బ్రాచీనాంధ్రకవులను బేర్కొనక తనముత్తాతయు తాతయు నైనగానామపండితుని ప్రబోధపండితునిమాత్ర మీపద్యమునందు పేరులు పెట్టి నుతించి యున్నాఁడు—

చ. ప్రబలమతి న్నుతింతుఁ బ్రతిభాకృతిభాషితభారతీశులన్
గబళితసర్వదిగ్జనులఁ గావ్యచమత్కృతికాళిదాసులన్
నిబిడతపోవిలాసులఁ దృణీకృతవాములఁ గాకమాని రా
మబుధవిధున్ బ్రబోధసుధి మత్ప్రపితామహునిన్ బితామహున్.

రాజవాహనవిజయమునందు వీరిని గాక యీపద్యమునందుఁ గవిత్రయమును గూడఁ జేర్కొని యున్నాఁడు—

ఉ. శ్రీరఘురామకావ్యకృతిశిష్టనిధిజ్ఞుఁ బరాశరాత్మజున్
భారవిఁ గాళిదాసు శివభద్రు మురారి మయూరు బిల్హణున్
జోరుని మల్హణాదిసురసూక్తికవీంద్రులఁ గొల్చి యెంచెదన్
భారతకర్తృతాచణుల నన్నయఁ దిక్కన నెఱ్ఱనార్యునిన్.

ఇతఁ డన్యకవుల నెవ్వరిని గొనియాడకపోయినను వసుచరిత్రకర్త యైనభట్టుమూర్తికిఁ దరువాతివాఁ డనుటకు సందేహము లేదు. వసుచరిత్రకర్త మూర్తి యన్నమాటవినఁ బడఁగానే మూర్తి నరసభూపాలీయకర్తగాని వసుచరిత్రకర్త కాఁ డనియు, ఉభయగ్రంథకర్తలు భట్టువంశజు లయి యేకకాలపువా రగుటచేఁ బూర్వకాలమునుండియుఁ బండితపామరసాధారణముగా వసుచరిత్రకారుఁడు భట్టుమూర్తి యన్న భ్రమ యంధపరంపరగా వచ్చుచున్నదనియు, కొందఱు చెప్పవత్తురు. ఒక్కకాలమునం దిద్దఱు

కవులుండి వారిలోనొక్కఁడుసుప్రసిద్ధుఁడును రెండవవాఁ డప్రసిద్ధుఁడునునయినప్పుడు సుప్రసిద్ధుని పేరడఁగిపోయి యప్రసిద్ధుని పేరు పైకివచ్చుట యెన్నఁడును సంభవింప నేరదుగాన, అధికప్రసిద్ధుఁ డయిన రామరాజభూషణుని పేరు గడుగంటి యీతని గ్రంథకర్తృత్వము భట్టుమూర్తిమీఁదఁ బడెననుట యుక్తియుక్తము కాదు. ఒకవేళ భ్రమకలిగెడుపక్షమున, నరసభూపాలీయకర్త రామరాజభూషణుఁ డని కలుగవలెను. అప్రస్తుతమైన యీయంశము నటుండనిచ్చి కావ్యాంశమును వదలుదము. అనేకు లీతని భట్టుమూర్తినిగా భ్రమించి యితని పాంచాలీపరిణయములోని యీక్రిందిపద్యమును

గీ. అల్లసానివాని యల్లిక జిగిబిగి । ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు
పాండురంగసుకవి పద్యంబు హాసవృత్తి । గాక మూర్తిరాజ నీకె కలదు.

భట్టుమూర్తినిగూర్చి రామకృష్ణకవి పలికినట్లు చెప్పుచున్నారు. ఇది నామసామ్యమును బట్టి కలిగిన భ్రమగాని వేఱుకాదు. మఱియు నీపద్యమునుబట్టి యీకవి తెనాలి రామకృష్ణునికాలమునకుఁ దరువాతివాఁ డనుట స్పష్టమగుచున్నది. పయిపద్యములో శ్రీరంగేశుఁడు తనకవిత్వమునుగూర్చి యట్లు పలికినట్లు చెప్పుకొనుటయే కాక రాజవాహనవిజయములో సరస్వతిని ప్రార్థించునప్పుడుకూడ నిట్లు చెప్పియున్నాఁడు.—

ఉ. చోరు నలంక్రియావిహృతిసాంపు మయూరునిసౌకుమార్యముః
భారవికాంతిసంపదయు బాణుగుణాఢ్యతరప్రయోగ మా
దారి మురారికోమలపదంబుప్రసాదముఁ గల్గునట్లుగా
భారతి యిచ్చుఁగాతఁ బ్రతిభారతి మత్కృతికిన్ మత్కృతిన్.

ఈతనికవిత్వమునం దీకవి పొగడుకొన్నంత యౌన్నత్యము లేకపోయినను, రసవంతమయి సలక్షణమయి యనుకరణీయముగాని శబ్దార్థాలంకారయుక్తమయి కవితాగుణ యనర్గళధారగా ప్రవహించుచున్నది. గ్రంథములం దన్యదేశ్యపదములును వైయాకరణలాక్షణికసమ్మతములుకాని ప్రయోగములును కొన్ని యందందుఁ గానఁబడుచున్నవి. క.౧౬౨౦ వ సంవత్సరప్రాంతములయందుండి యుండియుండును. కాకమానిమూర్తి బహుళాశ్వచరిత్రములోనివని కొన్నిపద్యములు రంగరాట్ఛందము నందును సర్వలక్షణసారసంగ్రహమునందును ఉదాహరింపఁబడియున్నవిగాని యిది రచియించిన బహుళాశ్వచరిత్రము నాకు లభింపలేదు. ఈమూర్తికవి రాజవాహనవిజయములో చంద్రగిరిహనుమంతుని స్తుతించియుండుటచేత నీతని వాసస్థానమైన కాకమానిగ్రామము చంద్రగిరిసమీపమున నుండియుండును. కవిత్వరీతిని దెలుపుట కీతని గ్రంథములనుండి కొన్నిపద్యముల నుదాహరించుచున్నాను.—

రాజవాహనవిజయము.

శా. ఘాటీఘోటఖురాగ్రనిర్దళితగోత్రాధూళికాగంధమూ
ర్ధాటోపాతిపరిస్ఫురత్కరినసర్వాశావధూటీకుచా
ఘాటచ్ఛాదకరాగశాటితసమాఖ్యావిక్రమప్రక్రమా
త్యాటీకాహితరాజహంసుఁ డగు నాహా రాజహంసుం డిలన్. — అ. ౧.

ఉ. మీసపు మొక్క నిక్కినను మిక్కిలితోల్కరివాన కుంతలా
శీమకపాలఫాలమణిలీలకుఁ గ్రొన్ననుసాన విభ్రమ
శ్రీ పరసీరుహంబు మదసింధురగర్వప్రసవంబు సూనబా
ణాసనపర్వఫలంబు బళిను యౌవనమబ్బెఁ గుమారమౌళికిన్. — అ. ౨.

శా. పూవుంబోఁట యొకర్తు చేరఁగ ఁదెంపుంజందురాతిన్నెలం
బూవుందేనియ సోనవానఁ దొంతుకు లొప్పైచు గొజ్జంగిపూ
పైవాటుల్ల బాసనంపుఁగవిచల్ పన్నీటి యున్నీటి జల్
ద్రోవం గట్టినపచ్చమెట్టికలపైఁ గోడ్డోడఁ గ్రీడింపఁగన్. — అ. ౩.

ఉ. తాలిమిమాలి తూలి వెలి దగ్గఁబడఁ దప్పెడె వంచుతమ్మిపూ
వాలికతూపు క్రొంజెమటవానకుఁ గాఁటమై నిద్దపుం
గోలమెఱుంగు యౌవనచకోరహితాగతిరశ్మియోరయో
లోలమృగాక్షి నాపయిఁ బలుక్కఁగఁ జాలిచూపవే. — అ. ౪.

మ. కటకంబుల్లలయుత్కటప్రపటుటంకఘంటాపథప్రస్ఫుట
త్కటకంబుల్ దూరముంగఁ జక్కఁజన వావ్యాఘ్యానశక్తిన్ మహా
కటకంబుల్ ప్రతివాద వీరపథవోత్కంఠత్ దిశాభూమిభృ
త్కటకంబుల్లన రాజు చేఁగని యొందన్యంబిరాళించమున్. — అ. ౫.

పాంచాలీపరిణయము.

ఉ. ఏయుఁ గఠోరమార్గణము లివ్వలి కవ్వలి క్రిందు మీఁదుఁగా
వేయుధరాస్థలిన్ పడినవంటనె గాంగరుఖరంబు లేవఁగాఁ
జేయువ్ వగ్గనూఁచములు చెట్టుచు జట్టుచు కొట్టి బెట్టుగా
నాయువలాయుధప్రభువుఁ డాయన యౌవనగర్వసంపదన్. — అ. ౧.

ఉ. ఎంతటివన్నెఁ దెచ్చె గుణియై పియిదాండు ద్విజన్మజాతికిన్
వింత యటంచు రాజుల గణింపక తిట్టుచు గేలి కొట్టుచున్
గంతులు వైచుచుం దలకుఁ గట్టినచెంగు బిగించి పట్టుచున్
గొంతులు గాకుఁ గోయునుచుఁ గూఁతలు పెట్టిరి గ్రామ్యభూసురుల్. — అ. ౨.

ఉ. సుందరిఁ గాంచె దిగ్గమనసుఖ్యుఁడు వారణవేషభాషణున్
మందరకంధరాకనకమంజిమమధ్యవితర్ద్యమందహా
రందరసీలకందరఘుకంధరసింధురవైరిపీఠవా
సేందుకళాకలాపు హృదయేశ్వరుతోడుత నెత్తమాడఁగన్ — ఆ. 3.

శా. నీకేవమ్ము సువాలయమ్ము ధవళ మింతీ యల్లో నేర్లెళ్ళు గా
రీకళ్యాణము లంచు నింటికడ నేర్పి స్వీజృంభింతు వే
వాకీ విచ్చుట యంచు నిద్దురసతుల్ వాక్యోపవాక్యంబులన్
గాకై ముందలపట్లసుం గొండఁగి రా కల్యాణవేదిస్థలిన్. — ఆ. ౪

శా. ఆఁడుంగాన్పున గంటకన్న సతి కొండ్రా లౌటయే మేలు నా
కేఁడు ల్వెంపిఁ గూఁతు రేమి సతమా యీవిద్యయు లోఁగడలన్
గాఁడంబల్కిన దాళిఁ గావలసెఁ గా కాఁగా నితిట్లాడికల్
నేఁ డీతంత్రియుఁ దల్లివంగడము కానీ యంచు నో నాయెఁ గా. — ఆ. ౫.



## కామేశ్వరకవి.



ఇతఁడు సత్యభామాసాంత్వన మను నాలుగాశ్వాసముల శృంగారప్రబంధమును రచియించి, మధురనాయకుఁ డైన ముద్దళగిరినృపాలున కంకితముచేసెను. ఈమధుర శ్రీకృష్ణుని జన్మస్థలమయిన మధురాపురము గాక పాండ్యమండలమునకు రాజధాని యైన దక్షిణమధుర యని ట్రీక్రిందిపద్యమువలనఁ దెలిసికొనవచ్చును—

క. లక్షణలక్షితకమలా । వీక్షణపుంఖానుపుంఖవిభవోన్మేషా
నుక్షణతతవిశ్రుతియై । దక్షిణమధురాపురంబు దనరు ధరిత్రిన్

కృష్ణదేవరాయని యనంతరమునఁ దెలుఁగునాయకులు పాండ్యమండలమును చిరకాలము పాలించిరి. ఈకవి యీకాలమునందు మధురాపురమును పాలించుచున్న ముద్దళగిరిరాజు సభలోఁ గూర్చుండి తన్నుఁగూర్చి యిట్లుపలికిన ట్లీపద్యములలోఁ జెప్పినాఁడు—

శా. ఆరీతిన్ సభ ముద్దళగ్రిధరణీధ్యక్షుండు కొల్వుండి తా
హేరాళంబుగ నయ్యెడ న్నడుచుసాహిత్యప్రసంగంబు గం
భీరప్రౌఢిమ వించు నన్నిలిచి నెమ్మిం బల్కె వీణాకన
ద్గౌరీపాణిసువర్ణకంకణరుణత్కారానుకారోక్తులన్.

చ. అనువుగ రుక్మిణీపరిణయంబును ముక్తిహావణించి యార్యులౌ
ననఁ దనరించినావు మఱి సత్ప్రతిమంబుగ నవ్యకావ్య మిం

వున రచియింపుమీ సాగసుపోఁడిమి మీఱఁగ సత్యభామసాం
త్వనము గప్పురంపుఁ జలువం గెలువం దిరుకామపత్క్షితీ.
క. కాకులవలె నింటింటను । గాకవు లున్నారు హంసకైవడి భువిలో
శ్రీకామ నీకె తగురా । యేకడ నుడిపాలు నీరు నేర్పఱుపంగన్.
క. ఏభాష నైనఁ గృతిపతి । శోభనములు చెందు నీదుసూక్తులవలనన్
నీభాగ్య మసదృశము గా । రీభవకరుణానివేశ శ్రీకామేశా.
ఈముద్దళగిరి తన సవతియన్న గాఁ గయిన చొక్కనాథునకు స్త్రీలోలుఁ డయి రాజ్య
భారమును తమ్మునిమీఁదఁబెట్టి తంజావూరిలోనున్న కాలములో యువరాజుగా రాజ్య
ము చేసెను. చొక్కనాథుఁడు క్రీస్తుశకము ౧౬౬౦ వ సంవత్సరము మొదలుకొని
౧౬౭౨ వ సంవత్సరము వఱకు రాజ్యము చేసెను. కవి యీముద్దళగిరినే రాజునుగా
వర్ణించినను, ఆతని వర్ణనలోఁ గల యీ క్రిందిపద్యమునుబట్టి యన్న యుండఁగానే
యితఁడు రాజ్యభారము వహించినట్టు స్పష్ట మగుచున్నది.—
ఉ. అన్నయు దమ్ము లీకరణి నన్వయు నొద్దికయై యశోరమల్
చెన్ను వహింప రామనృపచేఁ దనుఁ జెందినరాజ్యసంపద
భ్యున్నతభోగభాగ్యుఁడయి యుర్విని సర్వనృపాలకోటిలో
నెన్నిక కెక్కు ముద్దళగిరీంద్రుఁడు తాను మహోన్నతస్థితిన్.
ఈముద్దళగిరి ౧౬౭౮ వ సంవత్సరప్రాంతమునఁ దానే రాజ్యము నాక్రమించుకొని
సంవత్సర కాలము స్వతంత్రముగాఁ దనపేరనే పాలనముచేసెనుగాని యింతలో
చొక్కనాథుఁడు వచ్చి దేశము మరల స్వాధీనము చేసికొనెను. చొక్కనాథుఁడును,
ముద్దళగిరియు, మఱికొన్నాళ్లు ౧౬౮౦ వ సంవత్సరము మొదలుకొని ౧౬౮౨ వ
సంవత్సరమువఱకును రాజ్యముచేసి ప్రసిద్ధికెక్కిన తిరుమలనాయకుని కొమాళ్ళు.
ఇందుఁ దెలుపఁబడినచరిత్రమునుబట్టి కవి యీగ్రంథము ౧౬౭౮ వ సంవత్సరప్రాం
తమునందు రచించినట్టు తెలియవచ్చుచున్నది. ఇతఁడు రుక్మిణీపరిణయమును గూడ
రచియించినట్టు చెప్పఁబడినదిగాని యాపుస్తకము నాకు లభింపలేదు. „దక్షిణసింహాస
నాధ్యక్ష తిరుమలక్ష్మాకాంతకరుణాకటాక్షలక్షిత స్వచ్ఛముక్తాగుచ్ఛసితచ్ఛత్ర
చామరకళాచికా కనకాందోళికా విరాజోపచార” యని యాశ్వాసాంత గద్యమునఁ
జెప్పుకొనియుండుటచేతఁ గవి తిరుమలనాయకునికాలమునందుసహిత ముండి ౧౬౫౦వ
సంవత్సరప్రాంతమునుండి కవిత్వమునందుఁ బ్రసిద్ధిఁగాంచియుండును. ఈగద్యమునందే
యితఁడు ‘శ్రీకాళహస్తీశ్వర చరణారవింద మిళిందాయమాన జ్ఞానప్రసూనాంబికా
కృపాలంబవిజృంభమాణ సారసారస్వత సుధాతరంగ” యని చెప్పుకొనుటచే నితఁడు

కాళహస్తినివాసుఁడయి మధురనాయకుల యాదరమువలన మధురసంస్థానమును జేరినట్లు కనఁబడుచున్నది. విజయవిలాసమువలెనే యిదియు శుద్ధ ద్రవిడదేశమునందుఁ జేయఁబడిన ప్రబంధము. ఇవిగాక యాదేశమునందుఁ జేయఁబడిన తెలుఁగుకావ్యములింకను బెక్కులు గలవు. "వల్లకీవాదన ధురీణ వర్గగీతాది గాంధర్వస్వరనవీనకల్పనా ప్రవీణ" యనియు గద్యమునందు కవి వ్రాసికొన్నాఁడు. అందుచేత నితఁడు సాహిత్యమునందుమాత్రమే కాక సంగీతమునందును బ్రవీణుఁడని విశదమగుచున్నది. ఈకవి యింటిపేరు లింగనమఖివారు; తండ్రిపేరు నాగనామాత్యుఁడు; తల్లిపేరు కామాత్యంబ. ఈతనికవిత్వము ప్రౌఢమయినది. సత్యభామాసాంత్వనమునుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాము.—

ఉ. ఆపురమందుఁ గాంపుజిగియందపుఁగోట పయోధికన్యకన్
బ్రాపయి తమ్మిపోలికను భాసిలెఁ గొమ్మలు తేఁకు లట్లు చా
లై పరఁగెం దదంతరగతన్నవమౌక్తికలీల నబ్ధిపీ
చీపృథుశీకరమ్ము లెగఁజిమ్మ హరి సేసలు చల్లు కైవడిన్.

ఉ. తావులవెంబడిం గదలి తారొగ్గనెఁ దేఁటులుం దేఁటికొల్లలం
బోవక నాఁటెఁ బుష్పశరుఁ బుష్పడితోఁ దగఁ బూవుసోన యా
పూవులసోనతో మిగులఁ బొల్చెను గల్పతరుప్రసూనమా
ధ్వీవిసరంబు నావెనక పీచెను జల్లెఁ గమ్మతెమ్మెరల్.—ఆ. ౧.

ఉ. చూడక చూచినట్లు తమి సోలుచు సొక్కుచు మోహ మించి మా
టాడక యాడినట్లు కలయం గమకించి మనం గణించి యా
చేడియతో విలోకమయి చింతిలి కార్యము నెంచకుండుటల్
పాడియె తెల్పుమా యనితె పాండవకాళికుమారితాండవా.—ఆ. ౩.

శా. భాసిల్లెన్ని సొవరేణుశుభగంభావక్రియావీక్షణో
ల్లాసోదారముకుందవారకృతలీలాలాస్యసాహస్యభృం
గీసంగీతతరంగితాబ్జవిచిభంగీజాతరంగోల్లస
త్కాసారాబ్ధితరంగజాలము శరత్కాలం బకాలంబుగన్.—ఆ. ౪.

## వెణుతురుపల్లి విశ్వనాథకవి.

ఇతఁడు శివధర్మములను పద్యకావ్యమునుగా రచియించి పెద్దాపురసంస్థానాధీశ్వరుఁడయిన వత్సవాయ తిమ్మనృపాలుని కంకితము చేసెను. ఇతఁ డారువేలనియోగి

బ్రాహ్మణుఁడు. ఈతని తండ్రి పేరు వేంకటామాత్యుఁడు. ఇతఁడు ౧౬౦౦వ సంవత్సర ప్రాంతములం దుండినవాఁడు. ఈకృతిపతినిఁగూర్చియు కృతికర్తనుగూర్చియు నేమఁగు లక్షణకవిచరిత్రమునందుఁ గొంత తెలుపఁబడి యున్నది. ఇతనిది సలక్షణమయిన మంచికవిత్వము. ఈతనిశేషధర్మములనుండి కొన్నిపద్యము లిందుఁ గైకొనఁబడు చున్నవి—

శా. మాయావిప్రుల కావ్యజుండు కడిగెన్ బాదాంబుజద్వంద్వముల్
చేయారం గుణమాత్మజాదులను బూజించెం గాత్రము ల్వైచె న
ట్లాయాపాత్రములందు నన్నము లిడన్ నారంభుఁ డౌనంతలో
నాయింద్రుండు గృహస్థుఁడూని పలికెన్ సాక్షేపవాక్యంబుగన్.—ఆ.౧.

ఉ. కాలినయిప్పగుండ్లమఖగహ్వరభాగములందుఁ గ్రుక్కుచున్
సోలుపు లేగ్పన న్మెఱుఁగుపూవులు కన్నులఁ గ్రుచ్చుచుం దలల్
నేలనుఁ జేర్చి పాదములు నింగికి నెత్తుచుఁ బెక్కుజాడలన్
గాలభటుల్ వ్వెతల్గనుపఁగాఁ బడియుందురు రంగమీఁదటన్.—ఆ. 3.



## నూతనకవి - సూరన్న.



ఈకవి సకలజనాభిరామ మను నామాంతరముగల ధనాభిరామ మను మూఁడాశ్వాసముల పద్యకావ్యమును రచించెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; కాశ్యపగోత్రుఁడు; తిప్పయామాత్యపుత్రుఁడు. కవి తన్నుఁగూర్చి యిట్లు చెప్పుకొనుచున్నాఁడు.—

సీ. శ్రీసర్వవైభవాపస్తంబసూత్రుండఁ గాశ్యపగోత్రవిఖ్యాతయశుఁడ
ఘనత ననంతసేనుని మల్లయామాత్యపౌత్రుఁడఁ దిప్పయప్రభుసుతుండఁ
భాగ్యవతీశుభగర్భపాథోధిధానసంధానశశితుండ మానధనుఁడ
సత్కావ్యపాఠీణ సాహిత్యసంలబ్ధవిస్తారమతి గల విమలయశుఁడ
భద్రవైభవశ్రీవీరభద్రలబ్ధ । జనితచాతుర్యకావ్యలక్షణవిచిత్ర
విపులవాచాసమగ్రసంసిద్ధమతిని । సూరనామాత్యనామక సుకవివరుఁడ.

కవి తనగ్రంథమున వ్రాసికొన్న యీక్రిందిపద్యమునఁబట్టి తాను దిక్కనసోమయాజి సంతతివాఁడనని చెప్పుకొఁదలఁచినట్లు కనుపట్టుచున్నది—

ఉ. ఆహవపుగ భ్రాంతాంబునిధి యవ్వలికిం దగనెట్టి యందులో
ఘనకవితామృతంబు చవి గాంచిన తిక్కన సోమయాజిపా
వనతర మైనయట్టికులవర్గ్యుఁడనై మహి పేరుగల్గు నూ
తనకవి సూరనార్యుఁడను ధర్మగుణాంచితపాలనీయుఁడన్.

ఈకవి తనకావ్యమును దాక్షారామభీమేశ్వరుని కంకితము చేయుటచేత నితఁడు గోదావరీమండలములోనివాఁ డయినట్టు కనఁబడుచున్నాఁడు. ఈతఁ డేకాలపువాఁడో తెలియ రాలేదుగాని పూర్వకవులను మధ్యకవులనుమాత్రము స్తుతించి చిమ్మపూడి యమరేశ్వరుని

చ. అలఘుని శబ్దశాసనపదాంకితుఁ దిక్కనసోమయాజి ని
శ్చలమతి శంభుదాసు బుధసన్నుతు నాచనసోమనార్యుఁ జె
న్నలరిన చిమ్మపూడి యమరాధిపు భాస్కరు రంగనాథునిం
దలఁతు నపూర్వదివ్యకవితామహనీయసమగ్రచిత్తులన్.

అని కవిస్తుతిలోఁ జేర్కొనియుండుటచేతను, ఇంతమంది పూర్వకవులను జెప్పి మధ్యకవులలో నొక్కరిని జెప్పకపోవుటచేతను, ఇతఁడు మధ్యకవులలోఁ జేరినవాఁ డేమో యని సందేహము కలుగుచున్నది. అయినను స్వతంత్రము లైన యితరాధారములు లేక మధ్యకవులను జేర్కొనక పోయినంతమాత్రమున నితఁడు మధ్యకవి యని నిశ్చయించుటకు వలను పడదు. కాని యితఁ డిన్నూఱుసంవత్సరముల క్రిందటివాఁ డని యైనను జెప్పవచ్చునని తోఁచుచున్నది. ఈతఁడు రచియించిన ధనాభిరామము కథ కొంతవఱకు మనోహరముగా నున్నది. ఇంద్రసభామందిరమునందు మన్మథునికిని కుబేరునికిని రూప మెక్కువ యనియు ధన మెక్కువ యనియు వివాదము సంభవించి వారితగవు మాటలతో తెగనందున

చ. తరమిడి యిన్నిమాటలు వృథాపని లేదు సమస్తవైభవో
త్కర మగుదాక్షవాటిపురి గల్గు ధరాస్థలిలోనఁ బోయి నీ
నిరుపమరూపసంపదయు నేరుపుఁ జూపుము నేను వచ్చి యా
పురవరసీమఁ జూపెదను భూరిధనంబున నామహత్త్వమున్.

అని కుబేరుఁడు మన్మథునిఁజూచి, మాటలతోఁ బ్రయోజనము లేదు. మన మిద్దఱమును భూమిమీఁద దాక్షారామములోఁ బుట్టుదము అక్కడ నీవు ముట్టమొదట నీసౌందర్యమును నేర్పునుజూపుము తరువాత నేను వచ్చి నాధనమహిమను జూపెదను. అప్పుడు మనయిద్దఱిలో నెవ్వారు బలవత్తరులో తేటపడి రూపమహిమ యెక్కువయినదియు ధనమహిమ యెక్కువైనదియు వెల్లడియగును' అని పలుకఁగా మన్మథుఁ డాతని

యాహ్వాన మంగీకరించి పూర్వకాలమునుండియు వేశ్యలచేఁ బ్రసిద్ధమయినదాక్షవాటికకుఁ బోయి యందుఁ దన రూపవిశేషమును జూపఁగా నాట్యమునకయి భీమేశ్వరస్వామి యాలయమునకుఁ బోయిన సుగుణావతి యను నొక పణ్యయువతి యాతనిని గాంచి కామించి యింటికిఁబోయి యాతనిం దనయింటికిఁ దోడితెమ్మని తన చెలికత్తెను వేఁడుకోఁగా నావయస్య

ఉ. అక్కట వాసివన్నె గలయట్టికులంబునఁ బుట్టి రూపుచే
నెక్కుడు భాగ్యసంపదల నెన్నికకెక్కినదాన వింతలో
నెక్కడివానికిన్వలచి తెచ్చితొ వానికులంబు విన్న వా
రొక్కట నవ్వరే వినుము ముత్పలలోచన నీకు మ్రొక్కెదన్.

ఉ. నిచ్చలు నిండి వల్లభులు నీకడ గానుగ లేక కానుకల్
తెచ్చి తమంతఁ గ్రందుకొని తేఁకువ మోసలఁ గాచుచుండఁగాఁ
జెచ్చెరవారలన్ ఘనము చేయక డాయక యూరకున్నచో
నొచ్చెము కాదె నీకును బయోరుహలోచన యిప్పురంబునన్.

చ. కలికితనంబుమీఱఁగ వికారముతోడ మనోజకేళి ని
చ్చలుఁ దమకంబుపుట్టి విటసంఘము తెచ్చియొసంగునీమహో
జ్జ్వలమణిభూషణాదిఘనవస్తువు లొందుట కీర్తిగాక తా
వలచుట పంతమా ధరణి వారవధూమణికిం దలోదరీ.

అని యపారధనము నిచ్చెడు విటు లనేకు లుండఁగా ధన మియ్యఁజాలని క్రొత్తవానిని కేవలరూపసంపదను జూచి వలచుట వారకాంతకు ధర్మముకాదని బుద్ధి చెప్పియుఁ గార్యము గానక తుదకు మన్మథుని దానియింటికిఁ దెచ్చి యప్పగించెను. సుగుణవతియు మన్మథుఁడును గొంతకాల మీప్రకారముగా సుఖ మనుభవించుచుండఁగా, కుబేరుఁడు యోగివేషమున వచ్చి భీమేశ్వరస్వామియాలయమునఁ జేరి యచ్చటికి వచ్చెడు వేశ్యల కెల్లను ధనమును చీరలును గొలఁగా నొసఁగసాఁగెను. అంత సుగుణవతి తల్లియు నొకనాఁ డచ్చటికిఁ బోయి యాతఁ డిచ్చిన కనకాంబరములను దెచ్చి కూఁతునకుఁ జూపి బోధించి మఱిమఱి రూపవంతుఁ డయినవాని విడనాడి విత్తవంతుఁడైనకుబేరుని గూడునట్లు సుగుణవతి నొడఁబఱిచెను. అంతట మన్మథుఁ డోడిపోయి దేవాలయముచేరి భీమేశ్వరస్వామిని ప్రార్థింపఁగా నతఁడు సాక్షాత్కరించి, యొకప్పుడు ధనమును మఱియొకప్పుడు రూపమును విజయము నొందినను మొత్తముమీఁద ధనసౌందర్యములు రెండును సమానములే యని తెలియఁబలికి వా రిరువురిని సమాధానపఱిచి వారి స్థానములకు వారిని బంపివేసెను. ఈపుస్తకము చిన్నదే యయినను, కవిత్వము

హృద్యముగానే యున్నది. శైలిని జూపుటకై ధనాభిరామమునుండి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను.—

చ. మదముని గాఁ దలంతు రిల మానుతెల్లను, సత్కవీశ్వరుల్
పదపడి కర్ణుఁ డీతఁడని ప్రస్తుతిచేయుదు రాత్మలోపలన్,
మదవదరాతివర్గములు మారుగఁ గవ్వడి యంద్రు, భూజనుల్
మని దినవాథుఁ డందురు, సమస్తము ద్రవ్యముఖంబు చూచినన్.—ఆ. ౧.

ఉ. కమనీయంబుగ నాడఁ బాడఁ జదువంగా నేర్చు వీణాది వా
ద్యములన్నైపుణి సొంపుమీఱఁగఁ గళాశాస్త్రాంగతంత్రంబులన్
సుమనస్స్ఫూర్తిమనోజకేళి విటులం జొక్కింపఁగా నేర్చు వి
భ్రమ సౌందర్యముల న్వహించు సరిచెప్పన్ లేరు నాపుత్రికిన్.—ఆ. ౩.

## సముఖ-వేంకట కృష్ణప్పనాయకుఁడు

ఈకవి యహల్యాసంక్రందన మనుమూఁడాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఇతఁడు శూద్రకులజుఁడు; సముఖమీనాక్షినాయకుని కుమారుఁడు. "శ్రీమత్పాండ్య మండలాధీశ్వర విజయరంగచొక్కనాథ మహీనాథ కరుణాకటాక్ష సంపాదిత గజ తురంగమాందోళికా ఛత్రచామరవిజయ దోహళకాహళభూరిభేరీ బిరుదధ్వజప్రముఖ నిఖిలసంపత్పారంపరీసమేత' అని యాశ్వాసాంత గద్యమునందుఁ జెప్పుకొనుటచేత కవి మధురాధినాథుఁ డయినవిజయరంగ చొక్కనాథుని కాలములో నున్నవాఁ డగుట స్పష్టము. ఈవిజయరంగ చొక్కనాథుఁడు క్రీస్తుశకము ౧౭౦౪ వ సంవత్సరము మొదలుకొని ౧౭౩౧ వ సంవత్సరమువఱకు పాండ్యమండలాధీశ్వరుఁడుగా నుండెను. కాఁబట్టి కవియు ౧౭౨౦ సంవత్సరప్రాంతములయందు నుండి యున్నవాఁడే. ఇతఁడు జైమిని భారతమును వచనకావ్యముగా రచించి నట్లహల్యాసంక్రందనములోని యీక్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

గీ. సముఖమీనాక్షినృపగర్భవిమలజలధి। చంద్ర వేంకటకృష్ణేంద్ర శౌర్యసాంద్ర
ముఁడు జైమినిభారత మనఘ వచన। కావ్య మొనరించినట్టిసత్కవివికాసి.

ఈకాలమునందే మంచికవులచేత తెలుఁగున వచనకావ్యము లారంభింపఁబడినట్లు వినఁబడుచున్నవి కాని యావచనకావ్యము లిప్పుడు కానరావు. తారాశశాంకమును రచించిన శేషము వేంకటపతి యీకవికాలమునం దుండినవాఁడు. కవితాను "పురోహిత

భృత్యామాత్య సామాజిక బంధువర్గంబులు కొలువం గూరుచుండి యుభయభాషాకవి
తా విశేషుండై శేషము వేంకటపతికవీంద్రుం డాప్తసఖుండు గాఁ గొలిపించి • నవు
డతఁ డీక్రిందిపద్యము జెప్పెనట—

చ. నల నాసత్య వసంతులం గెలుచు సౌందర్యంబు ధైర్యంబు దో
ర్బలగుణ స్వామిహితానువృత్తి సమయప్రౌఢత్వము న్విద్యయున్
వెలయన్ బాల్యమునందె నీవు మధురోర్వీనాథు మెప్పింపవా
యలఘా వేంకటకృష్ణనాథగుణశ్రీ బాహాఫణిగ్రామణీ.

అహల్యాసంక్రందనములోని రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. బంటులయందు లాఁతుకొని పాఱక రావణు చేతఁ బెట్టుకన్
గంటికి నీవు గ్రమ్మఁ గలఁకంబడి పాఱక నీదుతండ్రి నీ
యుంటను లేదు పౌరుష మొకింత యు ధీరములేల చేతివా
లంటను గోడెకాఁడు చుఱుక్కనఁ గట్టెగ నెంటనె చెంపఁ గొట్టెదన్.—ఆ. ౧.

ఉ. ఆతని నాలతాంగిని మహోగ్రహదృష్టిని జూచి యోసి నీ
చేతిజలంబు లంట విరిఁ జెల్లునె యొంటిజంత వేఁ గలా
రాతినిగాఁ దీ విఱుదు గాతిజాయునఁ గావుమన్ బరా
రాతిశరీర మరుసు రాజముఖి సుముఖిన్ శపింపఁగన్ —ఆ. 3



రేపనూరి - వేంకటపతి.



ఈకవి విష్ణుమాయావిలాస మను మూఁడాశ్వాసముల పద్యకావ్యమును రచియించి దానిని వేంకటగిరిసంస్థానప్రభువయిన శ్రీవెలుగోటి బంగారు యాచమనాయని కంకితము చేసెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; లింగనామాత్యుని పౌత్రుఁడు; గంగనమంత్రి పుత్రుఁడు; కాశ్యపగోత్రుఁడు. కృతిపతి తండ్రియైన కుమారయాచ భూపాలుఁడు తనకు „తిక్కయమ్మ" యను బిరుదము నిచ్చినటు కవి యీపద్యమునఁ జెప్పినాఁడు—

మ. ఘను శ్రీనూపతిలింగపాదభజనానందుం గుమారేంద్ర భూ
జనపాలాగ్రణి తిక్కయమ్మయనుచుం జాలంగఁ బేరిచ్చి ప్రో
చినఁ బెంపొందినరేపనూరికులుఁడన్ శ్రీవేంకటాఖ్యుం గృపా
ఘనగంభీరశుభైకదృష్టి నెలముం గాంచి పల్కెం దగన్.

కృతినాయకుఁ డైనబంగరుయాచమనాయఁడు ఔరంగజేబు ఢిల్లీచక్రవర్తిగానున్న
కాలములో ౧౬౯౫ వ సంవత్సరమునందు వెల్లూరినబాబగు జుల్ఫకారుచేఁ జంపఁ
బడినందున, ఈపుస్తకము ౧౬౯౦ వ సంవత్సరప్రాంతములయందు రచియింపఁబడిన
దని చెప్పవచ్చును. వేంకటగిరిసంస్థానప్రభువు లనేకులు తెలుఁగుభాషయం దభిమానము
గలవారయి కవులను బ్రోత్సాహపఱిచి తా మనేక ప్రబంధములకుఁ గృతిపతు లయిరి
వీరు పద్మనాయకవంశజు లయినవెలమలు. ఈసంస్థానమును స్థాపించిన మూలపురుషుఁడు
బేతాళనాయఁ డనబిరుదనామము గల చెవిరెడ్డి ఇనఁడు చేయూరి పోలిరెడ్డికుమా
రుఁడు. ఇతఁడు తననివాసస్థలమైన యనుమగల్లుగ్రామమున రేచర్ల యాచఁడు
(ఏచఁడు) అను మాలవానిచేతఁ దనపొలమును దున్నించుచుండఁగా నాగటికర్రున
కొకరాగిశాసనము తగిలెను. దానిని జదివిచూడఁగా నందు "నాగభైరవపొలము"
అనెడి యాచోట తొమ్మిదిలక్షలధనము భూస్థాపితమయి యున్నదనియు, నరబలి
యిచ్చినపక్షమున బలియిచ్చినవాని కాధనము దక్కుననియు, వ్రాయఁబడియుండెను.
అతఁ డప్పు డేమిచేయుటకును తోఁచనివాఁడయి యేచనితో నాలోచింపఁగా, వాఁ
డాస్థలమునందుఁ దనయింటిపేర నొక గ్రామముకట్టించి తనయింటిపేరును గోత్రముగాఁ
బెట్టుకొని వంశమునందుఁ బుట్టినపురుషులకెల్లను దనపేరుపెట్టుచు వివాహము చేయ
వలసి వచ్చినప్పుడెల్లను ముందుగాఁ దనకులజులలో నొక్కనికి వివాహముచేయుచు వచ్చు
ట కంగీకరించినపక్షమునఁ దాను బలియగుట కొప్పుకొనెద నని రెడ్డితోఁ జెప్పెను.
చెవిరెడ్డియు వాఁడు కోరినయంశముల కన్నిటికి నొప్పుకొని యప్పుడే వాని న్నాపొల
మునకు బలిపెట్టి యానిక్షేపమును స్వాధీనము చేసికొనెను. తరువాత నతఁ డాక్షేత్ర
మున రేచెర్ల యను గ్రామమును గట్టించి, ఆ గోత్రమును రేచర్ల వారని మార్చుకొని,
ఆయూరు విడిచి పిల్లలమఱ్ఱి యనుగ్రామముచేరి యాచోటు నివాసముగాఁ జేసికొ
నెను. ఈగ్రామమునం దతఁ డొకనాఁడు రాత్రి చీఁకటిపడువఱకును పొలములోఁ
బనిచేసి యింటికి వచ్చుచుండఁగా దారిలో నురుములతోను మెఱుపులతోను గొప్ప
వానవచ్చెను. ఆవానలో నతఁ డొక మఱ్ఱిచెట్టుక్రిందికిఁబోయి నిలువఁబడియుండఁగా,
చెట్టుమీఁదినుండి యొకభూతము దిగివచ్చిన ట్లాతనిదృష్టికిఁ గనఁబడెనఁట! అతఁ
డింతమాత్రమును జడియక చేత ఖడ్గముధరించి యెదురుగా నడువఁగా, ఆతని ధైర్య
సాహసములకు మెచ్చి యాబేతాళుఁడు చెవిరెడ్డియు నాతనిసంతతివారును శౌర్య
సామ్రాజ్యైశ్వర్యవంతు లగుదురనియు శత్రులతోడి యుద్ధములో నెల్ల దాను దోడ్పడి
వారికి జయము కలిగింతు ననియుఁ బలికిన ట్లాతనిచెవులకు వినఁబడెనఁట! బేతాళుఁ
డాతనికిఁ బ్రత్యక్షమయి వరములిచ్చె నన్నవార్త దేశమునం దంతటను వ్యాపించి య

చిరకాలములోనే కాకతీయప్రభు వయిన గణపతిరాజు చెవిసోఁకఁగా, అతఁడా చెవిరెడ్డిని తనరాజధాని యైన యోరుంగల్లునగరమునకు రప్పించి లక్షరూపాయలువచ్చు గ్రామము నిచ్చి తనవద్ద సేనాపతినిగా నియమించి „పిల్లలమఱ్ఱి బేతాళనాయఁడు" అన్నబిరుదుపే రిచ్చి గౌరవించెను. ఇది ౧౨౫౦ వ సంవత్సరప్రాంత మయియుండును.

ఈతఁడు చేసిన నియమముల ననుసరించి యీతనివంశమువారు నేటివఱకును యాచనామమునుగూడఁ దమపుత్రులనామములకుఁ జేర్చుచు, తమయింట వివాహము జరుగుటకు ముందుగా నొకమాలవానికిఁ బెండ్లిచేయుచు, పూర్వ మర్యాదను జెల్లించుచున్నారు. చెవిరెడ్డియొక్క ద్వితీయపుత్రుఁ డయిన ప్రసాదాదిత్యనాయఁడు గణపతిరాజుయొక్క మరణానంతరమునం దాతనిభార్యయును బుత్రికయును సహాయుఁ డయియుండి రాజ్య మన్యాక్రాంతము కాకుండఁ గాపాడి కాకతిరాయ రాజ్యప్రతిష్ఠాపనాచార్యుఁడని బిరుదందెను. చెవిరెడ్డియింటిపేరు రావువారు. ఈరావువారు మొదట నోరుగల్లురాజ్యమున నేయుండి పేరొందినను, తరువాతఁ దమపౌరుషమువలన నన్యభూముల నాక్రమించుకొని సంస్థానప్రభువులయిరి. ఈవంశమువారిలో నొకఁ డగు తిరుమలనాయఁడు కృష్ణదేవరాయలరాజ్యకాలములో వెలుగోటిరాజ్యమును సంపాదించి వెలుగోడుపట్టణము తన రాజధానిగాఁ జేసికొన్నందున, ఆతనివంశమువారప్పటినుండియు వెలుగోటివారనఁబడుచున్నారు. విష్ణుమాయావిలాసకృతిపతియొక్క తాతయైన పెదయాచమనాయఁ డావలి కన్యాక్రాంతమయిన వేంకటగిరిపురమును మరల స్వాధీనపఱచుకొని దానిని స్వరాజధానిని జేసికొనఁగా నాటినుండియుఁ దత్సంతతివారి కదియే రాజధానిగా నున్నది. చెవిరెడ్డివంశజులలో నొక్కఁ డగు సర్వజ్ఞ సింగమనాయఁడు బమ్మెర పోతనామాత్యునివలన నుద్దండభోగినీదండకమును శ్రీనాథునివలనఁ గొన్నికృతులను బొందుటయే గాక తాను పండితుఁడయి సింగభూపాలీయ మను నలంకారశాస్త్రము మొదలగు సంస్కృతగ్రంథములను సహితము రచించెను. ఆతనివంశజులలో నొకఁ డగు రాయపనాయఁడు ౧౬౦౦ వ సంవత్సరప్రాంతముల యందు భానుమతీపరిణయము కృతినందెను. ఈవెలుగోటివా రిప్పటికిని తెనుఁగుకవుల నాదరించుచున్నారు. కవిత్వరీతి తేటపడుటకయి విష్ణుమాయావిలాసములోని రెండుపద్యములఁ జూపుచున్నాను—

చ. ఇటువలెనేమి యాపయనమిట్లు మీ రఖిలేశ మాయలన్
బటువగు విష్ణుఁడం చనెడుపల్కులు సిద్ధము సుందరీకృతా
కుటిలశిరోజయైన హరి గొబ్బునఁ జూచితి రేని మీకు నొ
క్కటఁ జపలత్వ మైతి గౌరవ మెట్లగునో తలంపుఁడీ.—ఆ. ౧.

చ. వనయువతీవసంతులవివాహమహోత్సవవేళ నెమ్మనం
దనరు కుతూహలంబున లతాలలనల్ కరపల్లవంబులన్
ఘనముగ నేసవెట్టుటకుఁగా ధరియించినమౌక్తికంబులో
యనఁ బలసిల్లె నల్లెడ మహాకుసుమాగ్రకోరకావళుల్.— ఆ 3.

## పైడిమఱ్ఱి - వేంకటపతి.

ఈకవి చంద్రాంగదచరిత్ర మనెడి యాఱాశ్వాసముల ప్రబంధమును రచించి యున్నాఁడు. ఈతనికవిత్వము మిక్కిలి ప్రౌఢ మయి రసవంత మయి పూర్వకవుల రచనను బోలి హృదయాహ్లాదకర మయినదిగా నున్నది. ఇతఁడు తన గ్రంథమును శ్రీరామాంకితము చేసియుండుటచేఁ గృతిపతినిబట్టి యీతనికాలనిర్ణయము చేయుట కాధారము కానఁబడలేదు. ఉన్నయాధార మంతయు కృతికర్త తనవంశవర్ణనము చేసికొన్న యీక్రిందిపద్య మయియున్నది—

సీ. సకలసత్కవిశ్లాఘ్యసుకవిత్వసామ్రాజ్యనిర్వాహకుఁడు పెద్దపర్వతన్న
వివిధభాషాకావ్యవిరచనాచాతుర్యసర్వంకషుఁడు బోడిపర్వతన్న
వరపద్యదాకారవాచాచమత్కారనిరుపమమతిశాలి తిరుమలన్న
యవధానకృతిగర్భకవితాచ్ఛపందర్భకీర్తిసంప్రజ్ఞుండు కేశవన్న
దనకు నన్నలు గాఁగను దనరుకృష్ణ | రాయభూషణకులరామరాజతనయ
కేశవాత్మజ పర్వతాఖ్యసు వేంక | టాద్రి నిడెఁ గావ్య మేశున కంకితముగ.

ఇందలి పేరులనుబట్టియు కవికాల మిదియని నిశ్చయించుట కాధారము దొరకలేదు. ఇందు కృష్ణరాయభూషణ యనుపద ముండుటనుబట్టి కర్నల్ మెకంజీదొరగారు సంపాదించిన లిఖితపుస్తకములపట్టికలో కవి కృష్ణదేవరాయని కాలములోనివాఁ డని చెప్పఁబడి యున్నది. ఇటీవల బ్రౌన్‌దొరగారు నిఘంటుపునం దీకవి యాధునికుఁ డని వ్రాసియున్నారు. పయిపద్యములో నున్న కృష్ణరాయభూషణశబ్ద మొకఁడే కృష్ణదేవరాయనియాస్థానమున కలంకారముగా నుండుటచేతనే వచ్చినను, ఈకవి కృష్ణరాయభూషణుని వంశజుఁ డగు రామరాజుకొడుకైన కేశవార్యునిపుత్రుఁ డగుపర్వతాఖ్యునిసుతుఁ డగు వేంకటపతి యగుటచేఁ గృష్ణదేవరాయని యనంతరమునఁ బెక్కుతరములు గడచినతరువాత నున్నవాఁ డగుట స్పష్టము. అప్పకవి యీచంద్రాంగదచరిత్రములోనిపద్యముల నుదాహరించి యుండకపోవుటచేత నీకవి ౧౬౫౦ వ సంవత్సర

మునకుఁ దరువాతివాఁ డనియు నూహింపఁ దగియున్నాఁడు. అందుచేత కవి ౧౭౦౦వ సంవత్సరప్రాంతముల యందున్నవాఁ డని తోఁచుచున్నది. చంద్రాంగదచరిత్రము నుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. అప్పుచు లాడుచుం జగవు లాడుచు బారలు సాఁచిసాఁచి మా
యప్పలు వచ్చి రంచు సకియల్ గనుదమ్ములు మోడ్చి పిల్వఁగా
గుప్పునఁ దప్పితప్పటడుగుల్ నడలం గొమరుండు పైఁబడుం
దప్పక చూచు తల్లికిని దండ్రికి ముచ్చట తీఱునట్లుగన్.—ఆ. ౨.

మ. హరిమోలం గదుపోటుబంటు నయి గర్వాలాపముల్మన్న స
త్వరతం బల్కుచుఁ గొన్ని నోకోలఁదల్ తథ్యంబు నేఁ డన్నియున్
బరఁగం బందఱఁ జెప్పుసాధనగతిన్ బాటిల్లె వ్యర్థంబులై
సురలోకంబున కేగు కెట్లు సవయస్యుల్ ల్వన్నెల న్నవ్వఁగన్.—ఆ. ౩.

సీ. భుజగలోకాధీశ భోగితల్పశయాన హరిరూపధర మహాపురుష యనుచు
సకులార్కకులకుటవర్తితపాదరాజీవ రామార్చనీయ శ్రీరంగ యనుచు
మారీచమదభంగ మహితవాంఛావ్యాప్త శరదనిద్రితనేత్ర శౌరి యనుచు
సముద్రగవర్గావసరయోగనిద్రాణ కంగాంగవరద శ్రీకాంత యనుచుఁ
దలఁకు నులుకును నలుకు ...గ్గిలుచుఁబలుకు | సఖులనయనస్వర్శిరోంచరణకలన
పవనశంపిగ్రఘునహంస ...వసతురంగ | భటుఁట ప్రియసముదాయపటిమదోఁ. ప.ఆ.౪.

ఉ. ఓరిమృగాంక నాఁడడఁకు నోడినరాహువు కినుకన్ నంకుమన్
నేఁ డిప బలు నీయొడలఁ గొఱిగఁ గొఱలకొన్ని నక్రుఁడు
ర్వారగతిం ద్వదీయకిరణావళిపుంజముల నోడ్చసాఁగెఁ బె
న్వేఁముఁ ... యిచ్చితి నీదగుచేతఁగఁ జూడ కమ్మెయిన్.—ఆ. ౫.

## వెలగపూండి కృష్ణయ్య.

ఈకవి భానుమద్విజయ మనెడి యైదాశ్వాసముల ప్రబంధము రచియించెను. మఱియు నితఁడు మాలతీమాధవీయము, గాలికాశాస్త్రము, చతుర్విధకందశతకము, అను పద్యకావ్యములను, వేదాంతసారసంగ్రహ మను వచనకావ్యమును, రచించినట్లు భానుమద్విజయములోని యీక్రింది పద్యములోఁ గవి చెప్పుకొనియున్నాఁడు—

సీ. మహిలోనమాలతీమాధవీయ మనంగ శృంగారకావ్య మొసంగఁజేసి
గాలికాశాస్త్రంబు కవిలోకహితముగా నెనయ నేకాశ్వాసమున రచించి

షట్పల్లకంగందపద్యపుశతకంబు నాల్గుయోగంబుల ననువుపఱచి
సన్నుతవేదాంతసారసంగ్రహశాస్త్ర మమరంగ వచనకావ్యం బొనర్చి
చాటుకృతులను మఱికొన్ని సంఘటించి। మానుగాంకితమొనరించి మించిపుణ్య
శాలియనఁ గీర్తిఁగైకొన్న సత్కవీంద్రు। మధురవాక్సాంద్రుఁ గృష్ణయామాత్యచంద్రు

పూర్వ మీతనివంశపువారు గాంగేయోపాఖ్యానము, సుమంతోదయము, ఆంధ్రకర్ణామృతము, వజ్రభుజోపాఖ్యానము, సేతుమాహాత్మ్యము, దత్తాత్రేయచరిత్రము, మర్యాదరామసచివచరిత్రము, మొదలగుగ్రంథములను రచియించియుండినట్టును గవి యీక్రింది పద్యములతోఁ జెప్పియున్నాఁడు:—

క. భూనుతి గాంగేయోపా। ఖ్యానసుమంతోదయాంధ్రకర్ణామృతముల్
మానిత వజ్రభుజోపా। ఖ్యానము శుభహేతుసేతుమాహాత్మ్యంబున్.

క. దత్తాత్రేయచరిత్రన్। సత్తగు మర్యాదరామసచివచరిత్రన్
బిత్తరపుఁ గృతులు చేసిన। యుత్తమకవు లెల్ల మాకులోద్భవు లరయన్.

ఈకవి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు, లోహితసగోత్రుఁడు; వెల్లపూడి నారసింహార్యపౌత్రుఁడు; నరహరిమంత్రి పుత్రుఁడు. ఈకవి పాండ్యమండలాధీశ్వరుఁడైనవిజయరంగచొక్కభూపాలుని దండనాథుఁ డగుసాంబయామాత్యునిపుత్రుఁ డగుగోవిందయామాత్యునకు మేనమామ యైన ట్లీక్రిందిపద్యమునఁ జెప్పుకొన్నాఁడు—

సీ. పాండ్యభూమండలాఖండలుండైన విజయరంగచొక్కభూజాని కప్త
మండనుం డగుసాంబదండనాథాగ్రణితనయులలో మేటిదండి యగుచు
సంగీతసాహిత్యసంస్కృతాంధ్రకవిత్వసరసజ్ఞుఁడై మేనమఱఁది యగుచుఁ
గామ రొప్పుచుండెడుగోవిందయామాత్యుఁ డనుపమవిద్యాధికార్యసభను
నిండుకొలువుండె నపుడు నేఁ దండఁ జేరి। సారసల్లాపములు మీఱి చతురమతిని
దక్షిణామూర్తికృపకుఁ బాత్రత్వమగుచుఁ। గృతిపతిత్వంబుఁ గోరుసంగతిని దెలుప.

ఇందుఁ జెప్పఁబడిన విజయరంగ చొక్కభూపాలుండు దక్షిణమధురాపురము రాజధానిగా పాండ్యమండలమును క్రీస్తుశకము ౧౭౦౪ వ సంవత్సరము మొదలుకొని ౧౭౩౧ వ సంవత్సరమువఱకును పాలించిన ట్లీవఱకే చెప్పఁబడెనుగదా? అందుచేత నీ కృష్ణకవియు నాకాలపువాఁడే యని వేఱుగఁ జెప్పనక్కఱలేక యే తెలిసికోవచ్చును. కవి సాంబదండనాథుని వర్ణించుచు

సీ. సరిబేటి కూర్కాటిసాదులాఖానుతో ఘటియించె నెవ్వాఁడు ఘనతమీఱఁ
శ్రీదంజావూరు వేషువాయానందరావును నెవ్వాఁడు రహి నడంచె

. మయినూరినంజరాజయుగ రిప్రియవాక్యసంధికి నెనాదుండు శక్తిదాల్చె
* * * సదుపకారి శ్రీవళహస సాంబశౌరి.

అని యతఁడు దాక్షిణాత్యులగు పాదశల్లాఖాను మొదలగువారు నోర్చినట్లు చెప్పి యున్నాఁడు. ఈసదతల్లాఖాన్ 1810 వ సంవత్సరము మొదలుకొని 1813 వ సంవత్సరముదనుక నవాబుగాను డి యూరాక్షిణాత్యరాజ్యము చేసెను. కాఁబట్టి కవి 1810 వ సంవత్సరప్రాంతమునందు మధురాపురములో భానుమద్విజయము రచియించియుండును. ఈతనికవిత్వము రసవంతమైనది. కవితాధోరణి తెలియుటకయి భానుమద్విజయములోని రెండుపద్యములనిందుదాహరించుచున్నాను.—

ఉ. ఏమియు లేఁటడౌవలె యహీనమతిప్రభలుండుచుండఁగా
భూమిపతిత్వ మొందినప్రభుల్ వ్యసనంబులఁ గాంచు టబ్బమే
యేమయిన న్సమేరుధృతి నేర్పడఁబూని సమస్తకార్యముల్
తాము వహించిచూడమని ధాత్రి యరాజక మాను భూవరా —ఆ. 2

మ. గిరులం బాకెసివేయే ఖల్లుగ వశింగిల్కున్నకన్నిరులా
గురువక్షోరుహతారహారములతోఁ గూడం బ్రకాశింప నా
ధరణీశాంగన దస్సహార్తిగతసంతాపంబుచే నేఁడ్చె భా
స్వగవాసప్తికీస్వరాకలితవాచామాధురీవైఖరిన్.—ఆ. 4

## శేషము - వేంకటపతి

ఇతఁడు శశాంకవిజయము మనెడి యైదాశ్వాసముల శృంగారప్రబంధమును జేసి వగలసీంహూర్యన కంకితము చేసెను. శశాంకవిజయమునకు తారాశశాంకమని నామాంతరము గలదు. ఇందుఁ జంద్రుఁడు బృహస్పతివద్ద విద్యాభ్యాసమునకయి చేరి గురుపత్నియగు తార నింటినుండి లేవఁదీసినకథ మిక్కిలి పచ్చిగావర్ణింపఁబడినది. ఈశేషము వేంకటపతి నియోగి బ్రాహ్మణుఁడని తోఁచుచున్నది. ఇతఁడు కందాళరామానుజాచార్యుని శిష్యుఁడు; కృష్ణసూర్యునికుమారుఁడు. కృతినాయకుఁడు తన్నుఁబిలిపించి పలికినట్లు చెప్పఁబడిన యీక్రిందిపద్యములలో కృతిపరంపరలు చేసినట్టు కవి చెప్పుకొనుటయేకాని యొక్కగ్రంథమునైనను పేరొకొనియుండలేదు. —

క. నను రంగేశ్వరపదయుగ ఘనతరభజనానిరూఢకవితాస్సామా
జ్యుని శేషముకృష్ణసుధీ తనయుని బిలిపించి పలికె దయ పైవారఁగ.

చ. అసదృశభక్తి సద్గురుకటాక్షముఁ గాంచి సమంచితాత్మతన్
బిసరుహమాకరందరసపేశలకౌశలవన్మృదూక్తులన్
రసికుల కింపుగాఁ గృతిపరంపరలన్ రచియించి కీర్తిచే
నెసఁగితివయ్య వేంకటపతీ బలి శేషమువంశసత్కృతీ.

ఈకవి పాండ్యమండలాధీశ్వరుఁడైన విజయరంగ చొక్కనాథుని కాలములో నున్నట్లీవఱకే సముఖ కృష్ణప్పనాయకునిగూర్చి వ్రాయునప్పుడే చెప్పఁబడెనుగదా! కవియు తారాశశాంక కృతినాయకుఁడైన వంగల సీనయార్యుని వర్ణించుచు, అఖండమండితమహీమండలమండనాయమానపాండ్యమధురాధరాఖండల శ్రీవిజయరంగచొక్కనాథ మహీనాథ కృపాకటాక్ష వీక్షణానుక్షణ వర్ధమాన.........నిఖిల సంపత్సంపరాకంపితనిలింపనాయకుండని యొక్క విశేషణమును ప్రయోగించియున్నాఁడు. మఱియు ద్వితీయాశ్వాసారంభమున

క. శ్రీవిజయరంగచొక్క క్ష్మావరదయ గురుప్రసాదసంపన్నాత్మా
శ్రీ వరదాచార్యమణీ! శ్రీవరదాస్యైకకృపా సీనామాత్యా.

అని కృతిపతిని సంబోధించియున్నాఁడు. దీనినిబట్టి కవి విజయరంగచొక్కనాథుని కాలములో మధురలో నుండుట నిశ్చయ మగుటచేతను, ఆరాజు ౧౭౦౪వ సంవత్సరము మొదలుకొని ౧౭౩౧ వ సంవత్సరమువఱకును రాజ్యముచేసినవాఁ డగుటచేతను, శేషము వేంకటపతి యాకాలమునం దున్నట్లు స్పష్ట మగుచున్నది. అక్కడక్కడ క్త్వార్థక సంధి మొదలయిన కొన్ని లక్షణదోషము లున్నను, కవిత్వము మొత్తముమీఁద ద్రాక్షాపాకమయి మిగుల రసవంతముగ నున్నది. చక్కని మెత్తని విషమువలె నీతిమాలిన యీ కథ మనోహరము లయిన తేటమాటలతో నింపుగా చెప్పఁబడినందున, అనేకులయిన యౌవనపురుషుల నాకర్షించి పాడుచేయుచున్నది. దుర్నీతిని వర్ణించునప్పుడు కవి తన యసమ్మతిని దెలుపువాక్యముల నెక్కడను ప్రయోగింపక, "లోకములోఁ గొందఱబలల్.........తాటాకులలోన వ్రాసి పరాంగనఁ గూడినఁ బాపమంచు, "ఎన్న పువ్వులన్ వ్రాలదు తేఁటి యట్లు మగవాఁ డనువానికి దోస మున్నదే" యిత్యాదివాక్యరత్నములచేత వలపుగలచోటఁ గలయుటయే పరమార్థ మన్నట్లు తెలిపి పామరులను భ్రమింపఁ జేసియున్నాఁడు. అందును మంచిదని సాధించుటకు సహితము మనవారికి పురాణములనుండి దృష్టాంతములు ఉడ్డోపతండములుగా దొరకు ననుట కీక్రిందిపద్యమును నిదర్శనముగాఁ జూపవచ్చును—

సీ. కన్నకూఁతు రటంచు నెన్నక భారతీసతిఁ గూడఁడే నీపితామహుండు
మేనత్త యనుమేర మీఱి రాధికతోడ నెనయఁడే చిన్న నీయనుఁగుబావ

వరుసె యెంచు నొకింత వావి లేకయు జ్యేష్ఠునెలంతతోఁ బొందఁ జేసె నీగురుండు
మునిపత్ని యనక యహల్యను బట్టఁ జేసె నీదుసహపాఠి యగు పాకశాసనుఁడు
యిట్టి మీవారి నడతలు కట్టిపెట్టి యమ్మ నేచెల్ల న్యాయంబు లాడెదౌర!
కడుసనీ యఱుకు నీ వెఱుంగవితా! మూఱెదవు నన్నుఁ జలపోరు దోసకారి!

"మున్నలదారుకావనస్త్రీలు శివునిం గలియరే? వ్రజభామలు శౌరిం గూడరే? యీ లలనాశిరోమణుల కందుకు నిందుకు నేమి చెప్పుము' యఁట! ఆహా! ఏమి యీదేవత్వలక్షణము! దేవత్వమునకు కల్పములు శుద్ధచరిత్రమే లక్షణముగా నుండవలయును గాని నీతిమాలి యన్యకాంతలఁ గలయుటయే నాసురకృత్యము మఱియేముండును?

ఉ. ఎన్నఁగ రానిమోహమున నేనిటు చిన్నటనాఁటనుండియున్
బెంచితిఁ జెద్దఁజేసితిని జేసెనుగఁ బ్రాయము వచ్చినంతనే
యించుక మాటలాడె నిఁకఁ జిన్నప్రియోక్తుల కిమ్ముపట్టెఁగా?
మంచిది నిన్నుఁ గోరుటకు మాకు స్వతంత్రత లేకపోయెనే?

గురుపత్ని శిష్యునిఁ జిన్ననాఁటనుండియుఁ బెంచి పెద్దవానిఁ జేసెనఁట! అందుచేత నామె కాతనిఁ గోరుటకు స్వాతంత్ర్యము గలదఁట! ఏమి యీదుర్నీతి! దుర్నీతి యింతకంటెను మూర్తీభవించి సంభవింప నేర్చునా? కృతయుగమునం దైనను కలియుగమునం దైనను జారత్వ మెప్పుడును మొదలంట నశింపదు. కృతయుగపు తారలును చంద్రులును మన యీకలియుగమునందును గలరు. అయినను మన యీపాడు కలియుగమునందుమాత్ర మిల్లువిడిచి లేచిపోయినదానిని మగని కిప్పించుటకయి పెద్దమనుష్యులుపోయి జారుని బతిమాలుటయు, మగని కిప్పించిన యాఱునెలలకే సంతానము కలిగినప్పుడు జారపురుషుఁడువచ్చి పుట్టినబిడ్డ కయి యింటిమగనితో తగవులాడుటయు లేవు. ఇవి కృతయుగధర్మములు కాఁబోలును! దూరపుకొండలు నునుపనుట్లు ఆ యకటివారియకృత్యములు కంటికి మనోహరముగాఁగా మనవారు పూర్వకాలము నొగడుచుందురు. బ్రహ్మదేవుని యంతటివాఁడువచ్చి భార్యను గోలుపోయి దుఃఖించుచున్న బృహస్పతికి తారను మరలనిమ్మని చంద్రుని ప్రార్థించెనఁట!

చ. అని పరమేష్ఠి పల్కుటయు నట్లకాకని చంద్రుఁ డయ్యెడన్
ఘనతరగర్భభార నఖకాంతివిరాజితతారఁ దారఁ దా
నను నయనోత్కలం దెలిపి యంపి తోడనె దివ్యతూర్యని
స్వనములు మ్రోసె మింట విరివానలు పర్వెను జంట జంటగన్.

బ్రహ్మదేవుని ప్రార్థన నంగీకరించి చంద్రుఁడు గర్భవతియై యున్న గురుని భార్యను గురుని కియ్యఁగానే, తమగురునిల్లు మాలఁద్రోచి యిట్టి ఘనకార్యమును చేసినందున కాతని

మీఁద సిగ్గులేక నగలు విరులవాన గుఱిసిరఁట!

చ. అమరులతోడ నప్పు డని రబ్జభవుండు భవుండు సద్గురుం
బ్రమదము మీఱఁగాఁ బిలిచి మావచనంబునఁ దారఁ జెందు మీ
రమణి కశుద్ధిలే దమృతరశ్మిని బొందుటచేత దాన నీ
లేమ పరిశుద్ధిఁ గాంచెఁ గయికొమ్మనఁ గొమ్మ గురుండు చేకొనెన్.

దేవతలును బ్రహ్మరుద్రులును గురునిఁ బిలిచి వ్యభిచారదోషము లేకపోవుటయేకాక యమృతరశ్మిని బొందుటచేతఁ దార పరిశుద్ధురా లయ్యెనని చెప్పి యొప్పగించిరఁట.

ఉ. తత్సమయంబునన్ శశి ముదంబున నచ్చటి కేగుదెంచి పు
త్రోత్సవ మాచరింప విని యుద్ధతితో గురుఁ డందువచ్చి య
స్మత్సుతుఁ డీబుధుం డిట నిశాకర రాఁ గత మేమి నీ కన
న్మత్సరబుద్ధి వారికిఁ బునఃకలహంబు జనించె నయ్యెడన్.

ఆపతివ్రతాతిలకమునకు పుత్రుఁడు పుట్టఁగానే వచ్చి చంద్రుఁడు పుత్రోత్సవ మాచరించి నప్పుడు గురు శిష్యులకు పునఃకలహము జనించెనఁట!

క. నా విని యజుఁ డోహోహో! మీవాదము చాలుఁ గుముదమిత్రునిపుత్రుం
డీవత్స మితనిఁ జంద్రుని! కీ విప్రా వలదు విరస మిఁక నాంగిరసా.

అని బ్రహ్మదేవుఁ డింటిమగనికి బుద్ధిచెప్పి శిశువును తేరమగనికిప్పించి వివాదము తీర్చెనఁట! ఈవిషయమునే చెప్పుచుఁ గాశీఖండములో

గీ. చదివె గురునొద్ద ధర్మశాస్త్రంబుఁ దొలుత! పరమవిశ్వాసతాత్పర్యభక్తిగరిమఁ
జదివెఁ జంద్రుఁడు కామశాస్త్రంబు పిదపఁ! దలిరుఁబోఁడి ననురక్తిఁ దారయొద్ద.

సీ. భువనైకధన్వి చేఁ బుష్పాయుధుని చేతఁ బ్రసవాస్త్రమున నేటు పడనివాఁడు
నతిగాఢమైక్రోధాంధకారంబుఁ గన్నుల నంధుండు గానివాఁడు
నిర్నిబంధనలోభనిద్రాభరంబునఁ బారవశ్యంబుచేఁ బడనివాఁడు
లక్ష్మీకటాక్షవిలాసదుర్మదమున మనములోపల నన్న కొననివాఁడు
లేఁడు భూపతి గలిగెనే న్వాఁడు నృపుఁడె! విశ్వధాత్రీజనులపాలివేల్పు గాక
బాహ్యశత్రులఁ బరిహరింపంగవచ్చు! నంతరరులను వర్ణింప నలవికాదు.

ఈవిధముగా శ్రీనాథుఁడు చెప్పినరీతి ప్రౌఢవాక్యములు గాని, పురూరవశ్చరిత్రములో

క. పాపపరాఙ్ముఖతామతి! దీపాంకుర మానెలంతదీర్ఘశ్వసితా
టోపము ద్ధతి నడఁగిచ! బ్రాపితమోహాంధకారబంధురుఁ డయ్యెన్.

సీ. లలనానితంబమండలముపై నుత్పలదళములు రచియింపఁ దలఁచుఁగాని
తరుణికెమ్మోవిమీఁదఁ బ్రవాళమణిసొంపు గులుకఁగా ఘటియింపఁదలఁచుఁగాని

జలజాక్షికుచకుంభములమీఁద శశిఖండప్లుతంబుఁ దా నొనరింపఁ దలఁచుఁగాని
మృగరాజమధ్య నెమ్మేను లతావేష్టితంబుఁ జేసెఁగాఁ దలఁచుఁగాని
తలఁపఁ డెప్పుడు గురువనితాసమాగమాగతాత్యుగ్రదురితదవానలంబు
దుస్సహంబని కటకటా తొలఁగలేఁడు౹ కలుగదుగదా వివేకంబు కాముకులకు

సీ. సకియకౌఁగుఁ దలఁచి సన్మార్గ మనుఁగాని యింతిదుర్మార్గత నెంచఁడయ్యెఁ
జెలువచన్గవఁ దలంచి సువృత్త మనుఁగాని తరుణికువృత్తంబుఁ దలఁపఁడయ్యె
నతివమోముఁ దలంచి యకళంక మనుఁగాని తెఱవకళంకంబుఁ దెలియఁడయ్యె
సుదతివర్ష్మఁ దలంచి శుచి యనుఁగాని యవ్వెలఁదుకయశుచి భావింపఁడయ్యె
గురువువంటిమహాత్ముఁ డిక్కరణిఁ దరుణి౹ చక్కఁదనమే గుణంబుగ సంస్తుతించుఁ
గానివ్యభిచారదోషంబుఁ గాంచఁడయ్యె౹ నజ్ఞుఁడగుబ్రాజ్ఞుఁడన నెవ్వఁడవనినింక?

ఈవిధముగా నబ్బయామాత్యుఁడు చెప్పినరీతి నీతిబోధక వాక్యములు గాని, తారాశశాంకమున లేవు. కవియొక్కరచనను దెల్పుపద్యములు కొన్ని యుదాహరించుచున్నాను—

చ. హతబహుశిల్పిపంబగు ప్రయాగము యాగముదావహంబు సాం
ప్రతముగ నందు నిందిరకుఁ బట్టనఁ బట్టణమున్ సృజింపుమా
యతులితశిల్పశక్తిఁ గొని యంచని యంచ నిరూఢి నెక్కి యం
చితగతి ధాత యేఁగె నుపసిద్ధులు సిద్ధులు తన్భజింపఁగన్.—ఆ. ౧.

చ. అలఁతుల నాతి పాల్పె నిజయావ వేశస్వకీయచింబలీ
లలు తననెమ్మొగంబునఁ గళంకరుచుల్నుమినొక్కటుంగఁ
వలమదయామునద్యుసులు వాతెఱ వెన్నెలడాలు లేఁతన
వ్వుల నమృతంబు పల్కులను బూనెనునాఁగ మనోహరాంగుఁడై.—ఆ. ౨.

ఉ. చందురుఁడుం బురందరగురుశాత్రవరాహుతిఁ గంది నిచ్చలుం
గెందఁగ నింద్రుఁ డిట్టు శశి వినుతా వింగానిపాలికం
బందినవాని కార్తి యగుదా గురుదారకృతాపరాధమే
ధం దిగఁద్రోచి చేసితి వృథా ఖలభావళితో విరోధముల్.—ఆ. ౫.

## కూచిమంచి-తిమ్మకవి.

ఈకవి యనర్గళ మయినకవితాధార గలవాఁడు; బహుగ్రంథములను రచియించినవాఁడు; ఇన్నిగ్రంథములను సలక్షణ మయినమృదుమధురపాకమున రచియించిన కవి యాధునికులలో మఱియెవ్వఁడును లేఁడు. ఈకవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁ

డు ; కౌండిన్యగోత్రుఁడు ; బయ్యనామాత్యుని ప్రపౌత్రుఁడు ; తిమ్మయామాత్యుని పౌత్రుఁడు ; గంగనామాత్యుని పుత్రుఁడు. ఇతనికి లచ్చమాంబ తల్లి ; జగ్గన్న, సింగన్న, నరసన్న, పితృవ్యులు ; వీరమ్మ పాపమ్మ, మేనత్తలు ; సింగన, జగ్గన, సూరన, తమ్ములు ; గౌతమకుల రామయామాత్యునికూఁతు రైన బుచ్చమ్మ భార్య. ఈవిషయములను రుక్మిణీపరిణయములోని యీ క్రిందిపద్యము తెలుపుడు చేయుచున్నది—

సీ. గురుతరకౌండిన్యగోత్రవిఖ్యాతుండు బయ్యనామాత్యుఁ డేధన్యుతాత
నిరతాన్నదానవర్ధితయశస్సాంద్రుండు తిమ్మనసచివుఁ డేధీరుతండ్రి
ఘనులు జగ్గనయు సింగనమంత్రియును నరసన్నయు నేమంత్రి యనుఁగుఁదమ్ము
లలరఁ దిమ్మకవి సింగన్న జగ్గనయును సూరన యేధన్యుసుతవరేణ్యు
లౌనర వీరమ్మ పాప మేఘనుసహజ । లతిపతివ్రత లక్ష్మి యేచతురురాణి
యట్టి శ్రీకూచిమంచివంశాబ్ధిచంద్రు । మజ్జనకు నలగంగనామాత్యుఁ దలఁతు.

ఈమధ్యను ముద్రింపఁబడిన రుక్మిణీపరిణయములో నీపద్యములోని నాలవపాదమున సింగన్న యనుటకు మాఱుగా రాజన్న యని యున్నది కాని యది యచ్చుతప్పని తలఁచెదను. తిమ్మకవికి సింగన్నయు జగ్గనయు సూరనయు నే కాని రాజన్న యను తమ్ముఁడు లేఁడని యితఁడు రచియించినపుస్తకము లన్నిటివలనను దెలియవచ్చుచున్నది. అందు సింహాచలమాహాత్మ్యములోఁ గవి తనవంశవర్ణనము చేయుచుఁ బెద్దతమ్ముఁ డగు సింగన్నను గూర్చి చెప్పిన పద్యముల నిం దుదాహరించుచున్నాను—

క. నాతమ్ములు సింగనయును । ఖ్యాతయశుఁడు జగ్గనయును ఘనసుగుణ
త్రాతాంకుఁడు సూరనయును । భీతారిసమూహు లగుచు వెలసిరి సిరులన్.

సీ. వక్రించుచందంబు వదలక మాధవు నలరెను సురమంత్రి నపహసించి
సాధులం గూడి యఘాని బుధేంద్రుని గన నోఁపు నచలప్రసంగవృత్తిఁ బెంచి
శ్రుతిదూరుఁడై చరించుచు కెందునాలు ల్గఱగి యుండెఁ జిభోగిఁ దులఁగఁ దెగడి
భంగంబు నొంది యేపట్టున నడలెను రత్నాధివాహుఁ దిరస్కరించి
ప్రజ్ఞచే గౌరవమున వాక్పాటవమున । నూరుగాంభీర్యమున జనుల్ పొగడ నెగడెఁ
గూచిమంచ్యన్వయాంభోధికుముదహితుఁ డ । తిప్రహితకీర్తి గంగయసింగమంత్రి.

కవియొక్క జన్మసంవత్సర మేదో తెలియదుగాని యితఁడు రచియించినగ్రంథములలో నెల్లను మొదటి దగు రుక్మిణీపరిణయము

శా. అరయ శాలివాహనశకాబ్దము లద్రిగుణాంగచంద్రులం
దేరగు మన్మథాబ్దమునఁ బ్రేమఁ బ్రబంధ మొనర్చి మీకిటుల్

చేఁకతో సమర్పణము చేసితి మీకృతి యాతమిస్రసహ్య
శైర్యరవమిత్రతారకముగా భువిఁ జెల్వగుఁగాత శంకరా.

అను పద్యమునుబట్టి శాలివాహనశకము ౧౬౭౭వ సంవత్సరము మన్మథాబ్దమునకు సరియైన హూణశకము ౧౭౫౫వ సంవత్సరమునందు చేయఁబడిన దగుట స్పష్టమయినందున, కవి యప్పటికి నలువదియైదు సంవత్సరముల ప్రాయమువాఁ డయినపక్షమున ౧౭౧౦వ సంవత్సరప్రాంతమునఁ బుట్టినవాఁ డైయుండవచ్చును. అచ్చతెలుఁగు రామాయణములోని

గీ. మునుపు మాకీవె భల్హాణుఁ డనెడి శైవకతయు రుక్మిణి పెండిలికతయు బొల్చు
మెఱపుగుబ్బలికతయు మేల్మి నీలపెండ్లికతయును గబ్బముల్ పేర్మిఁ గూర్చి.

అను పద్యమునుబట్టి భల్హాణరాజచరిత్రము రుక్మిణీపరిణయముకంటె ముందుగా రచియింపఁబడినట్లు భ్రమ కలుగునుగాని నిజముగా రుక్మిణీపరిణయమును రచించిన తరువాతనే కవి రాజశేఖరవిలాస మనునామాంతరము గల భల్హాణచరిత్రమును రచించినటు పెక్కుఁనిదర్శనములవలన స్పష్టమగుచున్నది. రుక్మిణీపరిణయమునందుఁ గవి తానావఱకు గ్రంథము లేవియుఁ జేసియున్నట్లు చెప్పుకొనలేదు. కవిచేత రచియింపఁబడిన మూఁడవగ్రంథ మగుసింహాచలమాహాత్మ్యమునందు

గీ. ప్రతిభమీఱంగ రుక్మిణీపరిణయంబుఁ
గలుషహర మగురాజశేఖరవిలాస
మును మఱియుఁ జాలదండకములు శతక
ములును రచియించి కృతులు శంభునకు నిచ్చితి.

అని కవి రుక్మిణీపరిణయమునే మొదటఁ జెప్పియున్నాఁడు. లక్షణసారసంగ్రహము, రసికజనమనోభిరామము మొదలయిన గ్రంథము లన్నిటిలోనుగూడ కవి మొట్టమొదట రుక్మిణీపరిణయమునే పేర్కొనియున్నాఁడు. కవి యేహేతువుచేతనో రుక్మిణీపరిణయము చేసినతరువాతఁ జేసిన యచ్చతెలుఁగురామాయణము నీలాసుందరీపరిణయము లోనుగాఁ గలపుస్తకములలోఁ దాఁ బూర్వపుస్తకములను జేసిన ముగించినకాలమును చేసి యుండలేదు.

తిమ్మకవి గోదావరీమండలములోని పిఠాపురసంస్థానములోని దైన కందరాడ గ్రామమునకు కరణము ఇతఁడు కందరాడగ్రామవాసుఁ డయినట్లు లక్షణసారసంగ్రహములోని యీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.—

సీ. కౌండిన్యగోత్రవిఖ్యాతుఁడఁ గూచిమంచ్యన్వయాంభోధినీహారకరుఁడ
గంగనమంత్రిశేఖరునకుఁ బరమపావని యగులచ్చమాంబకును సుతుఁడ

వెరవొప్ప రుక్మిణీపరిణయంబును సింహశైలమాహాత్మ్యంబు నీల పెండ్లి
కథయును రాజశేఖరవిలాసము నచ్చతెనుఁగురామాయణంబును మొదలగు
కృతులు రచియించి పార్వతీపతికి భక్తి। తోడ నర్పణ మొసఁగినవాఁడఁ గంద
రాడపురసంస్థితుఁడఁ గమ్ముఁబోడ నేఁ। దిమ్మకవిచంద్రుఁడను జగద్విదితయశుఁడ.

ఈయన గ్రంథములు చేయ నారంభించినకాలమునందు పీఠికాపురసంస్థానమునకు రావు మాధవరాయనృపతి ప్రభువుగా నుండెను. ఈవిషయము రుక్మిణీపరిణయములోని యీ పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

సీ. చక్రవాళాహార్యజలధిసులోన్నతప్రాకారపరిఖావిరాజితంబు
సాంద్రముక్తాసౌధచంద్రశాలానేకభర్మనిర్మితహర్మ్యశర్మదంబు
కరిసైంధవాందోళికాధేనుధనధాన్యవనదేవగృహసరోవర్ణితంబు
విమలచాతుర్వర్ణ్యవిద్వత్కవిశ్రేష్ఠభటకూటామాత్యవిస్ఫారితంబు
రాజమహేంద్రవరదుర్గరాజ్యభూరి।భారసంభరణాక్రాంతిభాసమాన
రావుమాధవనృపపరిరక్షితంబు। భోగనికరంబు పీఠికాపురవరంబు

ఈరావు మాధవనృపతియే కొన్నిగ్రంథములు రచించిన యనంతరమునఁ గవికిఁ గవిసార్వభౌమబిరుదము నిచ్చినట్లు రసికజనమనోభిరామములోని యీక్రిందిపద్యమువలనఁ గనఁబడుచున్నది—

సీ. నిఖిలవిద్యాభ్యాసనిపుణుఁడు మత్సహోదరుఁ డగు గంగసత్కవితనయులు
ఘనులు తిమ్మనయు సింగనయును లేఖకపాఠకులై కృతు ల్వ్రిబలఁజేయఁ
జేర్చుఁగాంచినవాఁడఁ బీఠపురప్రాజ్యరాజ్యాధిపత్యవిరాజమాన
భూరివైభవుఁడు నద్భుతపరాక్రముఁడును దానకళాధురంధరుఁడు నైన
రావు నీలాద్రిమాధవరాయనృపతి। చేతఁ గవిసార్వభౌమ విఖ్యాతబిరుద
మందినఘనుండఁ దిమ్మనామాహ్వయుఁడ నేను। విమలతరభక్తి మదిలోన విస్తరిల్ల.

కవి పీఠికాపురసంస్థానములో నుండినవాఁ డయినను తన గ్రంథములు వేని నరాంకితము చేయక యిష్టదేవతయైన కుక్కుటేశ్వరస్వామికే యంకితము చేసియున్నాఁడు. ఇతఁడు రుక్మిణీపరిణయమును రాజశేఖరవిలాసమును జేసినతరువాత రాజు తనకొక గ్రంథము నంకితముచేయ నడిగినట్లును కవి యట్లుచేయ నిష్టములేనివాఁ డయినట్లును సింహాచలమాహాత్మ్యములోని యీపద్యములవలన నూహింపఁదగియున్నది.—

క. నృపులకుఁ గావ్యం బొసఁగిన। నపవర్గం బిడఁగఁగలరొ యటుగాకున్నన్
ద్విపతురగభూషడాంబర। తపనీయాదికము చేతఁ దనుపంగలరో.

సీ. ద్విజపుంగవులకుఁ బ్రవేశింపఁగా రాని పృథుగృహాంతరములఁ బ్రేవనుండి
కృతియంతధర్మపద్ధతు లెవ్వి యెఱుఁగక ధరణిపై నడువఁ బాదములు లేక
దుష్కృత్యుల్ చేయుమంత్రులు చెప్పినట్టులె మీఱకనటింపఁజుచు ద్విజిహ్వకలుగలిగి
వితతంబుగా వక్రగతులచేఁ బొదలుచుఁ బూని యేప్రొద్దును బుస్సురనుచు
గాఢరోషవిషాగ్నులోద్గారఘోర। వక్త్రములుగల్గి దర్పదవర్తులగుచుఁ
జెలఁగుచుండెడు భోగిరాజుల భజింపఁ। గుటిలతరబుద్ధి నెవ్వాఁడు కోరఁగలఁడు?

* * * *

క. పరిపూర్ణ తుచ్ఛభోగం। బునకై కొఱగానిజనులఁ బొగడుట యెల్లన్
గనుఁగొన నిహపరదూరం। బని తలఁచి విరక్తలాంతరంగుఁడ నగుచున్.

ఈయన శివభక్తుఁడయి తాను జేసిన గ్రంథముల నన్నిటిని పిఠాపురమునందలి కుక్కుటేశ్వరస్వామికే యంకితము చేసినను, ఒక్క సర్పపురమాహాత్మ్యమును మాత్రము రాజానుగ్రహము నపేక్షించి కాఁబోలును కవిసార్వభౌమబిరుద మందినతరువాత సర్పవరమందలి భావనారాయణస్వామి కంకితము చేసెను. ఈసర్పవరము పిఠాపురపు రాజుల గురువులగు వైష్ణవస్వాములకు నివాసస్థలమయి పీఠికాపురమునకు సమీపమున నున్నది. కవిమాత్రము సర్పపురమాహాత్మ్యములో భావనారాయణస్వామి తనకు స్వప్నమున సాక్షాత్కరించి యిట్లానతిచ్చినట్టు చెప్పికొనియున్నాఁడు.—

సీ. ప్రౌఢిమై రుక్మిణీపరిణయంబును సింహశైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కథయును రాజశేఖరవిలాసంబును నచ్చతెనుఁగురామాయణంబు
సారంగధరనరేశ్వరచరిత్రంబు సప్తార్ణవసంగమాహాత్మ్యకంబు
రసికజనమనోభిరామంబు లక్షణసారసంగ్రహము నింపారఁ గూర్చి
కృతులు శంభునికిఁ జేసినసుకృతి వీవు। ప్రతిభ మెఱయంగ నొక్క సత్కృతియొనర్చి
మాకు నర్పణచేయు మెమ్మదిదలిర్ప। తిమ్మకవిచంద్ర మునిజనధీకులేంద్ర.

తనకు మాహేశ్వరాచారవృత్తి నుపదేశించిన శైవుఁడగు దెందులూరి లింగనారాధ్యుని

క. చిరభక్తిం బొగడెద స। ద్గురునాథుం దెందులూరికులపావనునిన్
గరుణానిధి నపరాంతకు। హరమూర్తిని ఘనుని లింగనారాధ్యమణిన్.

ఇత్యాది బహుపద్యములతో బహుగ్రంథములయందు స్తుతించి శివభక్తుఁ డయినను, కవి తాను కేవల శివమతస్థుఁడు గాక శివకేశవులకు భేదము లేదని భావించెడి యద్వైతమతస్థుఁడయియుండెను. కవి తాను కట్టకడపట రచియించిన శివలీలావిలాసములో నిందుక్రిందఁ బొందుపఱిచిన పద్యమునందుఁ దాను జేసినపుస్తకముల నన్నిటిని జేర్కొనియున్నాఁడు.—

సీ. ప్రతిభ మై రుక్మిణీపరిణయంబును సింహశైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కతయును రాజశేఖరవిలాసంబును నచ్చతెనుంగురామాయణంబు
సారంగధరనృపచరితంబు సాగరసంగమాహాత్మ్యంబు రంగుమీఱ
రసికజనమనోభిరామంబు లక్షణసారసంగ్రహమును సర్పపురస
మంచితక్షేత్రకథనంబు మఱియుఁ బెక్కుశతకదండకసత్కృతుల్ ప్రతిభఁ గూర్చి
యుల్లమలరారఁ బార్వతీవల్లభునకు భక్తి నర్పణ చేసితి భవ్యమతిని.

ఈగ్రంథములలో సారంగధరచరిత్రమును సాగరసంగమాహాత్మ్యమును నాకు లభిప లేదు. అవి చిన్నగ్రంథము లని కవివంశములోనివా రొకరు నాతోఁ జెప్పియున్నారు. ఈకవి కవిత్వములో నచ్చతెలుఁగుపదము లధికముగా నుండును. కష్టపడి మొట్టమొదట యౌవనకాలమునందు శృంగారప్రధానముగా రచియించిన దగుటచే రుక్మిణీపరిణయము నందే కవి యొక్క వప్రౌఢిమను జూపియున్నాఁడు. కవికృతము లయినబహుగ్రంథములు పురాణపాకమున రచియింపఁబడినవి. శ్లేషములును శబ్దాలంకారములును విశేషముగా నుండినను, కవిత్వమునం దద్భుతకల్పన లంతఁగాఁ గానఁబడవు మొట్టమొదట రచియింపఁబడిన గ్రంథములలో నదంత స్త్రీవాచకపదసంధులు లోనుగాఁ గల కొన్ని దోషములు కనఁబడుచున్నను, అటుపిమ్మటఁ జేసినగ్రంథములు నిర్దుష్టములుగా నున్నవి. కవి యితరగ్రంథములను రచియించిన కాలపరిమితిఁ బట్టి విచారింపఁగా, ౧౭౦౪ వ సంవత్సరమునందు ముగింపఁబడిన రుక్మిణీపరిణయము ౧౭౦౦ వ సంవత్సరమునం దారంభింపఁబడి సంవత్సరమున కొక్కొక్కయాశ్వాసము చొప్పున నయిదాశ్వాసములు నయిదుసంవత్సరములలో రచియింపఁబడె నని చెప్పుట సత్యమున కంత దూరముగా నుండదు. కవన మారంభించి యొకటిరెండు శతకములను జేసి ప్రబంధ రచనకుఁ బూనునప్పటికిఁ గవి కిరువదిసంవత్సరముల ప్రాయ ముండుననుటయు నంతగా తప్పు కానేరదు. కవి తరువాత రచియించిన రెండవగ్రంథ మగురాజశేఖరవిలాసము మూఁడాశ్వాసములును మూఁడుసంవత్సరములలోఁ జేసినపక్షమున, అపుస్తకమును ౧౭౧౭ వ సంవత్సరమున ముగించియుండవచ్చును. మూఁడవగ్రంథ మగుసింహాచల మహాత్మ్య మయిదాశ్వాసములు నయిదుసంవత్సరములలోఁ జేసినయెడల, అస్థలపురాణము ౧౭౫౩ వ సంవత్సరమునందు ముగింపఁబడియుండును. కవిచే రచియింపఁబడిన గ్రంథములలో నాలవదియు నచ్చతెలుఁగుకావ్యములలో మొదటిదియు నైన నీలాసుందరీ పరిణయము మూఁడాశ్వాసములును మూఁడుసంవత్సరములలో రచియింపఁబడినచో, అది ౧౭౫౬ వ సంవత్సరమునందు ముగింపఁబడియుండును. అయిదవగ్రంథ మగు నచ్చతెనుఁగురామాయణ మాఱుకాండములు నాఱుసంవత్సరములలోఁ గూర్పఁబడిన

పత్తునను, అని ౧౮౩౨ వ సంవత్సరమునందు సమాప్తి నొందియుండును. ఈయచ్చ తెలుగుకావ్యముల రచనచేతఁ గవి కభినవవాగనుశాసనబిరుదము వచ్చెనని చెప్పుదురు. ఆఱవగ్రంథమగు సారంగధరచరిత్రము రెండుసంవత్సరములలోఁ జేసెనేని, అది౧౮౩౪వ సంవత్సరములో పూర్తి యయియుండును. ఏడవది యగు సాగరసంగమమాహాత్మ్యము రెండుసంవత్సరములలోఁ జేయఁబడినయెడల, ౧౮౩౭వ సంవత్సరమున సంపూర్ణమయి యుండును. ఎనిమిదవగ్రంథ మగులక్షణసారసంగ్రహము

గీ. శాలివాహనశకవర్షసంఖ్యకరగిరిహయశశిసంజ్ఞలను రౌద్ర్యబ్దమునను
భాద్రపదశుక్లపంచమివలునఁ బూర్ణమయ్యె నీకృతి నీపేర నగసుతేశ.

అని శాలివాహనశకము ౧౭౭౨ వ సంవత్సరమునకు సరియైన క్రీస్తుశకము ౧౮౫౦ వ సంవత్సరమునందు ముగింపఁబడినదని కవియే చెప్పియున్నాఁడు. మూఁడాశ్వాసములు గల యీలక్షణగ్రంథమును రచియించుటకుఁ గవికి ౧౮౪౭ వ సంవత్సరము మొదలు కొని నాలుగుసంవత్సరములు పట్టియుండును. చంద్రమపాలెములోనున్న యీకవివంశ మువారియింటఁ గలపుస్తకములను వెదకింపఁగా నందు భారతాదులును లక్షణవిష యకగ్రంథములుతప్ప విశేషగ్రంథము లేవియుఁ గానఁబడనందునను, లక్షణసార సంగ్రహములో లక్ష్యములుగాఁ జూపఁబడిన ప్రబంధాదులలోని పద్యములు చాలవఱ కితరపూర్వలక్షణగ్రంథములలో నున్నవే యగుటచేతను, కవి యీగ్రంథరచనమునందు భారతరామాయణములను నుతి కొన్నిప్రబంధములనుమాత్రమే శోధించినట్టు తోఁచు చున్నది. అందుచేత గ్రంథపసమాప్తికి నాలుగుసంవత్సరములు చాలును.

గీ. తెలుఁగు కిమున్న లక్షణంబులు మహేశ్వరుల్ పెక్కు రచియించి యిడి రేక్కేల
కూర్పవలెనన్నఁ బ్రౌఢిమకొఱకు నాకుఁ దెలిసినతెఱంగుఁ దగఁగొంత తెలియఁబఱతు.

అని కవి లక్షణసారసంగ్రహమునఁ బూర్వలక్షణగ్రంథములలో లేని నూతనవిషయము లను గొన్నిటిఁ జేర్చినట్లు చెప్పియున్నాఁడు కొన్నివిషయములను గవి క్రొత్తగా శోధించి చేర్చెననుటకు సందేహములేదు. తొమ్మిదవగ్రంథ మగురసికజనమనోభిరామ మనెడి యాఱాశ్వాసములప్రబంధమును రచించుటకు గవికి ౧౮౫౦ వ సంవత్సరము మొదలుకొని ౧౮౬౦ వ సంవత్సరమువఱకును పదిసంవత్సరములు పట్టినది.

సీ. * * రసికజనమనోభిరామం బనెడుపేరఁ దనరుగున శాలివాహనశకాబ్ద
ములఁ గరగిరిరసభూసంఖ్యఁ దద్దయు వఱలుప్రమోదూతవత్సరమున
నీప్రబంధంబు రచియించి నీకొసఁగితి.

అని కవి రసికజనమనోభిరామమును దాను శాలివాహనశకము ౧౭౮౪ వ సంవత్సర మునకు సరియైన ౧౮౬౨ వ సంవత్సరమున రచియించినట్లు చెప్పెను. ఈకవి యీ

గ్రంథమును బహుపుస్తకములు చదివి బహుసంవత్సరములు శ్రమచేసి తన ప్రౌఢిమ నంతయు జూపి వసుచరిత్రమువలె నుండవలెనని దాని ననుసరించి చేసెను. అందుచేతనే కవి యాగ్రంథారంభమందు

సీ. బహుపురాణములు ప్రబంధము ల్లక్షణశాస్త్రము ల్వివిధకోశములు నాట
కము లలంకారశాస్త్రములును శోధించి ప్రౌఢిమై నేతత్ప్రబంధ మేనొ
నర్చెద * * * * *

అని వ్రాసికొనియున్నాఁడు. అయినను వసుచరిత్రమునం దుండుఁగల ప్రౌఢిమలోను సారస్యములోను శతాంశమైనను రసికజనమనోభిరామమునకు రాలేదు. అన్యోన్య తారతమ్యము తేటపడుటకయి యుభయగ్రంథములనుండియు సమానవిషయములను దెలుపు పద్యములను గొన్నిటి నిందుఁ జూపెదను. వసుచరిత్రములో గిరికాదేవిని గూర్చుటకయి రాజుచేతఁ బంపఁబడిన దూత పోయి సఖీజనమధ్యమున నున్న కన్నియను జూచి సమయోచితసరసాలాపములతో ముచ్చటించి యామె చెలికత్తెలచేతనే,

ఉ. ఇన్నగరాజుఁ జూచి వసుధేశ్వరుఁ డెన్నఁడు వచ్చు వచ్చి యీ
క్రొన్నెలతీవ జొంపములఁ గోనకు నెన్నఁడు డిగ్గు డిగ్గి యీ
కన్నియఁ గన్నులారఁ గుతుకంబున నెన్నఁడు గాంచుఁ గాంచి తా
నెన్నఁడు గారవించుఁ జెలు లెన్నఁడు కాంతు రభీష్టసంపదల్

రాజు నిమిత్తమయి ప్రార్థించునట్లు చేసి నేర్పుతో కార్యసంఘటనము చేయఁగా, రసికజనమనోభిరామములోఁ బ్రియురాలి నిమిత్తమయి రాజుచేఁ బంపఁబడినదూత యామెకడకుఁ బోయి

చ. పలుకులు తేనె యేటి కిఁక భావభవప్రతిమానుఁ డైనయా
చెలువునితోడుతం జెలిమి చేయుట కున్న నయారె నీమెయిం
గల యెలజవ్వనం బడవిఁగాచినవెన్నెలసుమ్ము ముద్దులేఁ
జిలుకలకొల్కి నాపలుకు చిత్తమునం దలపోసి చూడుమా.

అని చెప్పి యామెచేత

చ. అవునవును మంచిప్రోడవె బళా యిటు కించుక లేక మానినీ
నివహసభాగ్రభాగమున నిల్చి వినం గడగానివాక్యముల్
తవిలి వచింపఁ జాగితివి తాళుము మే మతిమొక్కలైన దూ
తవు నిను నేమియుం బలుక ధర్మము కాదని యంటి మిత్తఱిన్.

అని చీవాట్లు తిని తనప్రభువువద్దకు మరలి వచ్చెను.

గీ. శాలివాహశకవర్షసంఖ్య వసుగ | గాంగశశిసంజ్ఞ నలరు ధాతాబ్దమునను
దగ రచించిన యీకృతి ధరణియందు | భానుధాకరతారార్క మగుచునుండు.

శాలివాహనశకము ౧౩౭౦ వ సంవత్సరమునకు సరియైన ౧౪౪౮ వ సంవత్సరమున రచియింపఁబడినది. అటుతరువాతఁ గవిచే రచియింపఁబడిన గ్రంథము లేవియుఁ గానరావు. ఆరంభదశలో రచియింపఁబడిన కుక్కుటేశ్వరశతకము మొదలయిన కొన్ని శతకములును దండకములును గలవు. శివలీలావిలాసము ముగిసిన యల్పకాలములోనే కవి పరలోకగతుఁడయ్యెను. కాఁబట్టి యితఁడు ౧౩౭౩ వ సంవత్సరమునందు మృతినొందెనని యించుమించుగా నిశ్చయముగానే చెప్పవచ్చును. అందుచేతఁ గవి దాదాపుగా డెబ్బదిసంవత్సరములు జీవించి సుమారు నలువదియైదు సంవత్సరములు గ్రంథరచనయందుఁ గడపినట్టు స్పష్టమగుచున్నది. ఈకవి సంతతి లేదఁట. ఈకవియొక్క కడపటికాలములో నింగ్లీషువారికిని ఫ్రెంచివారికిని యుద్ధములు జరగినందున కందరాడమీఁదుగా రాకపోకలు చేయుచువచ్చిన సేనలదాడికి వెఱచి యాగ్రామము విడిచి చంద్రమపాలెము నివాసముగా నేర్పఱచుకొనెను. ఈకవివంశమువారిప్పటికిని చంద్రమపాలెములోనే యున్నారు. ఆంధ్రనామసంగ్రహము చేసిన పైడిపాటిలక్ష్మణకవి, కన్నప్పచరిత్రము చేసిన కంచిరాజు సూరయ్య, శివజ్ఞానదీపిక చేసిన కవిలోకబ్రహ్మ, ఇందుమతీకల్యాణము చేసిన యంగర బసవయ్య, ద్వాదశరాజచరిత్ర చేసిన కట్టవరపు చిట్టమరాజు, ద్విపద రుక్మాంగదచరిత్రము చేసిన రామయ భాస్కరుఁడు, మొదలగు కవులీకవికిఁ బూర్వులై యుండినట్లు లక్షణసారసంగ్రహములో నియ్యఁబడిన లక్ష్యములవలనఁ దెలియవచ్చుచున్నది. కవియొక్క శైలిని జూపుటకు పద్యములఁ గొన్నిటి నిందుదాహరించుచున్నాను—

## రుక్మిణీపరిణయము.

ఉ. సారము ముద్దుఁబల్కు ఘనసారము దర్పమె తావి కా
సారము నాభిరంధ్రము విసారము లేటమిటారుమారు శ్రీ
కారము కర్ణయుగ్మము చకోరము నవ్వు మొగంబు షట్పదా
కారము కొప్పు సన్మధువికారము మోవి వధూలలామకున్.—ఆ. ౧.

ఉ. కౌను చలింప దద్దపు మొగంబునఁ జెమ్మటయుంపఁ గింకిణీ
ధ్వానము లింపు నింపఁ గరతాళగతుల్ప్రవరింప హారముల్
పూనినటింప నూర్పుసోలపు న్వలితెమ్మెర లంకురింపఁగాఁ
జానయొకర్తు రుక్మిణికి సంపఁగినూనెఁ దలంటె నేర్పునన్.—ఆ. ౫

రాజశేఖరవిలాసము.

శా. ఏరాభూవర మాకుఁ గాంచనతురంగభ్రాంబరాందోళికా
భూరిస్యందనమందిరోపవనసద్భూషామణిశ్రేణులన్
చే రొందగుపల్లెలుం బసులులన్ లెక్కింప కర్థంబులున్
ఈరా జోరికతీఱ మాఱ కీఁక నివెం తేనియున్ ధీరతన్.—ఆ. ౧

ఉ. అయ్యెడఁ జెల్లమ్రాంబ విభునానతి గైకొని వాఁడిచూపు లా
యొయ్యొయ్యనమీఱ లేనగవు లొప్పగఁ జక్కులఁ బాఱ తీపమైఁ
బయ్యెదజాఱ ముద్దుమఱపల్కులు చెల్వలరార నవ్వటుం
జయ్యనఁ జేరి మ్రొక్కి నెఱజాణగు చెల్లెనెఱింగి రంగుగన్.—ఆ. 3.

సింహశైల మాహాత్మ్యము.

మ. వలపుం గొజ్జఁగినీటిశీతలహరీవాఃబిందువుల్ చిమ్ముచున్
గలయం గప్పురపుందుమారము మెయిన్ గాటంబుగాఁ గప్పుచున్
బలవద్దర్పకబాణపంక్తుల క్రియన్ బైపై విరుల్ గుప్పుచున్
జెలఁగెన్ మందసమీరణుండు దిశజశ్రేష్ఠాగ్రభాగంబునన్.—ఆ. ౨.

ఉ. అక్కట! దైత్యనాయకుఁడు హస్తవశుండు దయాత్మ నెంతయున్
మక్కువమీఱ నిన్ను మనుమాట వలపక తన్విపత్తునన్
జిక్కఁదెఱంగులం గడఁగి చేరఁ గనుంగొనఁజూచెదు చిన్నవాఁడ వీ
వెక్కడ? తత్త్వ మెక్కడని సహింపఁ జేయనున్న నిశాచరార్భకా.—ఆ. 3.

నీలాసుందరీ పరిణయము.

ఉ. మిసిమిఁ గడాసి బంగరుప్రమేడల సోరణగండ్లవెంట రే
ల్చిరియుఁ జిక్కు మొత్తములనక్కఁగఁజూచి మెఱుంగుబోండ్లు ని
చ్చలు పిసాళ్లఁబట్టియవి జాతిపసిండిమగోళ్ళు చక్కలం
చును నెఱవిచ్చి చేవదలి మాయముచుం నబ్బురపోదు రిందులన్.—ఆ. ౧.

ఉ. కన్నులవింటివాఁడ తగకన్నులదేవరతోడఁబోరి మున్
బన్నము నొంది మేఁనొంగఁగుపట్టున నెక్కడ డాఁగిపోయె నీ
వన్నెతికంబు నేఁడు కోమలమాలినకోయిలదిల్కమూఁకలన్
బన్నగఁ గూడి చేతులు బాములఁ బెట్టెదు పోటుబంటవై.—ఆ. 3.

అచ్చతెలుఁగు రామాయణము.

ఉ. కాయము మేటితెప్ప కొమకాయను నిద్దపుఁబూఁతమాఁపమో
కాయమ్ముఁ బంజరంపుఁజిలుకాయను నబ్బసోయగంపుఁబ్రో

కాయఁ బల్కవేమి యేలకాయఁ బంతము తీరెనోటు కై
కాయను నేర యిట్లు దుసుకాయను మాయఁగఁ గోరకాయనుజా — అయోధ్యా.

చ. జగములఁ ద్రిల్లి పుడమిజవ్వనిఁ గాడలిఁ బట్టి దైత్యు నా
మ్మగుదల మిన్నఁ దెచ్చితివి మోస మెఱుంగక నీకు నెవ్వరుం
దగ దితిఁ దందుఁ దెల్పఁ గలవంటులు గల్గిరెఁ జేసి యిట్టిక
డగపడె నిరక్షైన విడనాడక రాముని ప్రాపుఁ జేసుమీ — సుందర.

లక్షణసారసంగ్రహము.

చ. కరములు దోయిలించి కుతుకంబున నిచ్చలుఁ బ్రస్తుతింతు భా
స్వరగుణవంతునిన్ సకలసత్కవిజాలవసంతునిన్
జిరకరుణాంతరంగుని విశిష్టజనావనతోషశాంతునిన్
సురతరుమంజరీనిభయశోహరిదంతుని నేకదంతునిన్ — ఆ. ౧.

మ. ఘనకారుణ్యకటాక్ష రాక్షసచమూగంధేభహర్యక్ష స
జ్జనసంరక్షణదీక్ష పాలితసరోజాతాక్ష శక్రాంబుజా
సనముఖ్యామరపక్ష దక్షసవనాంచల్లోకవిధ్రామాక్ష యా
చనకప్రాంగణకల్పవృక్ష రిపుశిక్షాదక్ష మోక్షప్రదా. — ఆ. ౨

రసికజనమనోభిరామము.

మ. తనమూలంబులఁ బొంతఁ బొంచి సచివోత్తంసంబు వీక్షించె భా
స్వరకార్తస్వరవిగ్రహున్ సమదచంచచ్చంచరీకాలకున్
శరదిందుప్రతిమానచారువదనున్ జక్రస్తని స్వస్ఫుర
త్సరసీజాతదళాయతాక్షి నాకకాంతాలోకచూడామణిన్. — ఆ. ౨.

మ: సవనాదిక్రియల న్నధాంధులను మెచ్చం జేసి ధన్యాత్ములై
నవిశేషజ్ఞుల కబ్బఁగాక యుకటా నా కేటికిం గల్గుని
ష్ఫ్రవనాతీతవిలాసవిభ్రమసభాభూప్రభాంచన్మరు
ద్ధవళాక్షీమధురాధరాధరసుధాధారాసమిద్ధోరణుల్. — ఆ ౫.

సర్వేశ్వర మాహాత్మ్యము.

మ. సరసీరుహలసీరబిందుకణముల్ సమ్యగ్గతింబూని వి
స్ఫురదారామలతాంతసౌరభరజఃపుంజంబుఁ గైకొంచు ని
ర్భరమందానిలబాలకప్రకరముల్ పల్లాటు సల్కొనలోఁ
దిరుగుం బాంథజనప్రవాసవిరహోద్వ్యాప్తిం బ్రకాశింపుచున్, — ఆ. ౨.

ఉ. నీరజనాభలోకనము నిల్పఁ జొరంగలపీఠమూర్తుడై హాయా
నేకపహేమపావురము శ్రీరమణీ సువిభూషణావికా
స్తోకవిభూతి చెంది పరిశుద్ధులుం దన మించు లేచో
నాకనివాసులుం బెరల నందఁగదమ్మ జగత్కుటుంబినీ.— ఆ. ౩.

శివలీలావిలాసము.

ఉ. అంగదముద్రికావలయహారలలాటిక లెమ్మె నెమ్మెయిన్
రంగులు గుల్కఁ గ్రొందగటువాడె పుఁబావడ సొంపు నింప మే
ల్బంగరుగిల్కుటందియలు బాలిక సంఘములు ఘల్లుఘల్లనన్
గంగ తరంగములం గలసి కౌతుకలీలలఁ గ్రీడ సేయుచున్.— ఆ. ౧.

ఉ. కన్నులు మూయుఁ ద్రెళ్ళిపడి గ్రక్కదిక్కులు రోయు నూరకే
సన్నలు చేయుఁ బైవలువ చయ్యన వ్రేలఁగఁద్రోయు మింటిపై
వెన్నెలగాయుచందురుని వేఁడికిఁ దాఁ బెదఁబాయు నద్రిరా
చిన్నెల జంగమప్రభుని చిత్తవికారము లెన్నఁ జిత్రముల్.— ఆ. ౨.

## పక్కిలంక వీరభద్రకవి.

ఈకవి కూచిమంచి తిమ్మకవి జగ్గకవుల కాలములోనే పీఠాపురమునందుండి మిక్కిలి ప్రసిద్ధిగన్నవాఁడు. కూచిమంచి తిమ్మకవివలెనే యితఁడును దండులూరి లింగనారాధ్యుని శిష్యుఁడయి తన వాసవదత్తాపరిణయమునం దాతని నిట్లుస్తుతించి యున్నాఁడు—

సీ. అంభోధివలయితకుంభినీజనతదంభశాంభవకళాజృంభితములు
నందివాహపదారవిందనిశ్వాసమరందసంపాదనేందిందిరములు
స్వైతశాదగనరాధ్యత్వలక్ష్మీప్రదానక్షమసామ్రాజ్యదక్షిణములు
ఊహాపదాత్మబోధామృతస్వాంతసాదేహలీలాపశ్యతోహరములు
ధీరతాగుణమణిహారి దండులూరి । లింగగురువరసత్కృపాపాంగవీక్ష
ణములు సతతంబు శుభవిధానంబు లొసఁగు । శిష్టజనముల దయను రక్షించుఁగాత!

ఈకవి గౌరీకళ్యాణ మను నామముతోఁ గాళిదాసకృతమయిన కుమారసంభవమును దెలిఁగించుటయేకాక సుబంధకవి విరచితమయిన వాసవదత్తను వాసవదత్తాపరిణయ మను పేరితో నాంధ్రీకరించి దానిని పీఠికాపురాధీశ్వరుఁడయిన రావు మాధవరాయని

గారి కంకితముచేసెను. పద్మనాయకకులసంభవుఁడైన శ్రీ రామచంద్ర మాధవరాయ నృపాలుఁడు తన్ను బిలిపించి వాసవదత్తను దెనిఁగింప నడిగినకథను కవి వాసవదత్తా పరిణయమునం దిట్లు చెప్పికొనియున్నాఁడు—

శా. శ్రీమచ్చంద్రకళాకిరీటపదరాజీవద్వయీభావనా
సామర్థ్యార్జితవాక్ప్రపంచఘటనాచాతుర్యవిద్వజ్జన
స్తోమానందదశేముషీనిజవిలాసు న్వెక్కలంకాన్వయున్
క్షేమాధ్యాస్పదు వీరభద్రుని ననుం బిల్పించి యుప్పొంగుచున్.

క. తాతలతరమునసుండియు । నీతనిజనకుండు మఱకు హితుఁడు కవీంద్రుం
డీతని చేతం గృతి వి । ఖ్యాతిగఁ గైకొందు ననుచు హర్షం బొదవన్.

గీ. సభనయంబున సముచితాసనమునందు । నంతికంబునఁ గూర్చుండ నాజ్ఞ యొసఁగి
మందహాసాంచితముఖారవిందుఁ డగుచు । నతిదయాస్ఫూర్తి నిట్లని యానతిచ్చె.

క. శ్రీవెలయ నుభయభాషల । నీవలెఁ గృతిఁ జేయఁగలరె నేఁటి వింద్రల్
భూవిశ్రుతకవితావి । ర్భావయశస్సాంద్ర వీరభద్రకవీంద్రా.

సీ. మీతాత లోకవిఖ్యాతభాషాఖిలశేషాహి యాచంద్రశేఖరుండు
మీతండ్రి చాటువాగాతతచిత్రప్రబంధకల్పనశాలి భాస్కరుండు
మీతల్లితండ్రి పురాతనసత్కవినాథుల కెనవిశ్వనాథసుకవి
మీ మేనమామ సుత్రామవైభవుఁడు సద్యఃకృతిమతి వేంకటాద్రిసుకవి
చదువకరయె శ్రీసతీశప్రసాదగరిమ । బాల్యమునను గుమారసంభవము తెనుఁగు
చేసి కవు లెంచఁ బ్రఖ్యాతిఁ జెంది తీవు । కలరె నీసరు లాధునికులు కవీంద్ర.

ఉ. అత్యలఘుక్రియానిపుణుఁడై ధరణీతల మేలు విక్రమా
దిత్యసభాంతరంబునఁ బ్రతిష్ఠితుఁడై ఘనధీసమగ్రతన్
సత్యవతీతనూభవునిజాడఁ బ్రసిద్ధికి నెక్కె నవ్యసా
హిత్యమునన్ సుబంధుసుకవీంద్రుఁడు ప్రస్తుతిఁగన్నవాఁ డిలన్.

గీ. ఘనతరమనీష నమ్మహాకవివరుండు । ప్రతిపదశ్లేషగద్యప్రబంధ మత్యు
దారతను జెప్పె వాసవదత్తయనఁగ । నార్యులాకథ కడుచోద్య మనిరి సభను.

మ. స్తవనీయం బగుతత్కథాక్రమము భాషాయోషిదంఘ్రిస్ఫుర
న్నవమంజీరరవనాదమేదురనితాంత ప్రౌఢవాగ్గుంభనన్
భవదీయోక్తుల నాంధ్రకావ్యముగ వైదర్భిగతిం గూర్పు త
త్కవిరాజోక్తులు కొన్ని నీకవితకుం గైదండగా నింపఁగన్.

క. వరమతి నాసవదత్తా | పరిణయముఁ జెప్పె యీప్రబంధము విద్వ
త్పరిగణ్యంబుగ మాకుం | బిరముగ నంకితము చేయ ధీరవిచారా.

భర్తృహరియొక్క సుభాషితరత్నావళిని రచించిన యేనుఁగు లక్ష్మణకవి మొదలైన వారితో సమకాలికుఁడు. సమకాలమునందున్న కవులు కూచిమంచి తిమ్మకవిని బొగడక యీతని బొగడుటచేఁ దిమ్మకవికవిత్వముకంటె నీతనికవిత్వమునం దప్పటివారి కధికాదర మున్నట్లు స్పష్టమగుచున్నది. ఏనుఁగు లక్ష్మణకవి తన రామవిలాసమునందుఁ బూర్వకవులను స్తుతి చేసినచోట

గీ. దిట్టకవి విశ్వనాథుఁ బ్రార్థించి కొలుతు | సతతనందనుఁ డగు వేంకటాద్రికవికి
వాక్యఫలములఁ గాంచు వక్కలంక | వీరభద్రుని భావింతు గౌరవమున.

అని యీవీరభద్రకవిని పేర్కొనియున్నాఁడు. ఆకాలమునం దుండిన యీదరపల్లి భవానిశంకరకవియుఁ దాను రచించిన ధర్మఖండములో

మ. మహనీయుం డగు రావుమాధవనృపాలాగ్రేసరుం గావ్యచా
తురి మెప్పించి తదీయసత్కృప సిరుల్ తోరంబుగాఁ బొంది బం
ధురతేజుం డగువక్కలంకకులపాథోరాశిరాకాసుధా
కిరణుండై తగు వీరభద్రసుకవిం గీర్తింతు నానేర్పలన్.

అని వీరభద్రకవిని ప్రశంసించియున్నాఁడు. సమానకాలికులవా రిట్లు మెచ్చుటచేతనే యీకవి యసమానకవిత్వప్రౌఢిగలవాఁడని తేటపడుచున్నది. ఈ వీరభద్రకవి యారువేల నియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు; భాస్కరకవిపౌత్రుఁడు; చంద్రశేఖరకవిపుత్రుఁడు; దిట్టకవి విశ్వనాథకవి దౌహిత్రుఁడు. ఈతని తల్లి జగ్గాంబ; మేనమామ దిట్టకవి వేంకటాద్రికవి. ఈకవి తండ్రితాతలనుండియుఁ బిఠాపురసంస్థానమునం దుండినవాఁడు తండ్రితరమువారును తల్లితరమువారును గూడ సత్కవీశ్వరులు. ఈకవి మాతామహుఁడైన విశ్వనాథకవి సిద్ధాపురసంస్థానస్థాపకుఁడయిన శ్రీవత్సవాయ ముసలి తిమ్మరాజుగారికిఁ దాను రచించిన శేషధర్మప్రబంధము నంకితము చేసెను. శేషధర్మరత్నాకర మను పేరితో నీగ్రంథమునే రాజమహేంద్రనివాసుఁడగు కొండయ కొడుకగు శ్రీనివాసకవియు రచియించెను. వీరభద్రకవి ౧౭౪౦ వ సంవత్సరప్రాంతము వఱకును జీవించియుండవచ్చును. ఇతఁడు తన వార్ధకదశలో పిఠాపురమును విడిచి వృద్ధగౌతమీతీరమునందున్న ముమ్మిడివరము ప్రవేశించి సన్యాసాశ్రమమును స్వీకరించి యక్కడనే సిద్ధిపొందెనఁట. ఈకవి విరచితగ్రంథములనుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను —

## వాసవదత్తా పరిణయము.

శా. భల్లూకంబులఁ జూచితే తిమిరసంపల్లాలితాంగప్రభో
ద్యల్లీలన్ ఘననీలనీలఘనసఖ్యం బెప్పుడుం జేయఁగా
వల్లీవేల్లితవాసులూరుపుల క్రేవం గొంటుఁజుంటీఁగలం
దెల్లం గుయ్యిడఁ దేనియల్ గొనెడు భూమీశా విచిత్రంబుగన్.—ఆ. ౬

శా. ప్రచ్ఛాయస్థలపల్లవాస్తరణనిద్రాయోగ్యముల్ పాటలీ
గుచ్ఛాకల్పమనస్సనోజ్ఞతరముల్ కూలంకషాభ్యంతర
స్వచ్ఛాంభశ్శిపరిషేచనాగ్రామములు పశ్చాద్భాగసౌభాగ్యముల్
స్వచ్ఛందస్థితి గ్రీష్మవాసరము లెంచం జాల మించెం ధరన్.—ఆ. ౩.

## కుమారసంభవము.

చ. హరుఁ డఖిలేశుఁ డవ్వనరుహాక్షితపశ్శ్రీప్రతిఘాతహేతువై
పరఁగినతత్సపర్యలకు భావమునం గడుమెచ్చి యొప్పెఁ దా
నరయ వికారకారణము లంటిన నిశ్చలతం దనర్చె నె
వ్వరిహృదయారవిందములు వారలె ధీవరు లెంచిచూడఁగన్.—ఆ. ౧.

చ. మలయవసుంధరాధరసమాగతబంధురగంధవాహకా
ములనెదిరించుచున్ వివిధసూనగుళుచ్ఛగజాలపరంపరల్
కలయఁగఁ జూపు లడ్డుకొనఁగాఁ గను గానక దర్పమేర్పడన్
జెలగి మృగంబు లప్పిపినసీమ నటించె మధూదయోన్నతిన్.—ఆ. ౨.

ఉ. అన్ను తలంచు రూపము హిమాళి తలంచుఁ గులంబు తల్లి దా
నెన్ను సువస్తువుల్ చదుల నేర్చుతతిన్ బురవైరి సెంచినన్
గన్నులు మూఁడు పుట్టుటయు కానఁగరాదు దిగంబరుండునుం
జిన్నముసొమ్ములేదు తెలిసెం దగఁ డాతఁడు నీకు మానినీ.—ఆ. ౩.

ఉ. క్రొత్తలు చేసి గేహములు గోవజవాజిర బచ్చికస్తురిన్
మెత్తిరి గోడ లందుపయి నిద్దపుఁజాయలపాలసున్నముల్
చిత్తరువుల్ లిఖించిరి విచిత్రగతి న్నయనోత్సవంబుగా
నత్తతి నుత్తముల్ ప్రతిగృహంబున శోభనశోభ సంధిలన్.—ఆ. ౪.

## కూచిమంచి-జగ్గకవి.

ఇతఁడు సుప్రసిద్ధుఁ డయిన తిమ్మకవి సార్వభౌముని రెండవతమ్ముఁడు. ఇతని జన్మసంవత్సర మేదో తెలియదుగాని తిమ్మకవికంటె నాలుగయిదుసంవత్సరములు చిన్నవాఁడయి యుండవలసినందున, ఇతఁడు ౧౭౦౦ వ సంవత్సర ప్రాంతమునందు పుట్టినట్టూహింపఁదగియున్నది. ఈజగ్గకవి యిరువదిసంవత్సరముల ప్రాయము వచ్చువఱకును చదువెఱుఁగక యల్లరిమూఁకతోఁ దిరుగుచు కాలము గడపెననియు, అప్పుడు వివాహితుఁడయి యత్తవారియింటికి మనుగుడుపునకుఁ బోయి మామగారు తనకుఁ బరమశుంఠ యైనయల్లుఁడు దొరకినందుకు సంతాపపడఁగా రోషముచేత దేశాంతరమునకు లేచిపోయి పండ్రెండు సంవత్సరములు విద్యాభ్యాసము చేసి పండితుఁడయి కవిత్వము చెప్ప నారంభించెననియు, ఫక్కిటిపురాణ మొకటి కలదుగాని యిది కేవల కల్పితకథ యని తోఁచుచున్నది. ఈకథనుబట్టి యీకవికి కవిత్వము చెప్ప నారంభించు కాలమునాఁటికి ముప్పదిమూఁడు సంవత్సరముల ప్రాయమయి యుండవలెను. కూచిమంచి తిమ్మకవి తాను ముప్పదిసంవత్సరముల ప్రాయమునఁ జేయ నారంభించిన సింహశైలమాహాత్మ్యమునందుఁ దనపెద్దతమ్ముఁ డైనసింగన్నను వర్ణించినతరువాత రెండవతమ్ముఁ డైనయీజగ్గకవిం గూర్చి యిట్లు వ్రాసియున్నాఁడు—

క. అతనియనుజన్ముఁ డతులిత । మతియుతుఁడు సమస్తరాజమాన్యుఁడు సుగుణా
న్వితుఁడు సమంచితకవితా । చతురుఁడు జగ్గప్రభాచంద్రుఁడు తనరున్.

క. ఘోటకలాటకిరాటవ । రాటమరాటాంగవంగరాజన్యసభా
ఘూటనిరాఘాటనట । చ్చాటుకవిత్వాంకుఁ డరయ జగ్గన ధరణిన్.

సీ. నిరతంబు నుడివోనిసిరి గరిమఁ బొందియుండుఁ దవుటినిప్పటి మెక్కుఁ దలఁపఁ దేని
సమలాచారప్రశస్తి గాంచియు వర్ణములు సంకరంబుగాఁ గలఁపఁ దేని
ఖలజనసంశిక్ష గావించుచుండియుఁ బతితుల నెపుడుఁ జేపట్టఁ దేని
యురుపుణ్యవర్తియయ్యుఁ బాండవాశ్రయసీమ నిల్లుగను వసింపఁ దేని
యలజగన్నాయకుఁడు సాటియనఁగఁ బోలు । భోగమున నిర్మలాచారమున విశిష్ట
రక్షణంబునఁ బుణ్యమార్గమున నరయ । సంగనామాత్యజగ్గయఘనునితోడ.

ఈపద్యములు రచియింపఁబడినకాలమునకు జగ్గకవి యించుమించుగా నిరువదిరెండు సంవత్సరముల యీడుగలవాఁడయి యుండును. ఇరువదిరెండేండ్లప్రాయమునాఁటికన్న దేశములు తిరిగి రాజసభలలోఁ బ్రసిద్ధి గాంచఁ గలుగుటకు కవి యిరువదియేండ్ల

వయస్సునకు లోపలనే పండితుఁ డయి కవనచాతురి గలవాఁ డయియుండవలెను. అందుచేత జగ్గకవి యిరువదిసంవత్సరములప్రాయమున వచ్చువఱకును నక్షరజ్ఞానము లేనివాఁడని చెప్పెడికథ నమ్మఁదగినది కాదు. ఈకవి తనవివాహానంతరమున ధనార్జనము నిమిత్తమును పాండిత్యప్రకాశనమునిమిత్తమును బహుదేశాటనముచేసి రాజాస్థానములలో మెప్పొంది సత్కారములు వొందుట వాస్తవమే యైనను, "భోటకలాటకిరాటవరాట మగాటాంగవంగ" యని ప్రాసనిమిత్తము వేయఁబడిన దేశసంచారము కొంత యతిశయోక్తియై యుండవచ్చును. ఇతఁడు దేశాటనము చేసి వచ్చినతరువాతను దత్పూర్వమునను, జానకీపరిణయమును, ద్విపదరాధాకృష్ణచరిత్రమును, చాటుప్రబంధములును, సుభద్రాపరిణయమును, చంద్రరేఖావిలాపమును, సోమదేవరాజీయమును, రచియించెను. చంద్రరేఖావిలాపములోని యీక్రిందిపద్యమున వర్ణింపఁబడిన వరుసనుబట్టి విచారింపఁగా నితఁడు దేశసంచారము చేసి రాజాస్థానములయందు రాజులమీఁద చాటుప్రబంధములు చేయుటకుముందే జానకీపరిణయమును రాధాకృష్ణచరిత్రమును రచించి నట్లు తోఁచుచున్నది—

సీ. రచియించితివి మున్ను రసికు లౌనని మెచ్చ సుకవి జానకీపరిణయంబు
వచియించితివి కవివ్రాతము ల్పొగడఁగ ద్విపదరాధాకృష్ణదివ్యచరిత
ముచ్చరించితివి విద్వచ్ఛయంబు నుతింపఁ జాటుప్రబంధముల్ శతకములును
వర్ణించితివి యిరువదిరెండువర్ణనల్ గాంచఁగా సుభద్రావివాహ
మాంధ్రలక్షణలక్ష్యంబు లరసినావు ! భూరాజ్యసత్ప్రతిపూజకుఁడవు
బళిర నీభాగ్యమహిమ చెప్పంగఁదరమె ! జగ్గకవిరాయ! చంద్ర వాచాఘరుద్ర.

ఇతఁడీచంద్రరేఖావిలాపమును విజయనగరసంస్థానప్రభువులగు శ్రీపూసపాటి విజయరామరాజుగారి చెల్లెలిపెనిమిటి యగు చింతలపాటి నీలాద్రిరాజుమీఁది కోపముచేతఁ జేసెను. ఇది బూతుపుస్తక మగుటచే నిందలిపద్యము లుదాహరింపఁ దగియుండలేదు. "అర్ణవవేష్టితాఖిలమహామహిమండలిలోన బూతుల న్బూర్ణుఁడ" నని కవియే చెప్పికొనుటచే నితఁడు తిట్టుకవిత్వమునందసమానపాండిత్యముకలవాఁ డయినట్టు స్పష్టమగుచున్నది. జగ్గకవి ధనసంపాదనము నిమిత్తము విజయనగరమునకుఁబోయి రాజుబావయైన నీలాద్రిరాజు నాశ్రయింపఁగా నతఁడు తానుంచుకొన్న వేశ్యను నాయికఁగాఁ జేసి తనమీఁద ప్రబంధము చేయుమని కోరెనఁట! ధనాశచేత నట్టిప్రబంధరచన కొప్పుకొని కవి చంద్రరేఖావిలాస మనుశృంగారకావ్యమును జేసెనఁట! అటు తరువాతఁ దాను సంస్కృతకావ్యమును రచించి యిచ్చెదనని చెప్పి రాజునుతి మరలించిన యాడిమళ్ళ వేంకటశాస్త్రిప్రోత్సాహముచేత నీలాద్రిరాజు జగ్గకవికి నొసఁగినబహు

మానముచేసి సత్కరింపక తిరస్కారమును జూపెనఁట! అందుపైని ముంగోపియైన యీసూర్తకవి తాను రచియించిన చంద్రరేఖావిలాసమును చింపివేసి చంద్రరేఖావిలాపమను పేరిట నిప్పటి బూతుగ్రంథమును జేసెనఁట! ఇందలి కవివర్ణనలోసహితము సాధుకవులను విడిచి కవి యిట్లు తిట్టుకవిత్వము చెప్పినకవులనే పేర్కొనియున్నాఁడు —

క. భీమకవి రామలింగని । శ్రీమంతుం డైన వెలుంగు శ్రీనాథకవిన్
రామకవిముఖ్యులను బ్రో । ద్దామగతిం జిత్తవీధిఁ దలఁచి కడంకన్.

ఈపుస్తకములోని మొదటిపద్య మిట్లున్నది—

శా. శ్రీకంఠుండు భుజంగభూషణుఁడు భస్మీభూతపంచాస్త్రుఁ డ
స్తోకాటోపబల ప్రతాపపరరక్షోదక్షసంశిక్షణుం
డాకాశోజ్జ్వలకేశపాశుఁడు త్రిశూలాంకుండు రుద్రుండు దా
వీఁకం జింతలపాటినీలనృపతి న్వీక్షించు నేత్రత్రయిన్.

ఈపుస్తకమును జేసి యీకవి నిజామురాజ్యమునకుఁ బోయి హైదరాబాదునగరమునందుఁ గల తురకదొరల నాశ్రయించి వారిమీఁదపద్యములు చెప్పి తన్మూలమున నబాబుయొక్క దయను సంపాదించి, నిజాము ప్రభుత్వమునకు లోఁబడిన సామంతరాజ్య మైనవిజయనగరమునకు ప్రభువగు శ్రీవిజయరామరాజుగారివద్దకుఁ దనగ్రంథమును నీలాద్రిరాజు సమ్ముఖమున సభలోఁ జదివించునట్లు నవాబువద్దనుండి యుత్తరువు తెచ్చి యట్లు చదివించెనని చెప్పుదురు. ఇతఁడు గ్రంథమునందు నీలాద్రిరాజు నెంత దూషించినను, తత్పత్నియగు నరసమాంబను దూషింపక పతివ్రత నిట్లు భూషించెను —

క. ఖలుఁడై నీలనృపతిఁ జీ । యిలపై నిన్నాళ్ళు బ్రదుకునే నరసాంబా
గళకలితమంగళమునం । గళసూత్రోత్కృష్టమహిమఁ గాక కుమారా.

ఈకవి యించుమించుగా నన్నూఱుసంవత్సరముల క్రిందటికాలమున జీవించినట్లు కనఁబడుచున్నది. అందుచేత నితఁడు ౧౭౦౦ వ సంవత్సరప్రాంతము మొదలుకొని ౧౭౫౦ వ సంవత్సరప్రాంతమువఱకును జీవించియుండినవాఁడని చెప్పవచ్చును. ఈతఁడు రచియించిన గ్రంథములలో నాల్గాశ్వాసములు గలసుభద్రాపరిణయము మనోహరముగాఁ గనఁబడుచున్నది. ఆపుస్తకమునందు జగన్నాయకస్వామినిగూర్చి వ్రాయఁబడిన మొదటిపద్య మిట్లున్నది—

ఉ. శ్రీలలనన్ సుభద్రయును సీయుఁ బార్శ్వముల న్మెలఁగ న
త్యాయతలీల నీలమధరాగ్రమునందు వసించి నిచ్చలుం
బాయక భక్తకోటి కనపాయశుభంబు లొసంగు శ్రీజగ
న్నాయకదేవదేవుఁ డభినంద్యకృపామతి మమ్ముఁ బ్రోవుతన్. — ఆ. ౧.

సుభద్రాపరిణయమునం దితఁడు

గీ. నన్నపార్యుని దిక్కన సాచిరాజు । సోమయాజిని శ్రీనాథు భీమకవిని
రంగనాథునిఁ బోతనఁ బ్రాజ్ఞవరుని । శంభుదాసుని భాస్కరు సంస్తుతింతు.

అని కవిస్తుతి చేసి తనయన్న యగు తిమ్మకవి నిట్లు పొగడి యున్నాఁడు—

సీ. కౌండిన్యగోత్రవిఖ్యాతునిఁ గూచిమంచ్యన్వయాంభోధినీహారకరుని
గంగనమంత్రిశేఖరునకు నంగనామణి యగులచ్చమాంబకును సుతుని
బహుకావ్యనిర్మాణబంధురప్రతిభునిఁ గుక్కుటేశ్వరకృపాంకూరలబ్ధ
సత్కవితామహాసామ్రాజ్యధౌరేయుని బుధజనప్రియచరితుని
దండలూరి లింగనారాధ్య దేశికేంద్ర । దత్తమాహేశ్వరాచారవృత్తిరతునిఁ
గందరాడఘవర్గాయమంచెరుని మ । దగ్రజునిఁ దిమ్మకవిరాజు నభినుతింతు.

ఇతఁడు తనగ్రంథములను జగన్నాథస్వామి కంకితము చేసెను. ఈకవిచే రచియింపఁబడిన జానకీపరిణయము మొదలయినగ్రంథములు నాకు లభించినవి కావు. ఇతఁడు కాశ్యపప్రతాపరుద్రవంశజుఁ డయిన మంతపాటి నారాయణరాజుయొక్క ప్రేరణచేతఁ బ్రతాపరుద్రుమహిమను వర్ణించుచు సోమదేవరాజీయ మనుమూఁడాశ్వాసములగ్రంథ మొకటి రచియించెను. కవియొక్క కవితానైపుణిని జూపుటకై కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

సుభద్రాపరిణయము.

చ. సురుచిరలీలఁ గన్గొనియె శోభనదివ్యసరోజమాలికా
పరిమళలాభలోభమదబంభరడింభరవానుషంగ దు
ర్భరదురితౌఘభంగ నతిభాస్వరగాఢతరంగ రంగదీ
శ్వరమకుటాగ్రరంగ శుభసంగను గంగఁ దగంగఁ జెంగటన్ — ఆ. ౧

ఉ. ఆరమణీలలామము లుదంచితలీలలఁ గాంచి కొక్కెకా
సారము సారసారభవిశంకటసారసపుంజరీకశా
లారమరందపానపరిలంపటమాద్యదళీంద్రసాంద్రఝం
కారము కోకహంస బకకచ్ఛపమీనధునీకులీరముల్. — ఆ. ౩

శా. కారం బయ్యె నితంబినీమణికిఁ గల్హారంబు శూలంబయెం
గారంబున్ సముదగ్రకోకిలకుహూకారంబుఁ జంద్రోద్ధతా
కారంబున్ గుసుమాస్త్రచాపగుణటంకారంబు రాయంచకేం
కారంబున్ ఘనశారికానికరహుంకారంబు ఘోరంబుగన్ — ఆ. ౫

చ. తనుఁ గనిసాటివాలుఁగనుఁ దమ్ము నలంకరించుక చెప్పి కన్యకా
తిలకము తాఁ గని చని నీలమణిదీధితిజాలమనోజ్ఞగాత్రునిన్
జలదరాతిచైత్రునిఁ గృపాపరిపూరితనేత్రుఁ గంకణస్వనా
కలితవిలాసచైత్రుని జగన్నుతిపాత్రునిఁ బాండుపుత్రునిన్. — ఆ. ౫.

సోమదేవరాజీయము.

శా. అన్నా యెక్కడ నుంటి వొక్కఁడవు రేయాహా మహాశ్చర్య మీ
వెన్నన్ బాలుఁడ విట్లు ఉంట విహితంబే రేయి సల్లాపముల్
నిన్నుం గానక యుందుమంటిమి గదా యిక్కడ్ను మాప్రాణముల్
కన్నార న్నినుఁ జూడకున్న నిలువం గా నేర్చునే రేశముల్. — ఆ. ౧.

ఉ. వింటిరె మీర లిప్పు డొకవింత కువాళ్ళబండివాఁడు మొ
న్నంటిఁ గోశార్థభాగమున నాచి మహేశగృహంబు చొచ్చి రా
బంటులె నిన్న రేయి మనపట్టణభూసురవర్యుఁ గొట్టి వా
రింటిపదార్థ మెల్ల హరియించి రనాయక మయ్యె రాజ్యమున్. — ఆ. ౨.

---

## కొరవి - గోపరాజు.

ఈకవి యారువేలనియోగిబ్రాహ్మణుఁడు; హరితసగోత్రుఁడు; గోపరాజు పౌత్రుఁడు; కసవరాజునకును కామాంబికకును పుత్రుఁడు. ఇతఁడు సింహాసనద్వాత్రింశికయను పేర విక్రమార్కునికథలను పండ్రెండాశ్వాసముల పద్యకావ్యముగా రచియించెను. ఈద్వాత్రింశత్సాలభంజికల కథలను రచించుటను గూర్చి కవి యిట్లు వ్రాయుచున్నాఁడు—

క. అప్పరమేశ్వరుకరుణన్ । గొప్పలుగా నవిక్రమార్కుగుణములకొఱకై
చెప్పెద రసభావంబులు । ముప్పిరిగొనునట్లు కథలు ముప్పదిరెంటిన్.

ఈకవివంశమునకు మూలపురుషుఁడైన పెన్నయామాత్యుఁడు

సీ. కలుషమండలికభేకఫణీంద్రుఁడన రాయగజగంధవారణఖ్యాతి మెఱసి

* * * *

నెగడె నందవోలు నెలవుగా భూసుర । వంశసాగరామృతాంశుమూర్తి
చక్రవర్తిమాన్యసౌజన్యధుర్యుండు । విక్రమార్కనిభుఁడు పెన్నవిభుఁడు.

అనుపద్యమునుబట్టి నందవోలురాజులయొద్ద మంత్రిగానుండి బిరుదముల నందినట్లు కను

పట్టుచున్నాఁడు. ఇతఁడు పదునాలవ శతాబ్దమధ్యమునందుండి యుండవచ్చును. కాఁబట్టి యీపెన్నయామాత్యున కేడవపురుషుఁడైన కవి తరువాత నూటయేఁబది సంవత్సరములకనఁగా పదునేడవశతాబ్దాంతమునం దుండి యుండును. కవితండ్రియైన కసవరాజు వేముగల్లుపురాధీశ్వరుఁడయిన వల్లరాజు మంత్రియైనట్టు

శా. రాణన్ మల్లన కీర్తిచంద్రికలు పర్వం బొంది మధ్యాశ్రిత
క్షోణీభృద్ఘనదుర్గమై గుణమణిస్తోమంబుల న్నిండి యీ
క్షోణిన్ శ్రీపురుషోత్తమాశ్రయము నై శోభిల్లి దానామృత
శ్రేణిన్ ద్యాగసముద్రనామము వహించెన్ వేముగ ల్లిమ్మహిన్.

ఇత్యాది పద్యములవలనఁ దెలియవచ్చుచున్నది. కాని యీమల్లనృపాలుఁ డెవ్వఁడో యేకాలమునందుండినవాఁడో యింకను విచారింపవలసియున్నది. ఎట్లయినను గవి యించుమించుగా నిన్నూఱుసంవత్సరముల క్రిందటివాఁ డగుటకు సందేహము లేదు. ఈ విక్రమార్కచరిత్రములోని గద్యమునందు

"ఇది శ్రీమదుగజగంధవారణ వైరిమండలీకభేకఫణీంద్ర వీరఘోట్ట విభాళాది బిరుద ప్రకటచారిత్ర కౌవలెపెన్నయామాత్యపౌత్ర హరితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజ విరచితంబైన......"

అని పెన్నయామాత్యుఁడు తనకు తాతయైనట్లు చెప్పుకొనెనుగాని వంశవర్ణనమువలన నతఁడు కవి కేడవపురుషుఁడైనట్టు స్పష్టమగుచున్నది. ఈద్వాత్రింశత్సాలభంజికాకథల కవిత్వము విక్రమార్కచరిత్రమును రచించిన జక్కనకవిత్వమునకుఁ జాలకపోయినను మొత్తముమీఁదఁ జక్కనిదిగానే యున్నది. ఈపుస్తకములోనివి రెండుపద్యము లిందుఁ బొందుపఱుపఁబడుచున్నవి—

ఉ. అన్నలొ తమ్ములో చెలులొ యాత్మజులో ననువారు వీరికై
మిన్నక చావ నేల యిది మేలె భుజంగ బలిభోజికయ్యె నా
యున్నెడ విశ్వసింప నొరునొద్దకుఁ జేరఁ బ్రమాద మౌనఁ గ
న్నన్న నెఱింగి యొండెడకుఁ జాగుఁడు ప్రాణము తీసి చూచితే.—ఆ. ౪.

ఉ. దేవసమాన నిన్ను వినుతించుట వాంఛితసిద్ధి భూమిలో
నేవసుధేశు నీయెదుట నెన్నఁగవచ్చు మదీయజిహ్వ ల
జ్జావశమై చలింప దిఁక సద్గుణముం దగ సద్గుణాఢ్య ప్ర
స్తావన చేయనేరనియతం డతిమూర్ఖుఁడుగానఁ జెప్పెదన్.—ఆ. ౧౧.

## కొడిచెర్ల-శ్రీనివాసకవి.



ఇతఁడు శేషధర్మరత్నాకర మనియెడి యాఱాశ్వాసముల పద్యకావ్యమును రచియించెను. ఈగ్రంథమును శేషధర్మము లనియు నందురు. ఈకవి యాత్రేయ గోత్రుఁడును కొండయభవానిపుత్రుఁడును; రాజమహేంద్రపుర నివాసుఁడు. ఇతఁ డిన్నూఱుసంవత్సరములకు ముందుండినవాఁడు. ఇతఁ డొకవేళఁ బదునేడవశతాబ్ద మధ్యమునందుండి మధ్యకవులలోఁ జేరవలసినవాఁడేమో! పుస్తకములోని

"ఇది నవీనసాహిత్యబంధ-బంధుర ప్రబంధ నిబంధనా చాతురీధురీణ సకలకళా ప్రవీణ ఆత్రేయగోత్రపవిత్ర-కొడిచెర్ల కొండయభవానిపుత్ర ఐవరగండ బిరుద ప్రచండ మంత్రిమార్తాండ సమస్త సద్గుణావాస శ్రీనివాసప్రణీతంబైన హరివంశంబునందలి శేషధర్మసారంబను మహాప్రబంధంబునందు"

అను గద్యమును బట్టిచూడఁగా నితఁడు మంత్రిశిఖామణియై బిరుదముల నందినట్లును, అత్యంతాధునికుఁడు కానట్లును, కనఁబడుచున్నాఁడు. ఈతనికవిత్వము ప్రౌఢమయి రసికజనహృదయంగమముగా నున్నది. ఈతని శేషధర్మములనుండి కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. నెలకొని సంగమంబున జనించును గామము కామవృద్ధిచేఁ
దలకొనుఁ గ్రోధ మట్టిదెసిదం బగుక్రోధమునం దనర్చు మో
హలతిక మోహవృత్తి నుదయం బగు విస్మృతి విస్మృతిం జనన్
దలఁపఁగ బుద్ధి బుద్ధిచనినన్ మతితాఁ జెడు మానవుం డిలన్.—అ. ౧.

ఉ. మేఁడియు నీగినున్ భుజముమీఁద ధరించుచుఁ బోతుటెద్దుతోఁ
గూడఁగఁ గాఁడిఁబూన్చి మునికోల కరంబునఁ బట్టి పగ్గముం
ద్రాడును మోకువారెనయుఁ దాలిచి ముందట వెళ్ళఁ జుంగురే
లాడఁగఁ గాసెఁ గట్టుకొని యుత్కటిలాత్మకుఁ డేఁగెఁ జేనికిన్.—అ. 3.

ఉ. రామ కృపాభిరామ రిపురాక్షసవీరవిరామ సాహసో
ద్దామ లసద్గుణప్రకరధామ సమస్తకృపాలలోకసు
త్రామ విభాకరాన్వయసుధాశరధీశ్వరసోమ సద్గుణా
రామ నినుం బ్రశంసింప నల రాజకళాధరుఁడైన నోపునే.—అ ౫.



## పట్టమట్ట-సోమనాథకవి.



ఇతఁడు స్కాందపురాణములోని సూతసంహితను యేడాశ్వాసముల గ్రంథముగాఁ దెనిఁగించెను. ఈకవి యారువేల నియోగిబ్రాహ్మణుఁడు; హరితసగోత్రుఁడు; వేంకటామాత్యపుత్రుఁడు. ఇతఁడు తన గ్రంథమును బిక్కనవోలి కామారెడ్డికిఁ గృతము చేసెను. ఈగ్రంథము రచియింపఁబడినకాల మిప్పటి కిన్నూఱుసంవత్సరములక్రిందట నెక్కువయినట్టు తోఁచుచున్నది. కృతిపతియైన కామినేని కామారెడ్డియెప్పుడుండినవాఁడో తెలిసినదికాదు. కృతికర్త గోదావరీమండలములోనివాఁడు. సూతసంహిత కవిత్వము సలక్షణమయినదిగానున్నది. కవితాధోరణిని దెలుపుటకయి సూతసంహితలోని పద్యములు కొన్ని యిందుదాహరింపఁబడుచున్నవి—

ఉ. మున్ను పురాణపూరుషుఁడు ముఖ్యుఁడు విష్ణుఁడు శంభుమాయపైఁ
గొన్న విమోహితుండయి యకుంఠితగర్వ మెలర్ప నేన యీ
యున్న జగంబులం బొదివి యాదికర్తను బేరుకొన్న నా
కన్న ఘనుండు నాసముఁడు గన్గొన నెవ్వఁడు శాశ్వతంబుగన్.—ఆ. ౧.

ఉ. పాపము లట్టు కొన్ని యెడఁబాసిన రోగము లెల్ల మాని య
ద్దీపితసత్వుఁడై దృఢమతిన్ శశివర్ణుఁడు దున్నరై కర
ణాపరతంత్రవృత్తిఁ దృణకాష్ఠఫలోదకశాకమూలనా
నాపరిచర్యలన్ దినదినంబు గురున్ భజియించు నెంతయున్.—ఆ. ౩.

చ. సరవి నబోధమూల మగుసంసృతివృక్షము మూలనాశనం
బురుగతిఁ జేయు మంత్రరచితోదక పుష్పముఖార్చనంబు లే
సరణిని జాల హాత్తరతి జ్ఞానమె ముఖ్యశివార్చ యాబహి
ర్వరచితపూజనంబు లవివేకులు స్థూలము లందు రజ్ఞతన్.—ఆ. ౫.

ఉ. అట్టిమహేశ్వరుం దెలిసి యవ్యయధామము నొందవచ్చు నే
పట్టునఁ గర్మకోటి నది ప్రాప్తముకాదు సమస్తయజ్ఞముల్
గొట్టన భూరిసంసరణనీరధి దాఁటఁగ మంటిఓడ తా
నెట్టుల మృత్యువున్ జరయు నేచును గేవలకర్మతంత్రులన్.—ఆ. ౭.



## ఓపి-రమణకవి.



ఇతఁడు వాసిరెడ్డి రామలింగప్రభుని ప్రేరణముచేత శృంగారధామమను రెండాశ్వాసముల ప్రబంధమునుజేసి శ్రీమంగళగిరి నృసింహస్వామి కంకితముచేసెను. కవి తన్నుఁ గృతిచేయఁ బ్రేరేపించిన రామలింగప్రభునిఁ దనప్రబంధమునం దిట్లు వర్ణించియున్నాఁడు—

సీ. ఏధన్యవంశమునఁ దెలిమి నుమానాథువరమున నభివృద్ధివంతుఁ డయ్యె
నేమేటికూటస్థుఁ డెసఁగ వేమనృపాలుప్రీతిచే భువి వాసిరెడ్డి యయ్యె
నేమహాత్మునితండ్రి యొప్పెడుఁ గుతుబుశానృపాలుచే గజాందోళికంబు
లేమయ్య యగ్రజుఁ డెలమి శాత్రవవీరగజరాజసింహుఁడై గలననముకా
నతనివంశజుఁ డానికూటస్థజాతుఁ | డతనిసత్పుత్రుఁ డాతనితమ్ముఁ డగుచు
నమరె బహుగుణరత్నరత్నాకరుండు | కదనవిజయుండు రామలింగప్రభుండు.

ఈపద్యముఁబట్టియే యీకవి నిర్దుష్టముగాఁ గవిత్వము చెప్పలేనివాఁడనుట స్పష్టమగుచున్నది. అభివృద్ధిమంతుఁడనుట కభివృద్ధివంతుఁడనియు, అందెననుట కందెననియుఁ బ్రయోగించినను మొత్తముమీఁద గవిత్వము రసహీనమైనదికాదు. కృష్ణామండలములోని యమరావతీ సంస్థానప్రభువుల ప్రేరణమునుబట్టి పుస్తకమును రచించుటయు మంగళగిరి నృసింహుని కంకితము చేయుటయు విచారింపఁగా నీకవి కృష్ణామండలములోనివాఁడనుట తేలుచున్నది. కుతుబుశాహ పేరొకటియుండుటచేతఁ గవి పదునేడవశతాబ్దమధ్యమునం దుండినట్లూహింపఁదగియున్నది. శృంగారధామమునుండి రెండుపద్యము లిందుదాహరింపఁబడుచున్నవి—

చ. అళికులవేణికిం బ్రియుఁ డనంగనృపాలుఁడు దాడిచేసి యీ
వలనికి నేఁటరేపటనె వాసిగఁ గాఁగలఁడంచు బాల్యముం
గళవళమంది చిత్తిలఁగఁ గన్పడెఁ దన్ముఖరాజచిహ్నముల్
కలికి వయఃప్రకాశగుణకాంతియు బాల్యవయస్సుసంధిగన్.—ఆ. ౧

మ. సరినీవారమువింటి కేగఁ గని యేఁ జాలించి యున్నంతలో
నరయం దస్కలమేమి మున్నటిమదీయాగ్రంబు మాకిచ్చి యే
సఁగణింబోయెఁ గాఁబొమ్మటంచు వడిఁ జెంచచ్చి తెయి వేశ్య త
త్కరయుగ్మాంచితకంకణంబు లొగిఁ దాఁ గాంక్షించి తీసె న్వెసన్.—ఆ. ౨



ఈపద్యములవలనఁ గృతిపతిపూర్వులు విజయనగర సంస్థానాధీశ్వరుల సేనాపతులు యుండి ప్రభుత్వము సంపాదించిరనిమాత్రమేకాక కవికాలమును సహితము నిర్ణయింపవచ్చును. వేంకటపతిరాయలు ౧౫౮౬ వ సంవత్సరము మొదలుకొని ౧౬౧౪ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసినవాఁడగుటచేత నాతనికి నాలుగుతరముల తరువాతివాఁడు కృతిపతియుఁ గృతికర్తయు ౧౭౦౦ వ సంవత్సరప్రాంతములయందున్నట్లు నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఇంతేకాక యాగ్రంథవిస్తృతిలోని యీక్రిందిపద్యములో బింగళి సూరన్నను బూర్వకవినిగా నభివర్ణించుటనుబట్టి కూడఁ గవి యాతనికిఁ దరువాతి వాఁడని చెప్పవచ్చును.—

సీ. చతురాస్యుఁ డనఁగను జగతి వాగనుశాసనప్రౌఢిఁ జెలువందునన్నపార్యుఁ
గుందలీంద్రుఁ డన నఖండమేధాస్ఫూర్తిఁ జెలరాఁగు తిక్కనయజ్వమౌని
నచ్యుతైకసమాఖ్య నరచితవరభాగ ప్రకటించు శ్రీనాథసుకవివరుని
సన్నారులఁ సుప్రసాదతేజంబులఁ బఠియించెదు సోమభాస్కరులను
భూనుతకృష్ణరాజసుతుఁ బోతరాజు । శుభమతి రఘునాథుఁ బింగళి సూరనార్యు
మతి యనాంధ్రోక్తిసర్వార్థ జ్ఞానపటిమ । ఘనతరకవులఁ గొలుతు మహాకవులనెంతు.

ఈక్రిందిపద్యములలోఁ గవి కృతిపతియొక్క తాతయగు పొట్టి లింగభూపాలుని తండ్రి యగు లింగభూపాలుని బహువిధముల వర్ణించియున్నాఁడు—

సీ. ఘనమార్గవర్తుల్ గాని గోత్రుల ఘనమార్గవర్తుల్ గాఁగఁ జేసెఁ
గవిదానమహిమంబు గాంచనివిభుల కవిదానమహిమంబు గాంచఁ జేసె
మిత్రపద్ధతిదప్పి మెలఁగెడువైరుల మిత్రపద్ధతిఁ జెంది మెలఁగఁ జేసె
నెలమిఁ బావనుల నాశ్రయింపనిపురులు నెలమిఁ బావనుల నాశ్రయింపఁ జేసె
ననుచు మెచ్చుచు జనులు మావనజనయన । యాతని నెవ్వాఁడు భుజపీఠి నాశ్రయించె
నతని నుతియింపఁ బెరమె సహస్రఫణికి । భైరవ పొట్టిలింగభూపాలవర్యు.

* * * *

సీ. ధరణిరాజులుగాని ధరణిరాజులుగారు దీటుదాఁగుణమాదివ్యరుచుల
నినకేసములుగాని యినకేసరులుగారు ప్రతిప్రభావాటోపపటుబలముల
నల నరేంద్రులుగాని నలనరేంద్రులుగారు పురుషభాసురవచోభోగములను
గోత్రేశ్వరులుగాని గోత్రేశ్వరులుగారు సద్దైర్యబంధురైశ్వర్యములను
నతనికనిమిష్ఠ భావుకేపకులు తిశల । వెలసె నెవ్వాఁడు ప్రఖ్యాతి విస్తరిల్ల
నతఁడు చెలువొందె రాయవేశ్యాభుజంగ । జయమదిదరశాలి లింగభూజానిమౌళి.

ఉ. లింగనృపాలపుత్రుఁడగు లింగనృపాలుని శుద్ధకీర్తిభా
లింగని శారదాభ్రపటలింగని నాకధునీతరంగపా
లింగని నీలచేలునిహలింగని మానసవిస్ఫురన్నరా
లింగని పద్మగర్భునిచెలింగని సారె హసించు నెంతయున్

ఈవఱకుదాహరింపఁబడినపద్యములచేతనే యితఁడు ప్రౌఢకవియనియు నిరర్గళకవితాధారగలవాఁడనియుఁ దెలియు నయి యున్నను శివరహస్యఖండములోని కొన్ని పద్యములఁగూడ నిం దుదాహరించుచున్నాను—

సంభవకాండము.

ఉ. తేనియవాఁక యిచ్చటను దిన్నఁగ రాఁగదవే మృగీమదం
బీశిలతాళిబోఁదలిడు నిచ్చటజాజెదుసుమ్ము కోకిలో
ద్గానము లిందు వినెదె కలకంఠి యటంచు సఖీజనావళుల్
మానుగ హెచ్చరింప ననమానమహామహిమాభిరావళ్యుల్.—అ ౧.

మ. పతితస్వచ్ఛశిరోజములు ద్దరఁగా బల్జిన్నమామేననత
ర్వళులున్ ప్రేలఁగఁ గంపమంద శిరమున్ వక్త్రంబు విర్దంతమై
వెలయన్ భూరిజరాతిభారమున గర్వీభూతుఁడై సారె ప్ర
స్థలనంఘ్రిద్వయ మొప్ప గద్గదిక మించన్ వృద్ధవిప్రాకృతిన్.—అ. ౨.

ఉ. పోయెద నుండెదన్ సమరము న్నచియించెద నాయధేచ్ఛ నే
లా యిటు లాఁగఁ దావకబలంబుఁ జలంబును లావుఁ జేవయున్
వేయివిధంబులం బలుక వేమఱు నాకు జనించు హాస మో
హో యిటు చాలుఁ జాలు విను మోరి వధించెద దానవాధమా—అ. ౫.

# ఏమ గు_లక్ష్మణకవి

ఈకవి బహుగ్రంథములు చేసి ప్రసిద్ధి కెక్కినవాఁడు. ఇతఁడు చేసినగ్రంథములలో రామవిలాసప్రబంధము కడపటిదిగాఁ గనఁబడుచున్నది. ఈప్రబంధము పెద్దాపురసంస్థానము దుండిన శ్రీవత్సవాయ గోపరాజున కంకితము చేయఁబడినది. ఈగోపరాజు తన్నుఁగూర్చి పలికినట్లు కవి తన రామవిలాసములో నీపద్యములఁ జెప్పుకొన్నాఁడు—

సీ. సురుచిరాపస్తంబసూత్రు వాధూలసగోత్రు సద్వినయాదిగుణసమేతు
నేమఁగు లక్ష్మకవీంద్రునిపౌత్రుని శ్రీమాభిరామ నృసింహామంత్రి

దౌహిత్రు భూవరాస్థానపూజ్యుఁడు తిమ్మమంత్రికిఁ బేరమాంబకు సుపుత్రు
ధన్య ననంతాభిధానానుజుని వీరభద్రున కగ్రజు భాగ్యవంతు
లలితకవితాకళాధుర్య లక్ష్మణార్య! నన్నుఁ బిలిపించి యుచితాసనమున నుంచి
చాలఁ గరుణించి తనముఖాబ్జమున మందహాస మమరఁగ నిట్లని యానతిచ్చె.

సీ. సృజియించినాఁడవు సేతురామేశ్వరమహిమంబు పాండిత్యమహిమ మెఱయఁ
గల్పించినాఁడవు ఘనతెన్నజాహ్నవీమాహాత్మ్యకృతి సుధామధురఫణితి
నిర్మించినాఁడవు నిర్జరభాషచే శతకంబు భాస్కరస్వామి కలిమి
రచియించినాఁడవు రుచిరంబుగా సుభాషితరత్నమాలిక శివుని పేర
రమ్యవిశ్వేశ్వరోదాహరణ నృసింహ దండకాదిస్తుతిప్రబంధములు గూర్చి
సభలలో నుత్తమఖ్యాతి నమరినావు లలితగుణధుర్య యేమందు లక్ష్మణార్య.

గీ. వారిజాసనవారీముఖారవింద సారసౌరభఘన ఘనసారసాంద్ర
వీటికాబంధురసుగంధవిభవమధుర లలితవాగ్ధుర్య యేమందు లక్ష్మణార్య.

గీ. ధీరులు నుతింప నిప్పుడు మీరు సేయు భాసురం బగురామవిలాసకావ్య
మంకితము చేయు మాపేర నచలధీర ధరణి నాచంద్రతారకస్థిరముగాఁగ.

పైపద్యములవలన నితఁడు రామేశ్వరమాహాత్మ్యము, గంగామాహాత్మ్యము, గీర్వాణ సూర్యశతకము, సుభాషితరత్నావళి, విశ్వేశ్వరోదాహరణనృసింహదండకాదిస్తుతులు, రామవిలాసము, చేసినట్టు తెలియవచ్చుచున్నది. మఱియు నితఁడు విశ్వామిత్రచరిత్రము మఱియొక గ్రంథమునుగూడ రచించినట్లు సుభాషితరత్నావళి యవతారికలోని యీక్రిందిపద్యమువలనఁ గానవచ్చుచున్నది—

క. రామేశ్వరమహిమము వి శ్వామిత్రచరిత్ర సూర్యశతకంబును గం
గామాహాత్మ్యము మొదలగు శ్రీమత్కృతిరత్నములు రచించితి వాఁటియుఁ.

ఆఱువేల నియోగియైన యీకవి యాపస్తంబసూత్రుఁడు; వాధూలసగోత్రుఁడు; తిమ్మకవిపుత్రుఁడు; లక్ష్మణకవిపౌత్రుఁడు; మాచిరాజు నృసింహుని దౌహిత్రుఁడు. ఈతని తల్లిపేరు పేరమాంబ; అన్న యనంతకవి; తమ్ముఁడు వీరభద్రుఁడు. ఈకవి వంశమునకు మూలపురుషుఁడు పైఁడిపాటి సింగన్న. ఈకవిపూర్వులయింటిపేరు పైఁడిపాటివారయినను సింగన్నవంశజులలో నొకఁడగు జలపాలామాత్యుఁడు పెద్దాపుర సంస్థానాధీశ్వరుఁ డగు గజపతిరాజుచే నేనుఁగును బహుమానమందుటచే నప్పటి నుండియు నేనుఁగువారని మాఱినది. ఈయంశమే సుభాషితరత్నావళ్యవతారికలో నిట్లు చెప్పఁబడినది—

సీ. పరమేష్ఠికుల్యాగ్రభాగావృతంబు వాధూలజుఁ డన బహుళీంద్రుం డౌత్రేయ సూత్రయామ్యార్తి
యమ్మునినాథువంశమ్మున క్షీరాంబుధి సుధాకరుఁడునుం జన్మించినట్లు
ప్రభవించి శ్రీపైడిపాటి సింగనమంత్రి వరులగ్రగణ్యులై వెలయు నతని
మహిమసంతానక్రమమున జలపాలసచివుఁ డొప్పె బలాసనసచివసముఁడు
గజపతిక్షితిధర్తచే గజముతోడ। నగ్రహారము లతఁడు పరిగ్రహించె
నెలమి నేనుఁగువారన్న యింటిపేరు। గలిగె నతనికి గజలాభగరిమవలన.

గీ. ఈద్యగజపతివత్ససోమేశ్వరాగ్ర। హారశాసనుఁడై మహోదారభాగ్య
మహిమఁ గలిగినజలపాలమంత్రిమణికి। గేకిరాజు జనించె విఖ్యాతయశుఁడు.

ఈకవియొక్క పూర్వులు చిరకాలమునుండి పెద్దాపురసంస్థానమున నుద్యోగము లలో నుండుచువచ్చిరి. వారిలోఁ గొందఱు కవులు సహితముండిరి. పయిపద్యమునఁ జెప్పఁబడిన గేకిరాజునకు మనుమఁడును కవికిఁ బితామహుఁడును పెద్దాడ గ్రామమునకు కరణము నయినయేనుఁగులక్ష్మణకవి పెద్దాపురసంస్థానమునం దుండి వత్స వాయివంశజు లయిన యచ్చటిరాజుల కనేకకృతు లంకితము చేసెను. ముందుగాఁ గవి తనతాతనుగూర్చి సుభాషితరత్నావళిలో చెప్పినపద్యముల నుదాహరించి యాతఁడు రచించినగ్రంథనామములను కృతిపతులనామములను రామవిలాస కృతిపతినిఁ గూర్చి చెప్పినపద్యము ముందు వివరించెదను—

ఉ. సారదరూపకీర్తిద్రుహిణసారథికిన్ గురురాజమంత్రికిన్
బేరమకుం దనందనుఁడు పేర్మి జనించె విలాససంపదన్
మారోదయుఁ డ్విక్రమంబునఁ గుమారుఁడు లక్ష్మణశౌరి భూమిలో
భారవి సాహితీవిజితభారవి ధీరవిచారవిశ్రుతిన్.

ఉ. దండి మనోజ్ఞశబ్దకవితార్థుని చే నుపమానవృద్ధిచే
పండితపాళివాసు రసరీతితరంగితసూక్తి గుండలిం
ద్రుం డని ధీరు లెంచఁగఁ గృతుల్ రచియించినధన్యునిన్ మహా
పండితమాన్యు నెన్నఁదగు భాజితసూర్యుని లక్ష్మణార్యునిన్.

గీ. కృతులొసఁగె వత్సవాయితిమ్మనృపతి చేతఁ। దురగమణిభూషణాంబరాందోళికాది
పూజఁ గైకొని పెద్దాడపురవరాను। శాసనుం డయి లక్ష్మణశౌరి తనరె.

కవియొక్క యన్నయైన యనంతార్యుఁడు గౌరీపరిణయకావ్యము రచించినట్లు సుభాషితరత్నావళిలోనే యీక్రిందిపద్యమునఁ జెప్పఁబడినది—

క. గౌరీపరిణయకావ్యము। సూరీంద్రులు మెచ్చఁ జెప్పి శుంభత్కవితా
పారీణబిరుద మందిన। భూరియశోధనుఁ డనంతబుధవరుఁ డలరన్.

లక్ష్మణకవి రచియించిన రామవిలాసమునుబట్టి యితనికాలమును దెలిసికొనవచ్చును. ఇతఁడు కూచిమంచితిమ్మకవికి బంధు వయినను కాకపోయినను, ఆతనితో సమకాలికుఁ డయినందునకు సందేహము లేదు.

క. హాటకగర్భవధూటీ। లాటనచలితాంఘ్రినూపురారావశ్రీ
పాటచ్చరములు తేనియ। తేటలు మాకూచిమంచి తిమ్మనమాటల్.

అను కూచిమంచి తిమ్మకవినిగూర్చినపద్య మీతఁడు చెప్పినదైన నయియుండవచ్చును. రామవిలాసము వత్సవాయ గోపరాజున కంకితము చేయఁబడినది. కవి కృతినాయకుని

సీ. తనమహౌదార్యంబు తనమహాధైర్యంబు కరణి జీమూతలాఘవ మొనర్పఁ
దనవినిర్మలకీర్తి తనవిక్రమస్ఫూర్తి పగిదిఁ బద్మాహితోపమ వహింపఁ
దనవిద్యాభూతి తనరూపవిఖ్యాతి గతిఁ గమలోద్భవగామ మీరఁ
దనకార్ముకప్రౌఢి తనప్రతాపనిరూఢి భాతి ధనంజయప్రథిమఁ బూన
ధరణి నుతికెక్కె నిజభుజాదండమండ। లాగ్రదర్శనచకితమత్తారిపుఁడు
వత్సవాయసింహాద్రిభూవరసుతుండు। ప్రణుతగుణశాలి గోపభూపాలమౌళి.

సీ. శారదనీరదనారదపారదహీరదరస్ఫూర్తి నవఘటించి
శరదిందుకరకుంద శరబృందవరచందనహారిచందనకాంతిలహరి మీటి
హరికాంతహరిదంతహరిదంతకరిదంతవిధుకాంతపృథుకాంతవిధ హసించి
పురవైరిధరణీధ్రగిరిదారిహరిశౌరిచరణనిర్ఝరవారిసురుచి గేరి
పాండురాఖండనిజకీర్తిమండలంబు। పుండరీకభవాండంబు నిండి మెఱయఁ
బ్రాభవము గాంచె సింహాద్రిరాజనుతుఁడు। ప్రణుతగుణశాలి గోపభూపాలమౌళి.

ఇత్యాదిపద్యములతో నెంతవర్ణించినను, ఈగోపరాజు పెద్దాపురసంస్థానాధీశ్వరుఁడుగాక తత్సంస్థానాధిపతి యగుతిమ్మజగపతిమహారాజుగారి కాప్తబంధు వయి గౌరవము నొందినవాఁడుగా నుండెను. అప్పుడు ప్రభువుగా నుండిన జగపతిమహారాజుల పుత్రుఁ డగుతిమ్మజగపతిమహారాజుగారు ౧౭౫౯ వ సంవత్సరము మొదలుకొని ౧౮౦౨వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసిరి. ఈయన సింహాసనమునకు వచ్చినది ప్రమాది సంవత్సర పుష్యశుద్ధదశమి. గతదినమునం దీయనతండ్రిగారగు రాయజగపతిరాజుగారు శ్రీపూసపాటి యానందగజపతిరాజుగారితో ఉండూరువద్ద జరగిన యుద్ధములో హతులైరి. అంగీరస సంవత్సర కార్తికశుద్ధ ప్రథమదినమున జనన మొందినందున, జనకుని మరణమునాఁటి కీయనకు వయస్సనిమిదిసంవత్సరములు. ఈయన నలువది యైదుసంవత్సరములు జీవించి పింగళ సంవత్సరాశ్వయుజబహుళపంచమినాఁడు పరలోకగతులైనారు. ఈయనకాలమునం దుండి యీయనను బహుపద్యములతో స్తుతిం

చినవారగుటచే వేఁగు లక్ష్మణకవిగారు ౧౪౭౦-౮౦ సంవత్సరముల వఱకును జీవించి యున్నట్టు కనఁబడుచున్నది. అందుచేత నీకవి కూచిమంచితిమ్మకవి మరణానంతరమున నిరువదియేండ్లు జీవించియుండవచ్చును. పెద్దాపురపురాజు లగువత్సవాయవారు తాము మొదటినుండియు విద్వాంసు లయి విద్వత్కవుల నాదరించుచుండినట్లు వారివంశచరిత్రమువలన విస్పష్ట మగుచున్నది. ఈవంశపువారి మూలపురుషుఁడు సూర్యవంశ్యుఁడయి కృష్ణామండలములోని గుడిమెట్ట రాజధానిగాఁ గల చాగిపోతరాజైనట్టు రామవిలాసములోని యీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

గీ. సహ్యజాతీరమునకు భూషణ మనంగ । సిరుల కిరవగు గుడిమెట్టపురము తనకు
రాజధానిగ సత్కళాభోజరాజు । చాగిపోతక్ష్మాభర్త జగతి నేలె

ఈసాగిపోతరాజుయొక్క శాసనములు గుడిమెట్టలోను నవాబుపేటలోను బెజవాడలోను ౧౨౩౦వ సంవత్సరము వఱకును గానఁబడుచున్నవి. ఈతనియింటిపేరు సాగివారే యైనను, ఈతనివంశమువారిలో నొకఁడగు రామనృపాలుఁడు

"తగ వత్సవాయాఖ్యనగరంబు నిజనివాసము చేసె నదికారణముగ సాగి
వంశమునకు వత్సవాయనామము లోక । సుప్రసిద్ధ మగుచు సొంపుగాంచె"

తననివాసమును వత్సవాయనగరమునకు మార్చినందున గృహనామము వత్సవాయవారయినది. వీరివంశజులలో నొకరగు (పేరరాజసుతు లయిన) ముసలి తిమ్మరాజుగారు ౧౫౫౫వ సంవత్సరమునకు సరియైన యానందసంవత్సర భాద్రపద బహుళసప్తమినాఁడు పెద్దాపురసంస్థానమును సంపాదించి ౧౬౦౭వ సంవత్సరమునకు సరియైన పరాభవసంవత్సర మార్గశిరబహుళ ద్వితీయవఱకు నేఁబదిరెండుసంవత్సరముల రెండుమాసముల యిరువదియైదుదినములు రాజ్యముచేసి లోకాంతరగతు లయిరి. దిట్టకవి విశ్వనాథకవి విరచిత మైన శేషధర్మములను గృతినందిన దీయనయని రామవిలాసములోని యీపద్యము తెలుపుచున్నది—

సీ. బిరుదాంకపురిని సుస్థిరముగా నిర్మించెఁ జాలమున్నీటినిబోలు చెఱువు
తిరుపతిలక్ష్మికగిరిఁ బూలపల్లెయు ఫలవృక్షవనములు నిలిపెఁజాల
నృహరిగేహతటాకనిక్షేపవనములు కొమరుగాఁ బెద్దాపురమున నునిచె
విశ్వనాథకవీంద్రవిరచితశేషధర్మప్రబంధము సాదరముగ నంది
విప్రవంశప్రశస్తులు వెలయఁజేసెఁ । బుత్రులను గాంచె నీతిని బుడమి నేలె
వత్సవాయాన్వయమునకు వన్నెఁదెచ్చె । పెంచి పేరయతిమ్మధాత్రీశ్వరుండు.

ఈతిమ్మరాజుగారు డెబ్బదియాఱుసంవత్సరములు బ్రతికి కాలధర్మము నొందఁగా, శ్రీముఖసంవత్సర కార్తికశుద్ధపంచమినాఁడు జనన మొందిన యీయనపుత్రుఁడు రాయపు

రాజుగారు ౧౬౦౪వ సంవత్సరమునందు తండ్రిపోఁగానే రాజ్యపరిపాలన మారంభించి నలువదిరెండుసంవత్సరములు రాజ్యము చేసి ౭౫ ఏండ్లు బ్రతికి ౧౬౪౬వ సంవత్సరమునకు సరియైన సర్వధారి సంవత్సర మాఘ శుద్ధసప్తమినాఁడు పరమపదప్రాప్తి నొందిరి ఈయన హరిభక్తిసుధోదయ మనుకృతినందిన ట్లీక్రిందిపద్యము చెప్పుచున్నది—

సీ. శ్రీరాముకుఁ గట్టుమూరను గట్టించె గుళ్ళు మంటపములు గోపురములు
గంభీరజలతటాకంబు త్రవ్వించె గృహస్థపురంబున సుస్థిరముగఁ
బొలుపుగా వాల్మీకిపురకాంద్రకోటను ఫలభూజవాటిక ల్పరిలఁ బతిచెఁ
ద్రావ్య మగుహరిభక్తిసుధోదయం బను మహాకృతిరత్న మందుకొనియెఁ
బేరగలుగు సుహమ్మకు బేగు నరిమి | మెచ్చఁగాఁ దగినఘవిరాలు తెచ్చుకొనియెఁ
బగతురగువాఁగుండియ గ్రిగులుకొనఁగఁ | దిమ్మనృపరాజు పత్తుమాధీశ్వరుండు.

ఈయన యనంతరమందు పింగళసంవత్సరాశ్వయుజ శుద్ధసప్తమినాఁడు జన్మించిన యీయనపుత్రుఁడు సార్వభౌమ తిమ్మరాజుగారు సింహాసనమునకు వచ్చి ముప్పదితొమ్మిది సంవత్సరములు ప్రజాపరిపాలనము చేసి డెబ్బదవయేఁట ౧౬౮౫వ సంవత్సరమునకు సరియైన ప్రభవసంవత్సర ఫాల్గుణబహుళత్రయోదశినాఁడు దేహావియోగమునొందిరి. మన కవితాతయైన యేనుఁగు లక్ష్మణకవిగారి మనకాలమునందే యుండి యీమహారాజునకుఁ దాను రచించిన ద్రౌపదీపరిణయము నంకితము చేసిన ట్లీక్రిందిపద్యములవలనఁ దెల్లమగుచున్నది—

సీ. రాజులు మెచ్చఁ బల్నాటికోట సాధించి సరిహరికేస్తు దుర్గము మడంచెఁ
సుదురైరిభావణికోట లగ్గలుపట్టి యొందుకోటయు మ్వాఁ గెలిపె
దగరాజు మొదలైనవారలను భంగించె శిశ్వంభరుని యుద్ధహతుఁ జేసెఁ
దగఁబూసపాటి సీతారామభూపాలుఁ డభిమానముగఁ బ్రియంబుగాంచె
సాహసము రువవాక్షీను మనగపతిని గయ్యమున గెల్చె లోకవిఖ్యాతి చెంద
వత్సవాయాన్వయమునకు వన్నె తెచ్చె | రాయసప్తపాలు శ్రీతిమ్మరాజమౌళి.

చ. హరిహరపద్మజాంశభవుఁడై తగు నేనుఁగు లక్ష్మణార్యచే
సురుచిరశబ్దభావరసశుభదలంకృతిమాధురీమనో
హర మగుద్రౌపదీపరిణయం బను నుత్తమకావ్య మందె ను
స్థిర మగుకీర్తి సొంపెసఁగఁ దిమ్మనృపాలుఁడు ధర్మపద్ధతిన్.

ఈయేనుఁగు లక్ష్మణకవియే ధ్రువచరిత్రమును వేంకటరాజపుత్రుఁ డగుజగ్గరాజునకును, తులామాహాత్మ్యమును కస్తూరిరంగరాజపుత్రుఁ డగుజగన్నాథరాజునకును, వత్సవాయ

కులజు లయిన రాజబంధువుల కంకితము చేసిన ట్లీ క్రిందిపద్యములవలనఁ దెలియవచ్చుచున్నవి—

చ. కవికులసార్వభౌముఁ డనఁగాఁదగు నేయఁగు లక్ష్మణార్యుచే
ధ్రువచరిత్రప్రబంధము బుధుల్ వినుతింపఁగ నంది యాగభు
గ్విభవమహానుభావభవకారణ మైన యశంబు గాంచె వా
సవనిభవృందు వత్సవను జగ్గనృపాలుఁడు సద్గుణోన్నతిన్.

ఉ. హేమనగేంద్రధీరుఁ డగునేయఁగు లక్ష్మణసత్కవీంద్రుఁ డు
ద్దామసుధామయోక్తి వితతం బగునట్లు రచించినట్టి శు
ల్యామహిమప్రబంధము గుణాఢ్యులు మెచ్చఁ బరిగ్రహించెఁ బ్రా
జ్ఞామహితుండు జగ్గనృపచంద్రుఁడు శాశ్వతకీర్తి సంధిలన్.

ఈతిమ్మరాజుగారి యనంతరమం దాయన తమ్ము లైన బలభద్రరాజుగారికుమారులు రామపరాజుగారు ౧౬౨౯వ సంవత్సరమునందు రాజ్యమునకువచ్చి యిరువదియారు సంవత్సరములు రాజ్యపాలనముచేసి నలువదేండ్లప్రాయమున ౧౬౫౫వ సంవత్సరమున నైన మన్మథసంవత్సర జ్యేష్ఠశుద్ధ చతుర్థీనాఁడు పరమపదమునొందిరి. ఈయన తండ్రి యగు బలభద్రరాజుగారు తాను కవులయి రామశతకమును జెప్పుటయే కాక కిరాతార్జునీయకృతినందిన ట్టీపద్యము తెలుపుచున్నది—

చ. అమితఖ్యాతికి మూలమైనకృతిఁ దానందెన్ గిరాతార్జునీ
యము శ్రీరాముల పేరఁ బద్యశతకం బారూఢి నిర్మించె భో
జమహీనాథగతిన్ బ్రతిష్ఠఁ గనియెన్ సాహిత్యపారజ్ఞుఁడై
రమణన్ శ్రీబలభద్రరాజు ప్రజలన్ రక్షించె ధర్మస్థితిన్.

తరువాత రామపరాజుగారికుమారుఁడు తిమ్మరాజుగారు రాజ్యమునకు వచ్చి దాదాపుగా నిరువదిసంవత్సరములు పాలనము చేసి ముప్పదిసంవత్సరముల ప్రాయముననే ౧౬౭౫వ సంవత్సరమున నైన రాక్షసనామసంవత్సర చైత్రశుద్ధ ద్వాదశీనాఁడు పరమపదము నొందిరి. తదనంతరమున వారి పుత్రుఁడు శ్రీరామజగపతిరాజుగారు రాజుగాఁజేయఁబడి యిరువదిసంవత్సరము లెనిమిదినెలలు రాజ్యపాలనము చేసి యొందూరువద్ద శ్రీపూసపాటి యానందగజపతిరాజుగారితో జరిగిన యుద్ధమునం దిరువదియైదుసంవత్సరముల యీడుననే ౧౬౯౯వ సంవత్సరమున నైన ప్రమాదిసంవత్సర పుష్య శుద్ధ నవమినాఁడు రణనిహతు లయిరి. ఈయన పిమ్మటనే యేయఁగు లక్ష్మణకవిగారి కాశ్రయుఁడయి యుండిన (రామజగపతిరాజుగారి పుత్రుఁడయిన) తిమ్మజగపతిగారు రాజ్యమునకు వచ్చి ౧౭౦౮వ సంవత్సరమువఱకును ప్రభుత్వముచేసి స్వర్గస్థు లయిరి.

పయిని వివరించిన చరిత్రమునుబట్టి పెద్దాపురసంస్థానాధిపతు లందఱు నించుమించుగాఁ దాము కవులయ్యును కవుల నాదరించి కృతులందినవారయ్యును ఉండిరని తెలియవచ్చుచున్నది. ఏమనఁగ లక్ష్మణకవి తిమ్మజగపతిరాజు తండ్రియగు రాయజగపతి మహారాజుగారి కాలములో సహిత ముండినట్లు తద్విదితమైన యీచాటుపద్యము పలుకుచున్నది.

ఉ. ఆయుతవత్సరాయుతకులాంబుధిపూర్ణనిశాపతీ జగ
ద్గేయగుణాకృతీ! విదితకీర్తిసతీ కమనీయయౌవన
ప్రాయనవలాకృతీ సతతవైభవనిర్జితపూర్వదిక్పతీ
ధీయుతవాక్పతీ జగపతీ నృపతీ సుకృతీ మహోన్నతీ.

ఈజగపతిరాజుగారు కవిత్వమునందు నిపుణులయి పెక్కుపదములు శతకములు దండకములు మొదలయినవి భద్రాద్రిరామునిమీదఁ జెప్పినట్లు రామవిలాసములోని యీ పద్య ముద్ఘోషించుచున్నది—

చ. పదములు కీర్తనల్ రుచిరపద్యశతంబులు రాగమాలికల్
మృదుపదదండకంబులు సమిద్ధగతిన్ రచియించి కామిత
ప్రదునకు భద్రశైలరఘునాథునకుం గానుకగా నొసంగె నా
త్రిదశులు మెచ్చఁగా జగపతిప్రభుచంద్రుఁడు భక్తిపెంపునన్.

ఏమనఁగ లక్ష్మణకవికృతములయిన గ్రంథములలో సుభాషితరత్నావళియు రామవిలాసమును మాత్రము నాకు లభించినవి. అందు మొదటిపుస్తకము భర్తృహరియొక్క సంస్కృతగ్రంథమునుండి తెనిఁగింపఁబడినను, కొంచెమయినను విరసముగా నుండక మూలానుసారముగాను నిర్దుష్టముగాను రసవంతముగాను హృదయరంజకముగాను ఉన్నది. స్వప్నమునఁ బెద్దాపురగ్రామమునందలి సోమశంకరస్వామి తనహృదయమున సాక్షాత్కరించి సుభాషితరత్నావళిని దెలిఁగింపు మన్నట్లు కవి యీపద్యమునఁ జెప్పుకొన్నాఁడు—

సీ. కలధౌతగిరియును గలధౌతగిరియును విల్లుగాఁ బొడవైనయిల్లుగాఁగఁ
గమలాహితుండును గమలాహితుండును శరముగా లలితశేఖరముగాఁగఁ
బద్మోద్భవుండును బద్మోద్భవుండును సారెగా మెయిఁదాల్చుబూదిగాఁగఁ
బవనప్రియుండును బవనప్రియుండును సొమ్ముగా ఫాలనేత్రమ్ముగాఁగఁ
గ్రాలువెలువేల్పు సుమ్మెనవాలుదాల్పు! జగములకు ఱేఁడు ధనదునిసంగడీఁడు
మారహరుఁడు పెద్దాపుర సోమశంకరుఁడు హృదయ!సరసిజంబుననాకు సాక్షాత్కరించె.

రామవిలాసములోని యవతారికనుండి యున్నపద్యముల నుదాహరించినతరువాతఁ గవిత్వము నిర్దుష్టముగాను మృదుమధురవాగ్గుంభనలు కలదిగాను ఉండు నని వేఱుగఁ

యము పద్యములలోఁ జెప్పఁబడినదానినిబట్టి కవి యీశంకరవిజయమునుగాక యీయాంధ్ర కృతులను మఱియుఁ బెక్కింటిని రచించినట్టు కనుపట్టుచున్నది. రంగరాట్ఛందస్సును రచించిన కస్తూరి రంగకవి తనకు విద్యాగురు వయినట్టు చెప్పి కవి గ్రంథాదియం దాతని నిట్లు స్తుతించియున్నాఁడు—

సీ. భారతి కేవిప్రవరునిజిహ్వ నిత్యముగ వసించునాస్థానవాటి
వాణీవధూటి కెవ్వానిసూక్తులు ధరియించినట్టిముత్యములచాలు
శారద కేసుధీస్వామి చేతోవీధి యమరినరత్నసింహాసనంబు
పలుకులవెలఁది కేభాగ్యునిగృహంబు నెట్టుగా వసియించు పుట్టినిల్లు
నలువచెలువకు నెవ్వఁ డెన్నఁదగుపుత్రుఁ డట్టికస్తూరిరంగార్యు నచలధైర్యు
నార్యనుతచర్యు మద్గురువర్యు నెంచి ప్రణుతిగావింతుఁబలుమాఱుఁ బ్రస్తుతింతు.

మొత్తముమీఁద నీయాంధ్రకాళిదాసునికవనము సరసమైనదని చెప్పవచ్చును. శంకరవిజయములోని కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

శా. ప్రామాణ్యం బగుతావకీనకథితప్రఖ్యాతసంశుద్ధవే
దాచారంబులు మాని తప్పితులై యాహూకుచిహ్నంబులన్
వైచిత్ర్యంబుగఁ దాల్చి విప్రముఖులా వారెల్ల సత్యంబుమి
థ్యాచారంబున సంచరించెదరు పిత్రాపహాధ్యులై యీశ్వరా.—ఆ. ౧.

చ. అనయము నైజధర్మములయందుఁ దలింపక మిత్రశత్రుభా
వముల స్వపక్షమందుఁ బరపక్షమటందుఁ దలంప కెంతయున్
ఘనసమబుద్ధిమీఱఁ గలఁగంగొన కెవ్వరి నొవ్వనేయకే
పనుపడి స్వస్థచిత్తుఁ డగువాఁ డుసుమీ హరిభక్తుఁ డెంతయున్.—ఆ. 3.

మ. నను నీభక్తుఁ డటంచు నెంచ కిల విన్నాణంబుగా నిట్లొన
ర్చెనయజ్ఞానుల నేమిపల్కనిఁక నీచిత్తంబు నాభాగ్య మో
యనుకంపాంబుధి నిన్ను నమ్మితిని నెయ్యంబొప్ప నీవేళ నీ
యనలార్తిం దొలఁగించి ప్రోవుము నృసింహా దీనకల్పద్రుమా.—ఆ. ౬.

## సింగళి-ఎల్లనార్యుఁడు.

ఈకవి సర్వేశ్వరమాహాత్మ్య మను నామాంతరముగల తోభ్యచరిత్రమును రచియించెను. తోభ్యచరిత్రము నాలుగాశ్వాసములు గలచిన్నగ్రంథము. ఇతఁడు శ్రీమ

రివ్వటూరి శరభనారాధ్య సద్గురుప్రసాదలబ్ధాష్టవిధకవిత్వప్రవీణ" అని గద్యము నందు వ్రాసికొనుటచేతను,

సీ. భక్తిమై రేణుకప్రముఖ కేత్తము నుతించి మాయదేవాఖ్యాయుమహిమ పొగడి
చెలఁగి యథావాక్యముల నన్నమయగారి భజియించి మ్రొక్కిడి పాలకుఱికి
సోమన్నగారిఁ బ్రస్తుతిచేసి ప్రియమంది శివదేవముఖనవకవుల నెంచి
గణపతిదేవుని ఘనతసన్నుతిచేసి వేమనఁ గీర్తించి విమలమతిని
వ్యాసవాల్మీకికాళిదాసాదిఘనుల। నన్నపార్యుని దిక్కనయజ్వ నెఱ్ఱ
ప్రెగడ ధూర్జటిఁ బోతన భీమకవిని। జెలఁగి శ్రీనాథముఖకవిశ్రేణిఁ దలఁచి.

అని శివభక్తులను ముఖ్యముగా నుతించి యుండుటచేతను, ఈకవి శైవుఁడయిన నియోగి బ్రాహ్మణుఁడని యూహింపఁదగియున్నాఁడు. ఇతఁడు క్రైస్తవుఁడుగాక శైవబ్రాహ్మణుఁడే యైనపక్షమున, క్రైస్తవమతగ్రంథ మేల చేసెనో తెలియరాకున్నది. ఇతఁడు క్రైస్తవమతావలంబనముచేతఁగాని, ధనాపేక్షచేతఁగాని యీగ్రంథమును రచించి యుండును. కవి భారద్వాజగోత్రుఁడు; పింగళి నాగయామాత్యపుత్రుఁడు. ఇతఁడు కృష్ణామండలములోని కొండవీటిసీమయం దుండిన నియోగిబ్రాహ్మణుఁడు. ఈకవి తమ్మ రాయపరెడ్డి ప్రేరణముచేత నీగ్రంథమును రచియించెను. ఈసందర్భమునఁ గవికృత్యాదిని వ్రాసినపద్యములఁ గొన్నిటి నిం దుదాహరించుచున్నాను—

చ. తనర విదర్భసీమ కవతంస మనందగుకొండవీటి కిం
ద్రునిదిన రాజ్యలక్ష్మికి నిరూఢనివాస మనంగ భక్తవా
దనుపుర మొప్పు నుర్వరకు హారమణిస్థితిఁ బొల్చి సజ్జనల్
ధనకనకాంబరామలపదావిభవోన్నతిఁ జెంది వర్ధిలన్.

వ. ఆపట్టణంబున కధీశ్వరుండు.

సీ. తనకీర్తికామినుల్ దశదిశాభాగరంగస్థలంబుల నాట్యగతులు నెఱపఁ
దనశౌర్యవహ్ని దుర్దమభయంకరశత్రునగరీశ్వరాటవుల్ దరికొనఁగఁ
దనదానధారానితంబినీరత్నము లబ్ధినాయకులతో నఱగి పెనఁగఁ
దనకరుణాగసఘనతరామధ మఖిలార్థిదారిద్ర్యవియయంబు లడఁప
ఘనతఁ జెన్నొందుజగనొబ్బగండబిరుద। భూమణుఁడుతమ్మవంశాబ్ధిపూర్ణచంద్రుఁ
డలఘుచరితుఁ డనంతాదిపాత్రుఁ డెందు। రమ్యరుచిహేళి రాయపరెడ్డిమౌళి.

వ. ఒక్కనాఁ డమాత్యపురోహితవిద్వత్కవీంద్రతార్కిక మీమాంసికవందిమాగధ సుహృద్బంధు సేనాధీశ్వరసహితంబుగా నాస్థానమంటపంబునగీతవాద్యనృత్య వినోదలీలాకౌతూహలమానసుండై యుచితాసనంబున సుఖాసీనుండై

గీ. అనఁగ నతనితమ్ముఁడు పాపన్న వినయగరిమ । నాత్మధర్మప్రవర్తన ననుకరింపఁ
బరఁగ ధరమంత్రిపౌత్త్రుఁ డిపాకనార్యుఁ । డెలమి విద్యాప్రపంచము లన్నియు నేలుచుండ.

మ. నను శ్రీమద్గురుచిత్కటాక్షణమహాసంధాయసంధానపా
వనకారుణ్యకటాక్షలబ్ధవరగీర్వాణాంధ్రభాషాకవి
త్వనిరోష్ఠ్యక్రమచిత్రలక్షణచమత్కారప్రబంధాళిక
ల్పనలన్ బింగళి యెల్లనార్యమణిఁ బిల్వంబంచి పల్కెం గృపన్.

చ. ప్రణుతయశోవిశాలుఁడవు భాసురశబ్దనిగుంభనాదిల
క్షణములఁ జిత్రవైఖరుల సర్వనృపాలసభాంతరంబులన్
గణుతికి నెక్కెనీ కవితఁ గర్ణరసాయన మౌచు నిప్పురి
గణకవితానమందు నతిగౌరవ మందితి వెంచిమాడఁగన్.

* * * *

శా. కొండారెడ్డిఘనుండు కౌ ప్యపటిమన్ గొప్పైన నరాటీల ను
ద్దండుం డన్నయమంత్రి నూతనకవీంద్రశ్రేణిఁ బ్రోచున్ సిరుల్
నించన్ దామెర పేరకంసునుఁడు మన్నించంగఁ బామూరిలో
నుండు న్నిమ్న బహుళాంకపుఁగలఁ జేయుధ్యతత్కృతిశ్రేష్ఠతన్

వ. ......యున్న మజ్జనకాగ్రజుండును గొండారెడ్డికి జనకుండును నగునోబళరెడ్డి
భూకాంతునకుం దదీయాచార్యుం డగుసంజీవనాథస్వామి పరాపరవిజ్ఞానమా
ర్గోపదేశప్రసంగవశంబున నిత్యం బైనసత్యాధ్యయనవిధానప్రవర్తకుం డైన
తోభ్యుండను లోకమహాపురుషునిదివ్యచరిత్రంబు గలసర్వేశ్వరమాహాత్మ్యం
బు చిత్రంబుగా ముఖవచనంబులం దేటపఱిచి సంక్షేపరూపం బైనవాక్యగ్రంథం
బొసంగి దీనిం బఠించి సర్వేశ్వరున కంకితంబుగాఁ దెనుంగున మృదువచన
రచనాగౌరవం బేర్పడఁ బ్రబంధంబుగా నిర్మింపవలయు...............

యు దానిబట్టి యీకవి యంతకుమున్న వచనకావ్యముగా రచియింపఁబడినదానిని బట్టి యీపద్యకావ్యమును రచించినట్టు తెలియవచ్చుటయేకాక యితఁడు దామెర వేంకటాద్రిపతికాలములో నుండినట్టుకూడ స్పష్టమగుచున్నది. బహులాశ్వచరిత్రమును రచియించిన దామెర వేంకటాద్రిపుఁడు పదునేడవశతాబ్దారంభమున నుండినవాఁడు. ఇతఁ డతఁడుగాక యాతనిమనుమఁ డయ్యెను, కవి పదునేడవశతాబ్దమధ్యమునం దున్నట్లు చెప్పఁదగుచున్నది. దీనిబట్టి మాకఁగా నీతోభ్యచరిత్రము వేదాంతరసాయనమునకంటెఁ బూర్వమున రచియింపఁబడినట్టు కానఁబడుచున్నది. ఈకవి కవిత్వము మృదుమధురపాకము గలదయి హృద్యముగా నున్నది. కవనపటిమ తెల్లి

యుట కయి తోభ్యచరిత్రమునుండి కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను.—

మ. ఇల కంపించినఁ దారకల్ చెదరినన్ హేమాచలం బెంతయున్
దల క్రిందైనను భానుఁ డస్తగిరిమీఁదం దోఁచినన్ దిగ్గజా
వలి యుల్లాడిన వార్ధు లింకిన మనోవాక్కాయకర్మంబులన్
బలుకంబూనఁ డసత్య మెన్నటికి మానం డాత్మధర్మస్థితిన్.—ఆ. ౧.

మ. అకటా చేరెడుకూలిబియ్యమునకై యత్యంతరత్యాన్నదా
నకళావైభవలక్ష్మికిన్ నిలయమా నాఁటిహస్తాబ్జ మిం
తకృశీభావము నొంది క్రిందుపడఁగా నాగుండె యెంతే వికా
వికలై వ్రీలక నిల్చియుండెఁ గఠినోర్వీభృద్గ్రావషాసిరై—ఆ. ౨

ఉ. బాలుఁడు వీరి నింతకును బాముల నొందఁగనీక పెంచితిన్
దాళఁగఁజాలఁ డాఁకలికి దప్పికి వేళ యతిక్రమించినన్
మే లొనరింపఁ గైకొనిన మిమ్మిఁక నేమనివేఁడుకొందు నా
జాలి వొడంగు టెట్లు మునిసత్తమ సత్కృప నానతీయవే.—ఆ. 3.

ఉ. సంతసమంది యప్పుడ వెసన్ మగుడం జని ప్రాణనాథ యా
వంతయుఁ జింత లేదు భవదాత్మజ మున్నఁగ లేచి పాదుకల్
కాంతునిమ్రోల నిడ్డ నెసకంబుగఁ దల్పము డిగ్గి నారతీ
కాంతునిబోలు నాథుని గన్నులపండువుగాఁగఁ జూచితిన్.—ఆ ౪

చింతకుంట-కోదండరామకవి.



ఈకవి సునందాపరిణయమను నామాంతరముగల ప్రదీపచరిత్రము నైదాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడు నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు, అక్కనమంత్రిపుత్రుఁడు. కవి తన వంశజులలో సుప్రసిద్ధుఁడయి యుండిన రాయన భాస్కరు నిట్లు వర్ణించియున్నాఁడు—

సీ. ఘనతరాచార్యదీక్షాకల్పితానల్పకరనిబద్ధసువర్ణకంకణుండు
ఆసేతుశీతనగాంతరరాట్సభామధ్యవిశ్రుతకీర్తిమండలుండు
కొండపల్లి వినకొండ దుర్గద్వయీదేశప్రజావనధీయుతుండు
సకలావనీపకసంతానయాచితవస్తుప్రదానప్రవర్తమండు
అన్నవేమమహీశదత్తాగ్రహార । మదకలాందోళికాశ్వసన్మణివిశేష
భూషణాద్యష్టభూతివిభూషితుండు । భానుతేజుండు రాయనభాస్కరుండు,

ఈకవి ౧౭౫౦ వ సంవత్సర ప్రాంతమునం దుండినవాఁడు. ఈతని కవిత్వము మొత్తముమీఁద రసవంతమయి హృద్యముగానే యున్నది. సునందాపరిణయములోని కొన్నిపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

శా. సేనార్థాగతకామినీనికరకాంచీకింకిణీకంకణా
రావంబుల్ వివిధోరువాద్యపటలీరమ్యధ్వనుల్ భవ్యభూ
దేవాగ్రేసరగానసంయుతములై దిక్కుల్ మ్రోఁగ న్నిండఁగా
దేవాగారము లొప్పె నప్పురమునన్ దేదీప్యమానంబులై. —ఆ. ౧.

ఉ. ఇమ్మెయిఁ బెట్టుచాయ లవియెన్నఁగ నేటికి నైజకాంతిచే
నిమ్మవిరాక్షి మోముపై యిచ్చట నెచ్చట లేదు చూడ నీ
నెమ్మది సంశయం బయిన నిక్కము చెప్పెద నిప్పు డాన నా
తమ్ములమీఁదఁ బెట్టుకొనెదన్ ద్విజరాజునుఁ జేయిసాఁచెదన్. —ఆ. ౨.

ఉ. కుంజరయాన కాంచె నవకోరకనూతనగీతమంజరీ
మంజులపుంజరంజితసమున్నతభవ్యనికుంజసంభ్రమ
ద్గుంజదమందషట్చరణకోటిగవాంచితసద్గంతమున్
కంజముఖీవిలాససఖికాంతనిశాంతము నవ్వనాంతమున్. —ఆ. ౩.

ఉ. అన్నవులార నావలపు నంగిరపెట్టకు డమ్మ చాలు మీ
మన్నన లింక నన్నుఁ బలుమారును వేఁడకు డమ్మ ప్రాణముల్
గ్రొన్నవవింటిదేవతకుఁ గొంకక యిచ్చెద నమ్మ వాని నే
మున్న రవంత పోవిడుట మోసము వచ్చెఁగదమ్మ బుద్ధికిన్. —ఆ. ౪.

ఉ. సంతమసంబుపోక నవసాహసలక్ష్మికి వీఁక యామినీ
కాంతకుఁగాక కోకకులకంబులజోక యులూకపంక్తికిన్
జింతలమూఁక పద్మలకుఁ జెన్నుసుధాక ప్రభాతకాలపున్
వింతకురాక శోణమణివిన్నగఁ బ్రాఁకె చెలంగ దిక్కులన్. —ఆ. ౫.

## కైప మాయనకవి.

ఇతఁ డుషాకళ్యాణ మనఁబడెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఈతఁడు వైదికబ్రాహ్మణుఁడు; మహాదేవశాస్త్రికిని కామాక్షికిని బుత్రుఁడు. ఈకవి యుషాకళ్యాణమునందుఁ దనజనకుని నిట్లు స్తుతించెను—

క. కామాహంకృతిహరణుఁడు। కామాక్షీధవుఁడు విబుధగణవినుతగుణ
స్తోముఁడు సర్వజ్ఞుఁడు ని। స్సీమయశోధనుఁడు వృషవిశేషప్రియుఁడున్.

గీ. చిద్విలాసకళానిధిశేఖరుండు । శ్రీమహాదేవుఁ డాశ్రితశ్రీకరుండు
కైపకులవార్ధిచంద్రలింగనకవీంద్ర । పుత్రుఁడై యొప్పె నాకవిపుణ్య మేమొ.

గీ. ఆమహాదేవు నప్రమేయప్రభావు । ధర్మవర్ధను నను గన్నతండ్రి నార్తిఁ
దలఁచి తద్దివ్యపదపద్మములకు మ్రొక్కుదు । నతులనతులను బుధులవినతితతులను.

ఈకవి నూఱుసంవత్సరములకుఁ బూర్వపువాఁ డగుటకు సందేహముండదు. ఇతఁడు తనపుస్తకమునందను శబ్దాలంకారములను విశేషముగా సమకూర్చినగాని పుస్తకము నందు వ్యాకరణదుష్టములైన ప్రయోగము లనేకములు కానఁబడుచున్నవి. ఈశృంగార ప్రబంధము కొంతవఱకు రసపుష్టికలదిగానే యున్నది. ఈపాఖ్యానమునుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను—

మ. త్రిజగన్మోహనదీపమో బహుజయశ్రీపూర్ణనిక్షేపమో
యజనైపుణ్యకలాపమో తపనచంద్రాగ్నిత్రయీరూపమో
ద్విజముఖ్యస్తుతలగ్నమం దొకమహాతేజంబు తద్భీష్మకా
త్మజగర్భంబున నుద్భవించెను సమస్తానందసంధాయియై—ఆ. ౧.

ఉ. భంబులు గోళ్ళు పల్లవనిభంబులు కాళ్ళు మనోజకాహళా
భంబులు జంఘ లౌర కరభంబులు సక్థులు శాతకుంభకుం
భంబు లురోజముల్ దరనిభంబులు కంఠవలగ్నముల్ ద్విరే
భంబులు కుంతలంబులు శుభంబు లుపాసతిలక్షణంబులున్.—ఆ ౨

చ. అతఁడును మారుదారుణశరావళిహావళి కోర్వలేమి నో
సుతనుమణీ మనీష నిటు సోలుచు వ్రాలుచుఁ దూలనేల నీ
వితగవుఁ జింతఁ దక్కు నతి కెక్కిన హేలల నోలలాడు మా
దృతముగఁ జేతుఁ గామితముఁ దెల్పుము సల్పుము బల్పుముచ్చటల్.—ఆ. ౩.

ఉ. ఇయ్యెడఁ దియ్యమావిచిగు రెంతయు వింతగఁ దేనె లొల్కుచున్
సయ్యనఁ జాలుమేలుజిగిచాలునఁ గ్రాలు ననూనమై ఖగీ
దొయ్యలి తావకాధరసుధో సరికా దవునంచు సందియం
బయ్యెడిఁ దారతమ్య మరయంజను నీ నునుమోవి నియ్యవే.—ఆ. ౪.

ఉ. నాకులఁ బూర్వనాకుల వినంబడ నట్టివిధంబు లొప్పఁ దన్
దాఁకుచు మిన్ను ప్రాఁకుచును దద్దయు యుద్ధముసల్పుతన్మనో
ద్రేకులఁ దమ్మికేకులవరేణ్ హాలకోటి కలంకరించి పె
ల్లాఁకలిగొన్నరాకలికి నాహుతిఁ జేసెను సీరి పోరిలోన్ —ఆ. ౫.

## వెలిదండ్ల - వేంకటపతి.

ఇతఁడు రాధామాధవసంవాద మను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచియించి ప్రళయకావేరి నివాసుఁడగు మగదల రామదాసున కంకిత మొనర్చెను. ఈకవి తిరువేంగళాచార్యపుత్రుఁడు. కృతిపతియగు మగదల రామదాసామాత్యుఁడు గతశతాబ్దమధ్యమునకుఁ దరువాతి నుండినవాఁడయి యున్నఁ గవి యిప్పటికి నూఱుసంవత్సరములక్రిందట నుండినవాఁడు. ఈతని కవిత్వము మనోహరముగానే యుండును. రాధామాధవసంవాదములోని మూఁడుపద్యముల నిందుఁ బొందుపఱచుచున్నాను—

చ. పడుచులతోడ నాడఁ బసిబాలుఁడవా వలదన్న మాన నా
గడములు కొన్ని నేర్చితివి కల్లరివైతివి కొల్లకాఁడవై
దుడుకులు చేయఁజాగితివి దొంగిలఁజొచ్చితి వేమిచెప్పినన్
వడిగఁ బరాకుచేసికొని వాకిటికేఁగెదు పిల్వఁ బిల్వఁగన్.— ఆ. ౧.

ఉ. ఏవగవాఁడు చేసిన సహించి తనంతటివారిఁ జేయుచున్
దైవము దాఁట తల్లియును దండ్రియుఁ దాసయి ప్రోవఁగా జగ
త్పావనమూర్తియౌ తనకుఁ బావనమే తనఁగన్న దేవకీ
దేవిని దన్నుఁగన్న వసుదేవుని నాపదఁ బాచి ప్రోచుటల్.— ఆ. ౨.

ఉ. ఒక్కతె భ్రాంతచేఁ బొరల నొక్కఁడు మానుపఁ బూఁటకాఁపె నే
నెక్కడిదాన నీవు మును పెక్కడివాఁడవు నాకు నీకు నే
మక్కఱ వెన్కనైన నొక రాడెఱుపల్కులు నేనె పల్కెదన్
గ్రక్కఁగ నాయెఁ బోయె నవి కొన్నిదినాలు ఋణానుబంధముల్.— ఆ ౩.

## పట్టమెట్ట - సరస్వతి సోమయాజి.

ఇతఁడు పృథుచరిత్ర మను ప్రబంధమును రచియించి దాక్షారామ భీమేశ్వరున కంకితముచేసెను. ఈకవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; హరితసగోత్రుఁడు; పోతనామాత్యపౌత్రుఁడు; పెద్దనార్యపుత్రుఁడు; శివలంక గౌరనార్యునిశిష్యుఁడు. ఈశ్వరుఁడు స్వప్నమున సాక్షాత్కరించి తన్నుఁగూర్చి యిట్లు పలికెనని కవి గ్రంథాదిని చెప్పుకొనియున్నాఁడు—

సీ. నవఘంటసురతాణి నామధేయమువాఁడు తాత వెల్లాలపల్లి పోతరాజు
కవిశేఖరుం డనఁ గవిధూర్జటి యనంగఁ బెంపొందు జనకుండు పెద్దరాజు

పవనదీక్షామహేశ్వరుఁడు శ్రీరఘునాథ సోమయాజి నిజాగ్రజుండు గురుఁడు
తల్లి పాతివ్రత్యధర్మబుద్ధి కదంబ కారుణ్యజగదంబ పేరమాంబ
నీకు మద్వరలబ్ధవాణీప్రసాద । మంగళవచంబు సకలవిద్యాస్థలములఁ
బట్టమెట్టాంక వెల్వలపలివృషాంక । సోమయాజి సరస్వతిసోమయాజి.

ఉ. శైవులలోపలం బరమశైవుఁడు వేదపురాణవాణిచే
శైవగురుండు నీగురుఁడు ధన్యుఁడు శ్రీశివలంక వారిలో
దేవవిభుండు భక్తి శివదేవుఁడు గౌరయగారు సత్కృపన్
పావనకీర్తిఁ గాంచితివి బాలసరస్వతి దీక్షితాగ్రణీ.

ఈకవి కవిత్వము శబ్దార్థాలంకార భూయిష్ఠమయి మృదుమధురపదఘటితంబయి సలక్షణమయి హృదయకర్ణరంజకముగా నున్నది. ఈతని పృథుచరిత్రమునందలి శబ్దాలంకార రీతిని జూపుటకయి యొకపద్యము నిందుఁ బొందుపఱుచుచున్నాను.—

సీ. హస్తకంకణములు హస్తకంకణములు పదసంపదధికసంపద లొసంగ
మఖజాతవేదంబు మఖజాతవేదంబు స్వర్గాపవర్గరాజ్యము లొసంగఁ
గళ్యాణతత్వంబు కళ్యాణతత్వంబు సగుణనిర్గుణవృత్తిచయము మెసఁగ
సత్యానుకూల్యంబు సత్యానుకూల్యంబు సాధ్వీశ్వరత్వంబు సంఘటింపఁ
బరఁగుదైవతకులశిరోలప్రకటకుసుమ । మంజుమకరందధారాసమంజసాంఘ్రి
పద్మసన్నిధిసన్నిధిప్రభవవిభవ । శాశ్వతశ్రీకరుండు సర్వేశ్వరుండు

ఈకవి గోదావరీమండలములోనివాఁడనుట వేఱుగఁ జెప్పనక్కఱలేకయే కృతి దాక్షారామభీమేశ్వరుని కంకితము చేయఁబడుటచేతనే తెలిసికొనవచ్చును. ఇతఁడు నూఱుసంవత్సరములకుఁ బూర్వమునందుండినవాఁడు ఇతని పృథుచరిత్రములోనికొన్ని పద్యములనిందుదాహరించుచున్నాను.—

చ. మలయఁ బురంబునన్ నిరుపమానవిమానసమానధామకో
మలలలనామనోరమసమాగమభోగమదాంతతాంతతా
జలకలికానికారముఖసారసగంధసుగంధసారముల్
మలయమరుత్కిశోరములు మారవిహారకరప్రచారముల్.— ఆ. ౧.

శా. చూపుల్జూపును వియ్యమయ్యె సతికిన్ క్షోణీతలస్వామికిన్
దూపుందూపును వియ్యమయ్యె రతికిన్ దోడ్తో రతిస్వామికిన్
జాపాభ్యాసము చూడుఁడీ సభ మహాచాతుర్య మన్నట్లు త
ద్భూభృత్పారిషదవ్రచేష్ట లొప్పెఁ దమిచూపుల్ క్రీడ మళ్ళింపఁగన్.— ఆ. ౨.

చ. కదలిరి పౌరకోత్తములు గాయకులుం గవులు న్సహాకవుల్
మెదలిరి సత్ప్రియాణమతి మిశ్రితమిశ్రితతుల్ నిజాశ్రితుల్
పొదలిరి వాంఛితాగ్రపరిపూర్ణసువర్ణసువర్ణసంతతుల్
తిరసుమతిం బురంబులకుఁ దత్పరదత్పరతత్పరాగతిన్.—ఆ. 3.

చ. అలసితి రమ్మలార కుసుమాపచయం బొనరించి దండ మీ
యలయిక లేనదంతు నని యంబురుహాక్షరలక్ష్మి పంపుచు
చ్చెలు లకుఁ జెల్వలం దరిఁ జేరెన్ జలజోత్పలపత్రవాసనా
లలితమదాళికేకలకలంబుల శీతలవాతపోతముల్.—ఆ. 4.

## అవుసూరి కిచ్చయ్య.

ఈకవి కాళిదాసప్రణీత మయినరఘువంశమహాకావ్యమును పదియాశ్వాసముల గ్రంథముగా రచియించెను. కిచ్చయ నియోగిబ్రాహ్మణుఁడు; గురువయామాత్యుని పుత్రుఁడు; హరితసగోత్రుఁడు; చెన్నకృష్ణశాస్త్రిశిష్యుఁడు. ఇతఁడు మాఘమాట యేఁబదిసంవత్సరముల క్రిందట నుండినట్లు తెలియవచ్చుచున్నది. ఆంధ్రరఘువంశకావ్యము సంస్కృతకావ్యమంత మనోహరము గాకపోయినను మొత్తముమీఁద రసవంతము గానే యున్నది. కవిత్వశైలి తెలియుట కయి రఘువంశమునుండి రెండుమూడుపద్యముల నిందుఁ బొందుపరచుచున్నాను—

ఉ. ఉన్నతమస్త్యలభ్యపద మొందెదనన్ గతి నూర్ధ్వబాహుఁడై
యున్నసగర్వుఁడ్వామనుఁ డొక్కమందబుద్ధినై
కొన్నకుఁడు సాధుకవికుంజరకీర్తి వహించ నెంచినన్
సన్నుతిచేయుఁబోవుదరౌ సత్కృపులైనసమస్తభూజనుల్.—ఆ. ౧.

చ. పొలఁతిరో! నిన్ను మున్ను పుష్పకముఁబూసలఁబోలెను బావ్వవారిబిం
గులఁ బరిపంథిధాత్రిపవనా స్తవపాళిరి బ్రహ్మస్తరిరించునీ
కలితమహాజుఁడైనమహి కాంతునిచేత సమర్పితంబులై
యలరె గృహీతనూత్రకములై తగుమా కిక తారహారముల్.—ఆ. 8.

మ. తనపై విశ్వసనంబు పంక్తిముఖుమా గ్రిత్వంబున న్నుప్పుచెం
దరియీూరాజను లెయ్యెడన్ నిజచరిత్రంబందు విశ్వాస మొం
దినమీయాజ్ఞఁ బరిగ్రహింతుఁ దనయాస్త్రిం గాంచి శోభిల్లు న
జ్జనకక్ష్మావిభుకూస్తి పుత్రికని కౌసల్యాతనూజుం డనన్—ఆ. ౧౫.

ఈకవి రఘువంశముగాక మాధవాభ్యుదయ మను మఱియొక ప్రబంధమునుకూడ రచి యించెను. ఈక్రింది రెండుపద్యములును మాధవాభ్యుదయములోనివి—

ఉ. అంతట నొక్కనాఁడు చతురాస్యుఁడు వేదచతుష్టయంబుఁగానమిన్
వంతదురంతచింత బలవంతము పంతముసంతసిల్ల శ్రీ
కాంతనితాంతకాంతపదకంజయుగంబు మదిన్ ఘటించి య
త్యంతభయైకభక్తిఁ గరసారసముల్మొగిడించి యిట్లనున్.

శా. త్రుంతున్ సోమకు నుద్ధతుండు నిగమస్తోమంబు లంచున్ రమా
కాంతుం డొంది సువర్ణసంఘటితజాగ్రన్మీనవర్ష్మకృతా
త్యంతోత్తాలకరాళవాలహతి ధూతప్రాదినీశాప్రప
త్సంతానాహతిచిప్రతత్సరతరూద్యత్స్వామినాకృతిన్ — అ. ౧.

# తక్కెళ్లపాటి-లింగన్న.

ఆధునికుఁడైన యీకవియొక్క కాల మెప్పుడో నిశ్చయముగాఁ దెలియలేదు గాని యితఁ డించుమించుగా నూఱు నూటయేఁబదిసంవత్సరముల క్రిందట నుండిన ట్లూహింపఁదగియున్నది. నూఱుసంవత్సరముల క్రిందట రచియింపఁబడిన లక్షణ గ్రంథములలో సహితము యీతని గ్రంథములలోనుండి లక్ష్యములుగాఁ గైకొనఁబడిన పద్య ములు కానరావు. అట్లు కైకొనఁబడకపోవుట కీతనికవనము లక్షణవిరుద్ధముగా నుండుటయే కారణమయి యుండవచ్చును. కవి తాను రచియించిన గ్రంథముల పేళ్ల నుత్తరహరిశ్చంద్రకథలోని యీక్రిందిపద్యమునఁ జెప్పికొనియున్నాఁడు—

సీ. తగ రచించితిని మదనమోహినీవిలాసంబు మెప్పుగ యౌవనంబునందు
భక్తి సూర్యతనయాపరిణయం బనెడుప్రబంధంబుఁ జెప్పితిఁ బ్రౌఢిమమున
నావెనక విద్యుత్ప్రభావిలాసము వేడ్క ఘటియించితిని యక్షగానరీతి
నటుపిదియేండ్లప్రాయమున నుత్తరహరిశ్చంద్రాఖ్యకథ యిది సారమతిని
వేంకటేశ్వర శ్రీరామవిభుల కెలమి । సంకితంబుగ మునుచెప్పినట్టికృతుల
రీతి నిది కృష్ణునకు సమర్పించి యిప్పు । డిలను ధన్యుండనైతి వాక్యులు నుతింప

వీనిలో మదనమోహినీవిలాసమును, సూర్యతనయాపరిణయమును, ఉత్తరహరిశ్చంద్ర కథయు, పద్యకావ్యములనియు, విద్యుత్ప్రభావిలాసము యక్షగానమనియు, పైపద్యము వలననే తెలియవచ్చుచున్నవి. ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; హరితసగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; చిట్టయ్యపౌత్రుఁడు; వేంకటపతిపుత్రుఁడు. ఈతని తల్లిపేరు సూరమ్మ. ఇతనిది రసవంతమైన ప్రౌఢకవిత్వముకాదు; యౌవనకాలమున రచియిం

చిన గ్రంథములలోనే కాక యీయిరువదియేండ్లు వచ్చినతరువాత రచియించిన యుత్తర హరిశ్చంద్రకథలో సహితము లక్షణవిరుద్ధము లయినప్రయోగము లనేకములు కానఁబడుచున్నవి. ఈతరిగ్రంథములలోని రెండేసిపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి.

మదనమోహినీవిలాసము.

ఉ. అక్కట మాన్యవస్యఁ దమరాధిపుతోఁ బలుకంగ నూరకే
గ్రుక్కవ నుండలేక ప్రతికూలుఁడవై పరుషంబువల్కి నే
నిక్కడి కేలవచ్చితి సహింపఁగరాని వియోగవహ్ని చేఁ
బొక్కఁగనేల దేవపటపుంగవు లింతకు నవ్వకుందురే.

ఉ. కమ్మనివింటిబోయ యొకకంబుగ సంజమెఱుంగుటిగ్గి చే
బమ్ముక కోకదంపతులపై వడిఁ బుష్పవిమందు కాల్పఁగాఁ
వమ్మికుపాకినాళమున దాయన వెల్వడుచుక్కగుండ్లునా
దొమ్మిగఁ జమ్మరేఁగ నలువ్మెడ వెలపరోవరంబులన్.

సాగ్రైతెనయాపరిణయము

ఉ. ఒప్పెడు లేఁతమూపవసిం మాన్పి యూసరికే తెగుంగదా
యచ్చిన నొత్తినల్లు నెఱనుణ శిక్షింపఁగ నీకదెల్లఁగా
కిన్నెలువన్ వహింపఁగలఁడే మొకఁ డెందును నన్నుఁగన్న యా
పచ్చిశాటివాఁడె నగుఁ బంకజలోచనఁ బెండ్లియాడఁగన్ — ఆ. ౧.

చ. హరి యులధర్మమూతిప్రిత నప్పటి కుండెను వింటిరే రమా
వరుఁ డిటువచ్చునో యనుచు వాంక చూచితి మిన్నినాళ్ళు నేఁ
దరుదుగ నొక్కమాట వినవయ్యె ముకుందుఁడు వేఁటవచ్చె ని
న్నావనసూనలోచనని సత్యము లేకని యుక్త వృషోక్తియో. — ఆ ౫.

ఉత్తరహరిశ్చంద్రకథ.

చ. జలరుహబాంధవాన్వయమహీశాధవ! యోగవరనాథ! నేఁడుగా
ఫలితము లయ్యె మాకు భుజప్రవితహోమతపఃప్రభావముల్
కలఁగి మహాపద ల్గడచి కాంతియు మీరును బుత్రరత్నమున్
వలనుగ సర్వరాజ్యవిభవంబు వహింపఁగఁ జూడఁగాంచుటన్.

మ. సకియా! యేను త్రిశంకుసూనుఁడ హరిశ్చంద్రుండు నా పేరు పా
యక సైన్యావళితోడ ఘోరమృగయావ్యాసక్తచిత్తుండనై
ప్రకటారణ్యగిరీంద్రసానువులు చేరన్వచ్చి వర్తించుచో
నొక క్రోధం బలయించి చిక్కు కరుడే నొక్కండఁ దీవ్రంబుగన్.

## గుడిపాటి-కోదండపతి.

ఈకవి శృంగారరసమంజరి యనుపేర భానుమిశ్ర విరచిత మైన రసమంజరిని మూఁడుగుచ్ఛములుగాఁ దెనిఁగించెను. ఈగ్రంథము శృంగారనాయికానాయకలక్షణములను దెలుపునది. కవి నందవరీకనియోగిబ్రాహ్మణుఁడు. పూర్వకాలమునం దు నందుఁడనుచంద్రవంశపురా జొకఁడు కర్ణాటకదేశమును పాలించుచుండెనఁట. అతఁడు స్వీయమహిమచేత "యోగవాగ" ముల నెక్కి రహస్యముగాఁ బోయి ప్రతిదినమును కాశికాపురములో గంగాస్నానమును జేసి వచ్చుచుండెనఁట! ఈరహస్యము నతని భార్య కనిపెట్టి యొకనాఁడు తన్నుఁగూడ వెంటఁ గొనిపొమ్మని భర్తను నిర్బంధపెట్టెనఁట. అతఁ డామెనిర్బంధమును మానుపుకోలేక భార్యను వెంటఁ గొనిపోఁగా, కాశీపురమును జేరినతరువాత నామె బహిష్ఠ యయ్యెనఁట. అందుచేత యోగవాగములు మయిలసోఁకి నడవక పోయినందున నతఁడు స్వపురమును జేరుట కుపాయము తోఁపక పరితపించి గంగాతీరమునం దున్నబ్రాహ్మణులను ప్రార్థింపఁగా వారు తమకుఁ గర్ణాటకరాజ్యమునందు వృత్తుల నొసఁగునటు చముడేశ్వరీసన్నిధానమునం దాతనిచేతఁ బ్రమాణము చేయించుకొని స్నానము చేయించి యాతనిభార్య నప్పుడే తమమంత్రప్రభావముచేత శుద్ధురాలిని గేసి యోగవాగములను నడిపించి యారాజదంపతులను స్వరాజధానికిఁ బంపివేసిరఁట. అటుతరువాతఁ గొన్ని సంవత్సరములకు కాశీదేశమున క్షామము సంభవింపఁగా నాశ్వలాయనసూత్రు లయినయాబ్రాహ్మణు లేనూఱుకుటుంబములవారు వైలుదేరి పదుమూఁడుగోత్రములవారు నందునిరాజధానికి వచ్చిరఁట! అప్పుడు రాజు తాను జీవనములు కల్పించెద నన్నబ్రాహ్మణులు వీరే యని చూపుటకు సాక్షులను దేవలయు నని కోరఁగా వారు కాశికాపురమునుండి చముడేశ్వరీమహాదేవినే గొనివచ్చి యామెచే సాక్ష్య మిప్పించిరఁట! అంతట రాజు వారిమహిమ కద్భుతపడి తన పేరిట నందవర మను గ్రామమును గట్టించి వారి కగ్రహారముగా నిచ్చెనఁట. నందవరమునం దుండినబ్రాహ్మణులగుటచే వీరు నందవరీకు లనఁబడుదురు. వీరినే కరణకమ్మలనియుఁ జెప్పుదురు. ఈ యోగవాగములకథ యెట్టి దయినను, వీరు కాటకము సంభవించినప్పు డార్యావర్తమునుండి దక్షిణహిందూస్థానమునకు వచ్చి తెలుఁగుదేశములో వృత్తులను సంపాదించుకొన్న విషయములో సందేహ ముండదు. ఈతెగబ్రాహ్మణు లిప్పుడు కృష్ణా కర్నూలు బళ్ళారి మండలములలో నధికముగా వ్యాపించియున్నారు. వీరిలో నల్లసాని పెద్దన, రాయని భాస్కరుఁడు మొదలయినవారు మహాప్రసిద్ధులు. కవి మూఁడవగుచ్ఛము యొక్క కడపటఁ దన్నుగూర్చి యిట్లు వ్రాసికొని యున్నాఁడు—

సీ. శ్రీకర నందవరీకాగ్రగణ్యుండు ఋషి మీఱు గుడిపాటివంశభవుఁడు
బిరుదుగా నవఖండసురతాని పేరంది మహితుఁడౌ వేఁగళమంత్రిపౌత్రుఁ
డతులితుఁడౌ రంగయామాత్యతనయుండు వీరమాంబానందవృద్ధికరుఁడు
సింగన్న వెంగళ శ్రీనిధు లనుజులై భాసిల్లు కోదండపతిఘనుండు
సరసకవితాచమత్కారసార్వభౌముఁ । డవని శ్రీరంగధామదయాశ్రయుండు
వెలమి రసమంజరిని రచియించె నందు । సరవిగాఁగఁ దృతీయగుచ్ఛంబు తనరు.

ఈపద్యమునుబట్టి కవి వేంగళమంత్రిపౌత్రుఁ డనియు, రంగయామాత్యునకును వీరమాంబకును బుత్రుఁ డనియుఁ దెలియవచ్చుచున్నది. ఇతఁ డాశ్వలాయనసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు. ఇతఁ డేకాలమునం దుండినవాఁడో నిశ్చయముగాఁ దెలియదు. ఇన్నూఱుసంవత్సరములక్రిందట నుండి యుండునేమో! ఈతని కవిత్వమునందుఁ గొన్ని దోషము లున్నను గవిత్వము రసవంత మయి యున్నది. రసమంజరిలోని యొక్కొక్క గుచ్ఛమునుండి యొక్కొక్క పద్యము నిందుదాహరించుచున్నాను—

చ. జలదము నాథులం గనుఁగొనఁజాలెనె నీళ్ళను చిమ్మఁ, బచ్చికల్
కలుగఁగ నించెఁగా గిరులు కాంతుల నీనెనె, యెల్లవృక్షముల్
ఫలము లొసంగుఁ గాని పతిపంక్తుల నిచ్చెనె, సిద్ధయాత్మ హా
కులటకుఁ గాఁగ నేమి యొనఁగూర్పఁగ నేర్చెతి వంబుజాననా — గు. ౧.

చ. పదరుచు నీ పిటూరికిని వైనము కోరెద నన్నమాత్రలో
నదటున మేను చిక్కి వలయంబులు జారెను నీ యుంగరం
బరిగ యొసంగినం గరమునందు ధరించెఁ గంకణంబుగాఁ
గదనిక యిమ్మటంచు వెలచేడియ వోఁచు నెటున్నిటుం బటుక్. — గు. ౨.

చ. ప్రతిఫలితామృతాంశువును భామముఖంబని యెంచి నాయకుం
డతులితలీలమీఱఁ బరిహాసము చేసిన నంతయేని యుక్
బ్రతివచనంబు లేమిఁ గని పైదలి మానముఁ జెంది నంచుఁ దా
నతిపులకాంకితం బయినహస్తము చేఁ దడవుం బ్రియుంబునక్, — గు. ౩.

## మల్లసరపు—వారేశ్వరుఁడు.

ఇతఁడు భల్లాణచరిత్ర మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించెను. సింధుకటకరాజయిన భల్లాణుఁడు జంగము లడిగినదెల్ల నిచ్చుచు భక్తి చూపుచుండెనఁట! అతని భక్తిని పరీక్షింపవలె నని శివుఁ డొకనాఁడు జంగమువేషముతో వచ్చి తనకుఁ బతివ్రత

యగుయువతి కావలెనని యడుగఁగా, రాజు తనపట్టణమునం దట్టిస్త్రీ దొరకనందున దనభార్య యగుచెల్లమ్మనే యాజంగమున కర్పించెనఁట! శయనగృహమున కేగినప్పు డాజంగ మామెనంటు సందేహపడుచుండఁగా, చెల్లమ్మయే ముందుకుఁ బోయి యాయతిథిని గాఁగిలించుకొనునప్పటి కతఁడు మూడునేత్రముల శిశు వయ్యెనఁట! అంతట నా దంపతు లతఁడు శివుఁడని తెలిసికొని యారాధింపఁగా, ఈశ్వరుఁడు నిజస్వరూపముతో సాక్షాత్కరించి వారికి ముక్తి నిచ్చెనఁట!

వాలేశ్వరుఁడు పాకనాటి నియోగి యగు శైవబ్రాహ్మణుఁడు; గౌతమసగోత్రుఁడు; పోలయామాత్యపుత్రుఁడు. ఇతఁడు తనగ్రంథమును మల్లవరపు నాగేశ్వరస్వామి కంకితము చేసెను. కవి తన్నుఁగూర్చి భళ్ళాణచరిత్రమునం దిటు చెప్పుకొని యున్నాఁడు—

సీ. అనఁ బాడఁ జదువఁ జెప్పను నేర్చు సర్వజ్ఞభోజుండు మాతాత పోతరాజు
బహుపురాణజ్ఞుండు బాంధవాశ్రితకల్పభూజంబు మాతండ్రి పోలమంత్రి
పరమశాంతుఁడు కృపాపాథోధి మాపినతండ్రి విరూపాక్షదండనాథుఁ
డఖిలవిద్యానిధి యర్థార్థితతిఁ బ్రోచుదాత మత్సోదరుఁడు సదాశివుండు
నే వితర్కింప వరకవితావిశేష! వదనుఁడను బ్రాకనాఁ డింటివాఁడ శుద్ధ
శైవుఁడను గౌతమసగోత్రసంభవుండ! నెంచఁదగు మల్లవరపు వాలేశ్వరుండ.

* * * * *

మత్తకోకిల. సన్నుతం బగునట్టి వేల్పు ప్రసన్నుఁడై మముఁ బ్రోవఁగా
విన్నకోటవిలాతిలోఁ గడువేడ్క మల్లవరంబునన్
బన్నగేశ్వరసుప్రతిష్ఠను భక్తరక్షణ చేయుచున్
వన్నెమీఱఁగ నాగలింగ మనన్ వసించు మహోదయున్.

ఈకవి నివాసస్థలము కృష్ణామండలమునందలి విన్నకోటసీమలోని మల్లవర మయినట్టు పయిపద్యమువలననే విస్పష్ట మగుచున్నది. కవి యెప్పటివాఁడో నిశ్చయముగా తెలియరాదుగాని యిన్నూఱుసంవత్సరముల క్రిందటివాఁడయినట్టు కనుపట్టుచున్నాఁడు. భళ్ళాణచరిత్రములోనివి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

మ. భువి రుద్రాక్షను లెవ్వ రేని మది శంభుం డంచు భావించుచున్
జెవులన్ వక్షమునన్ శిరస్థలమునన్ జేదోయిఁ గంఠంబునన్
దవిలింపంగ ధరింతు రాజనులకున్ వీక్షింపఁగా సాటిరే
ప విరించ్యంబుజనాభకిన్నరమరుద్యక్షేంద్రలోకంబులన్.—అ.౨.

ఉ. కప్పురవీడెముం నొసటఁ గస్తురిబొట్టును జెంద్రకావియా
దుప్పటివల్లెవాటు కలదో మతి లేదో యనంగఁ జాల మైఁ
జిప్పిలు భూతిలేపనముఁ జేతను సన్నపుగాంబె త్త మా
యొప్పులకుప్ప రూపును మహోన్నతియు న్వెలసిల్లఁ జెల్వగన్.—ఆ. ౪.

## చింతలపల్లి-వీరరాఘవుఁడు.

ఈకవి మధురవాణీవిలాస మనెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచియించి శ్రీ వేంకటేశ్వరస్వామి కంకితము చేసెను. కవి నియోగిబ్రాహ్మణుఁడు; ఆశ్వలాయన సూత్రుఁడు; వీరరాఘవ పౌత్రుఁడు; వేంకటార్య పుత్రుఁడు. కవి తన్నుఁగూర్చి మిత్రు లన్నట్లుగాఁ దన గ్రంథమునం దీక్రిందిపద్యములను జెప్పికొనెను—

శా. సాహిత్యంబుఁ గవిత్వమున్ వివిధశాస్త్రప్రజ్ఞ సత్కీర్తితా
సాహిత్యంబును దత్త్వబోధమును ద్రిస్కంధాత్మక జ్యోతిషం
బూహాచాతురి దేవభక్తియును నీకొప్పున్ స్వభావంబులై
యోహో చింతలపల్లి రాఘవకవీ యాధ్యుండ వీ వన్నిటన్.

మ. అవధానంబు లనేకము ల్నెఱపి రాజాస్థానముల్ చేరి వా
దవిధిన్ ధీరుఁడవై చతుర్విధకవిత్వప్రౌఢిమ ల్చూపి భూ
ధవదత్తాశ్వపఘోటకాదిబహుసత్కారంబు గైకొన్నమి
న్నవు నీ కబ్రమె వేంకటేశ్వరుఁడు స్వప్నంబుం బ్రసాదించుటల్.

* * * *

సీ. జాములో శతకంబు సంధించి కంకణాదులఁ గొంటి వలరాయదుర్గమునను
బహుళావధానముల్ పఱపి నాలుగుసగల్ తేజి నందితి మల్లధీరువల్ల
వాగ్ఘాటిసంప్రీతి దిగ్ధరాధిపదత్తవస్తువాహనములవార్తఁ గంటి
రూపవాటీతటాకోపవనులచ్చేసి స్థిరకీర్తి చెందితి వురుతరముగ
సకలభూపాలసంస్థానశంసనీయ! నిజచతుర్విధకవితాభినేయపాండి
తీసమాధాక శాపూర్ణదిక్ప్రదేశ! వీరరాఘవ నీసరి విబుధు లేరి

పయిపద్యములయందుఁ జెప్పఁబడినవన్నియు నిజములయినపక్షమున, కవి యసమానపాండిత్యమును గవిత్వకౌశలమును గలవాఁ డయినందును సందియముండదు. కడపటిపద్యమునందుఁ జెప్పఁబడిన మల్లధీరుఁ డెవఁడో యింకను విచారింపవలసి యున్నది. కవి తుంగభద్రాప్రాంతప్రదేశములయం దుండినవాఁడు. ఈతనికాల

మేదో స్పష్టముగాఁ దెలియరాదుగాని యీతఁడు పదునెనిమిదవశతాబ్దమధ్యమునం దుండిన ట్లూహింపఁదగియున్నది. కవిపూర్వులలోసహితము కొందఱు విద్వత్కవు లుండినట్లు మధురవాణీవిలాసములోని యీక్రిందిపద్యములు తెలుపుచున్నవి—

సీ. ఏధన్యుహరితత్త్వబోధాప్తి కలపుష్పగిరిదుర్గ తోడైనవరము సాక్షి
యేవాగ్విశుకుమారతావృత్తికిని బినాకినిచెంత సేవింపుచనికి సాక్షి
యేమాన్యునైశ్వర్యసామాన్యతకు రాజ్యకృతిశిరోభూషణకృతియె సాక్షి
యేగ్రంథకారవంశాగ్రియతకు ఘనప్రభుమానితంబైనబ్రతుకు సాక్షి
యట్టిఘనుఁ డేకులంబునఁ బుట్టి వాఁడు కలిమికవితయె కా వర మడిగికొనియె
నట్టిపంతులపల్లివంశాగ్రయాయి పల్లకిపదస్థుఁడై మించు నెల్లసుకవి.

మ. చతురుండై యవధానముల్సలిపి దేశాయీలు మెచ్చన్ మహో
న్నతుఁడై యప్పకవీశ్వరుండు గిరియానారీవతంసంబునం
దతివిద్యానిధి సాహితీనిపుణు రాజాస్థానసంపూజ్యునం
చితవాగ్ధాటిఁ బ్రబంధకర్తఁ గవిసంజీవాఖ్యుఁ బుత్రుం గనెన్.

ఈకవి సంజీవాఖ్యుఁడు చంద్రాంగదోపాఖ్యానము ప్రబంధమును రచియించెను. వీరరాఘవకవియొక్క కవిత్వము ప్రౌఢమైనది. ఈతని మధురవాణీవిలాసమునుండి రెండుపద్యములిందుక్రింద నుదాహరింపఁబడుచున్నవి—

శా. కాసారస్థితిఁ బూని నీచులకు యోగ్యంబై విషప్రాయమై
గాసి న్నేకొనుకంటకంబుల నిజాంగం బెల్ల సచ్ఛిద్రమై
యేసూత్రంబున బల్మినేని బిస మాహేలావతీబాహుశా
ఖాసామ్యం బెటువొందు నా నిజ మథశిపాలిన్ సిరు ల్చెందునే.—ఆ. ౨.

చ. వలగగుపుష్పమంజరులు బంగరుతీఁగెలు ముత్యపున్సరుల్
వెలయు పుసుంగుతావు లిడ వెన్నెలకుప్పలువోలె రాజభో
గులు నగునవ్వులానిదలు కొట్నమునం దటు వట్టిధాన్యముల్
సాలసి సువాలు పాడుచును నుంకులు నించిరి మించి రమ్యగన్.—ఆ. ౫.

## రేచర్ల-మాధవరాయకవి.

ఈకవి చంద్రికాపరిణయ మనెడి యాఱాశ్వాసములప్రబంధమును రచియించెను. ఇతఁడు పద్మనాయకకులజుఁడు; సురభి మల్లక్ష్మాపాలపుత్రుఁడు. ఈచంద్రికాపరిణయములోనికథ బాలసరస్వతికృతమైన చంద్రికాపరిణయములోనిదానికంటె

వేయివది. ఇందు కథానాయకురాలగు చంద్రిక పాంచాలరాజకూఁతురు. ఈకవి నూటయేఁబదిసంవత్సరములక్రిందట నుండియుండవచ్చును. ఈకవి కవిత్వము తెలియుటకయి చంద్రికాపరిణయములోని రెండుపద్యముల నిందుఁ జూపుచున్నాము—

శా. ఏంటే మన్మథ మత్ప్రభుత్వమున కుర్వం బట్టువిఘ్నావళిన్
గెంటం దార్చుచు మామకాత్మహితభంగి న్మించు నీవుండుటల్
కంటంగానక బ్రహ్మభావము నీడుం గాంక్షించి యొక్కఁడు పెన్
గొంటు న్దాపసుఁ డెచ్చినాఁ డిలఁ దపశ్శుల్యాధ్వసంచారియై.—ఆ. ౨.

చ. పలుచవిసాటికిం బొడమి భాసురపుణ్యజనాహితాత్మునిం
గలసి చెలంగ నొప్ప దని కన్నివెలంది తలంచి ధాత్రి ని
య్యలఘుగతిన్ జనించె సముదంచిత పుణ్యజనాప్తు నొక్కరా
జు లలి వహింపఁ గోరియని సొంపుగ నెంచిరి కొంద ఱార్తులన్.—ఆ. ౫.



## అనియాది_గణపతిదేవుఁడు



ఇతఁడు శివయోగసార మనుగ్రంథమును రచియించెను. ఈవేదాంతగ్రంథము పూర్వోత్తరభాగములు గలదయి, భాగమొకటికి నాలుగేసియాశ్వాసములు గలదిగా నున్నది. ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; మూలనామాత్యుని పుత్రుఁడు. ఈతనికవిత్వము ప్రౌఢమయి హృద్యముగానున్నది. ఈతఁడేకాలపువాఁడో సరిగా తెలియదుగాని యిన్నూఱుసంవత్సరములకుముందే యుండినవాఁడయిన ట్లూహింపఁదగియున్నాఁడు. శివయోగసారమునుండి కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాము—

పూర్వభాగము.

చ. ప్రమదములో నొకింతయినఁ బాత్రున కీగి మహాఫలం బగున్
బ్రమసి యపారవిత్తము లపాత్రున కిచ్చినఁ గీడు పొందు ఘా
సము నొసఁగంగ దుగ్ధములఁ జాలఁగ ధేనువు లిచ్చు నట్టిదు
గ్ధము లొసఁగన్ విసంబొలుకుఁగాదె భుజంగమయూథ మిమ్మహిన్.—ఆ ౧.

ఉ. ఈక్రియ గర్భ మేర్పడిన నెంతయు భీతి జనింపుచుండఁ జిం
తాకులచిత్తయై కటకటా యిదియేమినిమిత్తమో కదా
నాకని కన్నుఁదమ్ముల ఘనమ్ముగ బాష్పము లేగుదేరఁగా
శోకభరాబ్ధిలో మునిఁగి సుందరి కోకిలవాణి యేడ్వఁగన్.—ఆ. ౨.

మ. ఎవఁడున్ జీవనచింతఁ బొట్టుపొరలై యేప్రొద్దు వర్తించు నీ
చులయందుం గలశీలసూనృతగుణస్తోమంబు లిట్లున్నయున్
గనరం బక్వముకానికుంభమున యుగ్నంబార నిండంగఁ బో
సినవార్యారముభంగి నాశ మగుఁ జర్చింపంగ దేహంబుతోన్.—ఆ. 3.

ఉత్తరభాగము.

శా. శాంతాకారుని నాత్మసంస్థితు శివున్ సత్కాంతిసంపన్న న
శ్రాంతంబుం దమయాత్మలో సుజను లారాధింతు రాయీశు న
య్యంతర్యాగవిహీను లల్పమతు లుద్యద్బాహ్యకర్మైకవి
భ్రాంతు ల్బాహ్యమునందుఁ గొల్తు రధికప్రాయాసముం బొందుచున్—ఆ. ౧.

శా. దేహం బస్థిరమాటఁ గన్గొని మదోద్రేకంబునం బొందక తా
దేహంబు న్తనమున్ ధనంబు నతిభక్తిన్ సద్గురుస్వామికిన్
నీహారాద్రిసుతామనోహరునకున్ నిత్యంబు సద్భక్తియు
క్తాహీనాత్ములకున్ వివేకులకు వా రర్పింతు రెల్లప్పుడున్.—ఆ. ౨.

మ. గుహలోన న్వసియించునాఁడెఁ దిరుగున్ క్ష్మాశీతలంబందు ని
స్పృహవృత్తిన్ వివిధక్రియాకుశలుఁడై పెంపొందుఁ గాదేని ప్ర
త్యహము న్నిష్క్రియుఁడైననా నిజసమాధ్యాసక్తచిత్తుండు స
ర్వహితైకస్థితిఁ బెక్కుచేష్టలమరన్ వర్తించు స్వేచ్ఛాగతిన్.—ఆ. ౪.

ఉ. బోరన భేదవాదములు పుణ్యము పాపము సంశయంబు శా
రీరమునన్ బ్రవృత్తులఁ బరిభ్రమఁ దృష్ణను బాసి యవ్వఁడే
ధారుణి నిర్గుణం బయినతత్త్వముఁ బ్రోవఁ జరించుచుండు నా
ధీరున కేలగల్గు మఱిం దలఁప న్విధియు న్నిషేధమున్ —ఆ. ౪.

## వేంకటాచార్యుఁడు.

ఈకవి ముక్తిచింతామణి యనుపేర జగన్నాథమాహాత్మ్యమును నాలుగాశ్వాసముల గ్రంథమునుగా రచియించెను. ఈకవి వైష్ణవ బ్రాహ్మణుఁడు; యతిరాజకుల పెరుమాళ్లాచార్యుల కుమారుఁడు.

"ఇట్లు గురుపరంపరానుసంధానపూర్వకంబుగా శ్రీజగన్నాయకుని కంకితంబుగా ముక్తిచింతామణిప్రబంధం తెనుంగు చేయుమని రాజమహేంద్రవరా

ధ్యత్మ పద్మనాయకాగ్రేసర కోన తిమ్మరాయకకృత కనకాంబరాభరణాను
లేపనపూర్వకసమర్చన ప్రేరితుండనై"

అని కవి వ్రాసికొనియుండుటనుబట్టి రాజమహేంద్రపుర ప్రభువైన కోన తిమ్మరాజు ప్రేరణముచేత నీగ్రంథము చేయఁబడినట్లు తెలియవచ్చుచున్నది. ఈగ్రంథ మిన్నూఱు సంవత్సరములకు ముందే చేయఁబడినదేమో! జగన్నాథమాహాత్మ్యకవిత్వము రసవంతముగా నేయున్నది. ఇందుండి కొన్ని పద్యములఁ జూపుచున్నాను—

శా. ధర్మాధర్మవిచారము ల్విహితసంధ్యాపూర్వయజ్ఞాదిస
త్కర్మంబుల్ నిరతాన్నదాననియతుల్ కాలానుగుణ్యక్రియల్
మర్మం బీపురుషోత్తమస్థలములో మర్త్యాళి కెల్లన్ భవ
న్నిర్మాల్యగ్రహణం బటంచి రిఁక నీనిత్యక్రియల్ వ్యర్థమే.—ఆ. ౧.

ఉ. నిద్దురరాఁ బరుండుటయె నిక్కపుమ్రొక్కుగ నిద్రయోగమౌఁ
దద్దయు వ్యర్థహింసక్రియ సుధర్మ మగున్ నిరతాన్నదుష్టమౌ
చద్ది మహాప్రసాద మగు సన్నుతియౌను నిరర్థకోక్తియే
ప్రొద్దును నిత్యవాసులకు నిత్యులకుం బురుషోత్తమంబునన్.—ఆ. ౨.

ఉ. హీనుఁడు ముట్టినాఁ డని యెంచి మదీయమహాప్రసాదమున్
దా నుపభుక్తియోగ్య మని తప్పుబుద్ధిఁ బరిగ్రహింపకే
మానసపూజుండు హృతమంగళుఁడై భవరోగభాగుఁడై
న్యూనతఁ జెంది పంచమనియోగమునందు వసించు నెప్పుడున్.—ఆ. ౩.

మ. జలజాక్షుండు రథంబుపైఁ గదలఁ దచ్ఛాయాసమాక్రాంతుఁడై
ఖలుఁడైనన్ ఘనపాపము ల్వలఁగు సాకాంక్షన్ దదుద్యద్ధ్వజా
కలనోద్భూతరజోభరాంకితుఁడు వాక్కాయాంతరాఘంబులన్
గెలుచుం దత్సురసింధుమజ్జనఫలోన్నిద్రప్రభావుం డగున్.—ఆ. ౪.



## లింగకవి, గంగకవి.



ఈయిరువురుకవులును జేరి సీతావిజయ మనునామాంతరము గల శతముఖరామాయణమును రచించిరి. ఈయిరువురుకవులు వేదాద్రిపురనివాసులు. వీరిలో నీలకంఠోపాసకుఁ డయిన లింగకవి తాను రచియించిన మొదటి మూఁడాశ్వాసములును చిన్నారెడ్డిపుత్రుఁ డగు పోచనృపాలున కంకితము చేసెను; నృసింహోపాసకుఁ డగుగంగ

కవి తాను రచియించిన నాలవయాశ్వాసమును భోగనృపాలుని కంకితము చేసెను. ఈ యిరువురకవిత్వమును మొత్తముమీఁద రసవంతమయి సిద్ధమయి హృదయంగమముగా నున్నది. ఈకవు లిన్నూఱుసంవత్సరములక్రిందట నుండినట్లు తెలియవచ్చుచున్నది. వీరి కవనధోరణి తెలియుటకయి శతముఖరామాయణములోని పద్యము లొక్కొక్కయాశ్వాసమునుండి యొక్కొకటి యుదాహరింపఁబడుచున్నది—

చ. శతముఖనామధేయుఁ డొకచండనిశాచరలోకనాథుఁ డు
గ్రత నలపంక్తికంఠఘటకర్ణపురందరజిత్ప్రహస్త లీ
స్థితిఁ బఱుటాతయున్ హితులచే విని రామునిమీఁద నాదటన్
ఘృతయుతపావకుండుబలెఁ గీలలు గ్రక్కుచు మండెఁ గ్రక్కునన్.—ఆ. ౧.

ఉ. రాముని భక్తికంధరవిరాముని నీలపయోదకోమల
శ్యాముని మానిహృత్కుముదసంచయసోముని సత్యభాషణ
స్తోముని సార్వభౌముని విశుద్ధసుకీర్తిగుణాభిరామునిన్
ధీమణి యౌవభానుజుఁడు దిగ్గనఁ గాంచి ముదంబు చేకొనెన్.—ఆ. ౨.

శా. ఏరా యోరి వనేచరాధమ భయం బింతైనన్ లేక ప్రా
కారంబు ల్వెసదాఁటి తెల్లు వటి వీఁకం దాఁటి దుర్భవణా
కారం బొప్పఁగవచ్చి ట్లిట్లు తగ వల్క న్వచ్చి నాకుందటన్
ధీరత్వంబున నిల్చి టిట్టు లిది చింతింప న్మహాశ్చర్యమా.—ఆ. ౩.

ఉ. రాయనుఁ బోవుమంటిఁగద రాయను నిన్నుఁ గఁబాపి యోర్వలే
రాయను హా శతద్వయకరాయను మ మ్మిఁక బాధపెట్టెనే
రాయను సీతనూజాఁ గనరాయను నెక్కడఁ గందురా కుమా
రాయను సల్గ నేల వినరాయను హా శతకంధరాయనున్.—ఆ. ౪.

## అంగర నృసింహాకవి.

ఇతఁడు రాజరాజాభిషేక మను నైదాశ్వాసముల ప్రబంధమును రచియించి కొప్పుల వల్లభూపతున కంకితము చేసెను. ఈకవి రామకృష్ణభట్టారకుని కుమారుఁడు. ఈకవి యేకాలపువాఁడో నిశ్చయముగాఁ దెలియరాలేదు. ఇతఁ డల్లసాని పెద్దనాదులను జేర్కొనక శ్రీనాథునివఱకును గలకవులనుమాత్రమే కవిస్తుతిలోఁ జెప్పియుండుటచేతను మధ్యకవులమాత్రమే చేర్కొన్న చిమ్మపూడి యమరేశ్వరుని సంస్తుతించి యుండుటచేతను నృసింహాకవి మధ్యకవులలోనివాఁ డేమోయని సందేహముకలుగుచున్నది.

ఇతఁడు చేసినకవి స్తుతిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

క. భారతఘట్టోల్లంఘన। పారీణు శాధురీణబంధురధారా
ధీరప్రబంధగంధ। ర్వారూఢుని భట్టనన్నపార్యునిఁ దలఁతున్.

ఉ. అంజలిచేతుఁ బద్మజనికాంతకరాంతనిరంతరోల్లసన్
మంజులవల్లకీమధురమంద్రనినాదసముల్లసద్ధ్వని
వ్యంజకవాణ్ణిగుంభనసముంచితనూతనసృష్టిచాతురీ
రంజితసత్కవీంద్రబుధరాజికిఁ దిక్కనసోమయాజికిన్.

ఉ. ఇద్ధగుణుం బ్రబంధపరమేశ్వరు నెఱ్ఱప్రెగ్గడన్ మనః
పద్ధతి నిల్పి నాకవిరుచిభాస్కరుఁడైనహుళక్కి భాస్కరున్
బుద్ధి ఘటించి సంతతము పూనిభజింతు వచఃప్రసాదసం
సిద్ధునిఁ జిమ్మపూడి కులశేఖరు నయ్యమరేశసత్కవిన్.

క. పాథోధిపయోధర ని। ర్బాధచలద్ఘనఘుమాయమానలహరికా
పాథేయదాయిసూక్తిస। నాథున్ శ్రీనాథు నెమ్మనంబునఁ గొలుతున్.

ఈగ్రంథ మొకవేళ మధ్యకవులకాలములోనిదే యైనను దీనియందు లక్షణవిరుద్ధములైన ప్రయోగములు కొన్ని కానఁబడుచుండుటచేత నప్పకవీయాదులు తమలక్షణగ్రంథములలో నిందలిపద్యముల నుదాహరింపక పోయియుండవచ్చును. కృతిపతినిబట్టి సహితము కవియొక్క కాలనిర్ణయము జేయుట కిప్పు డాధారములు దొరకలేదు. కృతినాయకునకు కొర్రాపురము రాజధానియైన ట్లీక్రిందిపద్యమునఁ జెప్పఁబడినది—

సీ. కుదురయ్యె నేవీటికోటలోపల వైశ్యనుప్రతిష్ఠితుఁ డైనశూలపాణి
పాయలేఁ డేవీటిపర్యంతవనవాటి మిండరాయండను లక్ష్మీధవుండు
నిండారు నేవీట నెండకాలమునందు జలబాకరం బైనసాగరంబు
చుమ రొందు నేవీట సార్వకాలికఫలస్ఫురితంబు వేదంగి పోకతోఁట
నూరపురంబున కైన నబ్బురము లగుచు। నలువీఁగుచునుండు నేవీటిసిరులు
వసుమతీపాదపద్మసంవలితరత్న। నూపురంబగు నట్టికొర్రాపురంబు.

ఈకొర్రాపురము విశాఖపట్టణమండలములోని కొట్టాము గ్రామమేమో! ఈపురాధిపతియయిన కృతిపతి శూద్రకులసంజాతుఁడు.

సీ. మూర్ధాభిషిక్తకులముకుటంబు లేరాజుపాదపీఠికకు సోపానపంక్తి
చతురబ్ధివలయితక్షితితలం బేరాజుబాహుదండమునకు బావదండ
భువనంబు లేలుకర్పూరగంధి యేరాజులీలాకటాక్షపాలికకు నీడ
రజనికాంతజయంతరతికాంతు లేరాజురూపరేఖకుఁ బ్రతిరూపకంబు

లతఁడు పట్టుశాలాటకేళావిరాయ! రాజదేవేంద్రరాజాధిరాజచంద్ర
గాయిగోవాళజగనొబ్బగండబిరుద! శాలికొప్పుల వల్లభూపాలమౌళి.

మ. భరియించెం జతురర్ణవీవృతమహాభారంబు దోశ్శీరికన్
విరియించెన్ విమతాంధకారము సముద్యోత్ప్రతాపోన్నతిన్
గురియించెన్ ధనధాన్యరాశి కవిరాట్కోటీనివాసంబులన్
వరియించెన్ వరకీర్తికాంతఁ దనరన్ వల్లక్షితీశుం డిలన్.

ఇత్యాదిపద్యములలో బిరుదాంకములతో వర్ణింపఁబడి యుండుటచేతఁ గృతిపతి కవి చెప్పినట్లఖండభూమండలాధిపతి కాకపోయినను చిన్నసంస్థానాధిపతియైనట్లు కనుపట్టుచున్నాఁడు. స్పష్టముగాఁ దెలియవలయును గవికాలము నిప్పుడు పదు నాలుగువందలయేఁబదికిఁ దగువాతికాల మనుకొందము. ఈకవిత్వమునందు లక్షణ దోషము లనేకములు గలవు. ఇతఁడు ప్రబంధములోని యీమొదటిపద్యములోనే వ్రాయుట యని యుండవలసినదానికి వ్రానుట యని ప్రయోగించినాఁడు—

ఉ. శ్రీసతి చన్నుఁగ్రేవలను జెక్కులనొక్కుటఁ బత్రభంగముల్
వ్రానుటకున్ విరించి నిటలంబులనొక్కుట భాగ్యవర్ణముల్
వ్రానుటకున్ జతుర్భుజవిలాసము పూనినవేల్పు సత్కృపా
ల్లాప మెలర్పఁ బ్రోచు శుభలక్షణుఁ గొప్పుల వల్లభూవరున్.

ఇట్లు కొన్నిదోషములు కానఁబడుచున్నను మొత్తముమీఁదఁ గవిత్వము రసవంతము గానేయున్నది. రాజరాజాభిషేకములోని కొన్నిపద్యము లిం దుదాహరింపఁబడు చున్నవి—

చ. పనివడి చెప్ప నేల శిశుపాలునివిక్రమచేష్టితంబు లా
తనిపనిపూని దానవపదాతులు వచ్చిరి వీరె వారె యం
చనిశము తెప్పవెట్టక సురావళి దిక్కులు చూచుచుండఁగా
ననిమిషనామ మొక్కటియు నర్థము దప్పకయుండె నిప్పుడున్.—ఆ. ౧.

ఉ. ఆరయ విన్నమాత్రమున నైనను జూచినమాత్రనైన నె
వ్వారిమనంబులం బ్రణయవాసితమై యనురాగకందళం
బీరిక లెత్తఁ గారణ మొకించుక లేకయుఁ బూర్వజన్మ సం
స్కారవిశేషమం దది వికస్వరమై కొనసాగు నుర్వరన్.—ఆ. ౨.

చ. అమృతసరోవరంబుగ హిమాంశునిమూర్తి కరంగి లోనిచి
హ్నము వికచోత్పలప్రకరమై చెలువొందిన నందులోన సం

భ్రమమున నీదు లాడి జడిమంబున నంగము లూను నేని యా
హిమమున నించు నేని శమియించునొకో మదనాస్త్రవేదనల్ —ఆ. 3

శా. శుద్ధాంతశ్శికరక్షణైకయోగ్య మగుచన్ శోభిల్లు నస్సత్వచో
రాద్ధాంతం బిది యిచ్చగింపక వృథా ప్రజ్ఞాపరిజ్ఞానస
న్నద్ధిం బొల్పొందఁజు కేవలంబుగ వితండావాదులై తా రసం
బద్ధోక్తుల్ పచరించి రేని మదమార్ప న్వారి ఖండించెదన్. —ఆ. 4.

మ. మహిలో నీకిటు కున్న నేను విమతప్రాకృతత్వము ల్పానుటల్
సహియింపం దగునంచు నిప్పుడును విజ్ఞాపింప మా కేటికిన్
గుహనానాటకసూత్రధార భువి నీకున్ వ్యాదిమాయాదిభుల్
బహురూపంబులు పన్నఁగాఁ దిరుగరే బ్రహ్మేంద్రచంద్రార్కులున్. —ఆ 5.

## పిరిపెంగడ—ధర్మనామాత్యుఁడు

ఈకవి నలచరిత్రము నాలాశ్వాసములపద్యకావ్యమునుగా రచియించి, శ్రీవేంకటేశ్వరుల కంకితము చేసెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; హరితసగోత్రుఁడు; తిప్పయామాత్యపుత్రుఁడు. ఇతఁడు నలచరిత్రములోఁ దనతండ్రి నిట్లు వర్ణించి యున్నాఁడు—

ఉ. సూనుతుండు తిప్పనయుకో జలజాక్షికిఁ గ్రీడ సల్పఁగా
మేరుధనుర్ధరాచలము మేడ సుధాజలరాశి కేళికా
సారము పువ్వుఁదోఁట దివిషద్ధరణీరుహసంచయంబు నీ
పారమహీధరంబు కృతశాస్త్రియు నై విలసిల్లు నెప్పుడున్.

ఈతండ్రి యిందు రెనీమలోనివాఁడనియు, ఈ క్రిందిపద్యములలోఁ దనమేనమామ పేరూరి నివాసుఁడనియు, కవి చెప్పుకొనుటచేత నితఁడు గోదావరీ కృష్ణామండలముల లోనివాఁడని తోఁచుచున్నది.—

సీ. తన కేఘనుఁడు ప్రపితామహుం డగు లోహితసగోత్రుఁ డల పల్లవందనాథుఁ
డెసఁగు నేఘనుతాత యసదృశో న్నతి పుట్టమాంబాధవుఁడు తిమ్మనామాత్యుఁడు
పెంచె నేఘనుతండ్రి తనకీర్తిలత లాశ లంటఁ బెంపగు తిమ్మయప్రభుండు
వెలయు నేఘనుతల్లి విమలపతివ్రత వివిధసద్గుణశీల వెంగళాంబ
యతఁడు తుమురుగోటివరవంశాబ్ధి' ధుఁడు । సతతపేరూరి కేశవస్వామ్యధీన
మానసస్థితిఁబరఁగు నా మేనమామ । మతినిగురునన్నిభుఁడు ధర్మమంత్రిశఘుఁడు,

చ. విను మనఘాత్మ ధర్మసుకవీ భవదీయవచోవిలాసముల్
ఘనకవిహృద్వికాసములుగావె చమత్కృతిమీఱ నీవు నే
ర్చనగతి నిప్పు డానలచరిత్రము వేంకటశైలరాణ్ణివా
సునకు సమర్పణంబుగను శోభనలీల రచింపు పెంపుగన్.

ఈకవికాల మేదో నిర్ణయించుటకుఁ బుస్తకమునం దాధారము లేవియుఁ గానరాలేదు. ఇతఁడు శ్రీనాథుని వర్ణించియుండుటచేతఁ బూర్వకవి కాఁడనుట నిశ్చయము. ఇతఁ డాధునికుఁడయి యిన్నూఱుసంవత్సరములక్రిందట నుండియుండును. ఈతని కవిత్వము మొత్తముమీఁద నిర్దుష్టమయి యింపుగా నున్నది. నలచరిత్రములోని పద్యములఁ గొన్నిటి నిందుక్రిందఁ బొందుపఱుచుచున్నాను—

ఉ. ధారుణి వీరసేనవసుధావరువా లటువాల వీరు లా
సారసమిత్రుఁ దూఱి తనసన్నిధిఁ జేరినవార లెల్ల జం
భారి యిడన్ సురద్రుమసుమావళియే యుడివోయె నన్నచో
నారగణింపఁగాఁ దగమె యాఘనుఁ డొచ్చినశత్రుసంఘమున్.—ఆ. ౧.

శా. బాల న్నీలపత్త్రాంబమేడకడ లాలిం గేలిమై నుంచి జో
జో లక్ష్మీశకటాక్షవీక్షణయుతా జోజోశుభాకార జో
జో లావణ్యరమాకుమార యనుచుం జోకొట్టుచుం బాడి ర
న్నారీకీక్షణలాస్యపాలసుతు వీణాలోకికాలాపలై.—ఆ. ౨.

ఉ. వెన్నెల చందమామనను వెన్నెలనుం దగఁ జందమామయున్
సన్నుతలీల నంద మగునందమునన్ సరసీరుహేక్ష యా
కన్నియ నీవు వేడ్క నలకన్నియ కీవును జోడుగూడ నేఁ
గన్నులఁ జూతు నేమొ మఱి కాంక్షయొనర్చెద నెమ్మనంబునన్.—ఆ. 3.

ఉ. అర్థఫలప్రదాయక గుణాకర నైషధసార్వభౌమ కా
ర్యార్థుల మైన మమ్ములఁ గృతార్థులఁ జేయఁగదయ్య సర్వశా
స్త్రార్థము లెందు నీ వెఱుఁగనట్టివి లేవకదా పరోపకారా
ర్థమిదంశరీర మను టార్యుఁ దలంచఁగదయ్య ధనినిధీ.—ఆ. ౪.

శా. నీతిం జూడ నరేంద్ర మీనతతుల న్నీరంబులే మ్రింగుటల్
ఘూకక్రీడఁ గురంగకాష్ఠ మిల వృక్షవ్రాతముం ద్రుంచుటల్
జ్ఞాతిత్వంబుఁ గాదె జ్ఞాతు లెచటన్ సామాన్యులే చెల్లఁబో
జ్ఞాతిశ్చేదనలేనకి మ్మనెడుశాస్త్రంబుం బరీక్షింపవే —ఆ. ౫.

మ. లలనా ప్రాణసమాన వైననిను నేలాపాయ దే నన్న నీ
పలుకే నమ్మి భవత్పదాంబుజసమీపక్షోణి నిద్రింపఁగాఁ
గలితవ్యాళమృగాదిజంతుభయదోగ్రం బైనయీకానలోఁ
పలన న్వీడఁగ వాడి పో నధిప నీపాదంబు లెట్లాడెనో.—ఆ. ౬.



## గణపవరపు-వేంకటకవి.



ఇతఁడు శ్రీప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసమనెడి యేకాశ్వాసప్రబంధమును రచియించెను. ఇది యేకాశ్వాసగ్రంథమేయయినను, ఇందలిపద్యములసంఖ్యమాత్రము నాలుగాశ్వాసములగ్రంథములో సామాన్యముగా నుండుదానికంటెఁ దక్కువగా లేదు. ఈకవి నందవరీకనియోగిబ్రాహ్మణుఁడు; ఆశ్వలాయనసూత్రుఁడు; వసిష్ఠగోత్రుఁడు; అప్పయామాత్యపుత్రుఁడు. ఇతఁడు కృష్ణామండలములోని కామెపల్లెసీమయందలి గణపవరగ్రామవాసుఁడు ఇతఁడు పల్నాటిసీమవాఁ డగుటచేత నే స్వానుభవముచేతను గాఁబోలును 'పలనాటి గొల్లలపాటజాతి'! యని యచ్చటి గొల్లలపాటను నిరసించియున్నాఁడు. ఇతఁడు మిక్కిలి యాధునికుఁడే యయినను, ఇతనికాలనిర్ణయమాత్రము సరిగాఁ దెలియదు. ఇతఁడును దనకు వేంకటేశ్వరుఁడు స్వప్నమున సాక్షాత్కరించి తన్నుఁగూర్చి పలికినట్లు చెప్పుకొన్నపద్యములలోని యీక్రిందిపద్యమువలన నితఁడు పదునాఱవశతాబ్దాంతమునకు లోపలివాఁడుకాఁడని స్పష్టమగుచున్నది—

సీ. అల విన్నకోట పెద్దన లక్షణజ్ఞత శబ్దశాసనకవి శబ్దశుద్ధి
ప్రాబంధికపరమేశ్వరు సర్గమహిమం బుభయకవిమిత్రుని పదలలితత
శ్రీనాథువాక్ప్రసిద్ధి నాచనసోముభూరికావిత్వంబు పోతరాజు
యమకవిధము మల్లయమనీషిచిత్రంబు పింగళి సూరకవివరుశ్లేష
నాంధ్రకవితాపితామహునల్లికబిగి! ముక్కుతిమ్మనతేటయు భూషణునియ
లంకృతియు నీకె కలదౌ తలంపలక్షు! ఱంకవి యప్పయ వేంకటసుకవిచంద్ర.

ఈపద్యమునుబట్టిమాత్రమే కాక యితఁ డవతారికయందుఁ దన్నుఁగూర్చి చెప్పుకొన్నయితరభాగములనుబట్టికూడ విచారింపఁగా స్వాతిశయమును జెప్పుకొన్న యాంధ్రకవులలో నెల్ల నితఁ డగ్రగణ్యుఁ డయినట్లు కనఁబడుచున్నాఁడు. పయిపద్యమునందుఁ బదునాఱవశతాబ్దాంతమందున్న పింగళి సూరనార్యునిని (రామరాజ) భూషణుని పేర్కొనుటచేత నితఁడు పదునేడవశతాబ్దమునకు లోపలివాఁడు కాఁడనుటకు

సందేహము లేదు. మఱియొకచోట నితఁడు తన గ్రంథమునందు "లక్షణసారసంగ్రహ సరస్వతీవిలాస సాహిత్య చింతామణి సత్కవిజనసంజీవని" యని లక్షణసారసంగ్రహమును కవిసంజీవని పేరోక్తియున్నాఁడు. ఇందలి లక్షణసారసంగ్రహము చిత్రకవి పెద్దన్న రచియించినదైనపక్షమునఁ గవి పదునేడవ శతాబ్దారంభమునకుఁ దరువాతి వాఁడును, కూచిమంచి తిమ్మకవి రచించినదయినపక్షమునఁ బదునెనిమిదవశతాబ్ద మధ్యమునకుఁ దరువాతివాఁడును, అగును. ఈగణపవరపు వేంకటకవి తనకుఁబూర్వులయిన కవుల కావ్యములలోనుండి గ్రంథచౌర్యమును విశేషముగాఁ జేసినవాఁడయినందున, ఆలక్షణసారసంగ్రహము కూచిమంచి తిమ్మకవిదే యైన పక్షమునఁ దిమ్మకవి గ్రంథములనుండియు చౌర్యము చేసినాఁ డని చూపుటకుఁ దగినదర్శనములు లేక పోలేదు. ఇరువురకవుల గ్రంథములలోని యీపద్యములను జూడుఁడు—

సీ. బింబోష్ఠి యని నీవు పేర్కొనరాకు శుకంబ సాంకవగంధి యీపంకజాక్షి
పంకజాక్షి యటంచుఁ బదరకు తేఁటి చంపకజాలనాస యీపల్లవాంఘ్రి
పల్లవాంఘ్రి యటంచు బాధింపకు పికంబ రామాంగి యీబిసప్రసవబాహ
బిసబాహ యని రాకు వెసనంచ జలదశిరోరుహ యీ మహిరోమరాజి
యహిపరోమాళి యనుచు డాయకుము నెమ్మి
కార్ముకభ్రూలతిక యీచొకాఁగవుఁ జెలి
యనుచు శుకభృంగ పరభృత హంస నీల
కంఠ నికురుంబములఁ దద్దకనలి పలికె.

అని తిమ్మకవి తన రసికజనమనోభిరామములోని చతుర్థాశ్వాసమునఁ జెప్పియుండఁగా గణపవరపు వేంకటకవి

సీ. చక్రస్తని యటంచు జగడించకు శశాంక గురుతమోవేణి యీసుందరరదన
మధురాధర యటంచు మట్టుమీఱకు తేఁటి చంపకనాస యీజలజవదన
బిసబాహ యని మాఱు మసలకు రాయంచ జలధరచికుర యీకలువకంటి
పల్లవకర యని త్రుళ్ళకు కోయిల శ్రీరామమూర్తి యీకీరవాణి
వదవకు తల యాశ సుస్వర సఖిత్వ
మోసియుండుటకతన మీకితవొనర్చ
ననుచు నళి చంద్ర పరభృత హంసములకు
భయము నయమునఁ దెలియఁగఁబలికె మఱియు.

అని చెప్పియున్నాఁడు. ఈయుభయులలో నెవ్వఁడు పూర్వుఁడో యాతని పద్యమును జూచి రెండవవాడు తనపద్యమునైనను వ్రాసికొని యుండవలెను, లేదా

యిరువునుగూడఁ బూర్వమున్న యిటువంటి పద్యమును మఱియొకదానిఁ జూచి యైనను వ్రాసికొనియుండవలెను. వేంకటకవి గ్రంథచౌర్యము చేయువాఁడగుట తెలియుటకయి సరసభూపాలీయము నుండియు వేంకటేశ్వరవిలాసమునందియు నొక్కొక్క చిన్న పద్యము నిం దుదాహరించుచున్నాను—

క. ఔరా యోబన్నృపాలక! మారా మను మదనసమరమాధుర్యుఁడవై
ధీరా నృసింహ కూడిలి! మారావను మదనసమరమాధుర్యుఁడవై.

అని యీపద్యము కావ్యాలంకారసంగ్రహములో పాదయమకమునకు లక్ష్యముగా నీయఁబడియుండఁగా, వేంకటకవి

క. ఔరా మాధవయజ్వక! మారా మను మదనసమరమాధుర్యుఁడవై
ధీరా విటాగ్ర్య యేలితి! మారామను మదనసమరమాధుర్యుఁడవై.

అని పైపద్యమునే పేరులుమాత్రముమార్చి పంచదశవర్ణయుక్తపాదయమకమని తన పుస్తకములో వేసికొనియున్నాఁడు. ఈకవి వేంకటేశ్వరుఁడు తన్నుద్దేశించి పలికి నట్లు కొన్నిటిని, తానే చెప్పినట్లు కొన్నిటిని, ఇతరులు తన్ను మెచ్చి పొగడినట్లు కొన్నిటిని, స్వరచితములైన గ్రంథముల నామములను జెప్పుకొనియున్నాఁడు. ఇట్లు చెప్పుకొనఁబడిన తారావళులు, యమశతకము, శృంగారరసమంజరి, కృష్ణమల్లకథ, బాలరామాయణ ద్విపదము, చాటుపద్యములు, లింగనిర్ణయము, ఆంధ్రప్రతాపరుద్రీయము, ఆంధ్రరసమంజరి, ఆంధ్రనిఘంటువు, ఆంధ్రకౌముది, గణయతిప్రాసలక్షణ సీసమాలిక, ఆంధ్రప్రయోగరత్నాకరము, రేఫ అకారనిర్ణయము, షట్ప్రత్యయ ప్రస్తారసరణి, ఇరువదాఱు ఛందముల వచనము, అలంకారసారము, పరమభాగవత చరిత్ర, ఆంధ్రద్విరూపకోశము, కల్పితకల్పలత, ఆంధ్రవసంత తిలకభాణము, కఠిన ప్రాసశతకము, ఆంధ్రప్రక్రియాకౌముది, జాంబవతీవిలాసము, చందవిద్యావతీ దండకము, చక్రవాళతారావళి, పురాణసారము, ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయ విలాసము, అను గ్రంథములలో రెండుమూఁడులక్క శేషించినవన్నియు నామమాత్రావశిష్టములయినవి. అట్లగుటకుఁ గారణములేకపోలేదు. ఈకవి తానుజేసిన పుస్తకములు లోకమున నుపయోగపడవలెనన్న యుద్దేశముతోఁ గాక తనసర్వతోముఖ పాండిత్య ప్రకర్షమును లోకమునకుఁ బ్రకటింపవలెనన్న యుద్దేశముతో విశేషభాగము చేసి నందున నీతనిపుస్తకముల కిట్టిగతి పట్టియుండును.

సంస్కృతములోనున్న జ్ఞానధనమును జనులకు వెదచల్లవలెనన్న పరమార్థచింతతో మొట్టమొదట నన్నయభట్టారకాదులగు మహాకవులు పదునొకండవశతాబ్దారంభము నుండి సులభశయ్యను సంస్కృతగ్రంథములఁ దెనిఁగింపఁదొడఁగిరి. ఈభాషాంతరీకరణ

కార్యము పదునేఁడవశతాబ్దాంతమువఱకును నవిచ్ఛిన్నముగా జరుగుచువచ్చెనుగాని యిట్లు భాషాంతరీకరణమునకుఁ బూనుకొన్నవారిలోఁ గడపటివా రగు శ్రీనాథాదులు తమపూర్వులకన్నఁ దాము ఘనులనిపించుకోవలెనన్న చింతచేతనో మఱి యేహేతువు చేతనో సంస్కృతపదభూయిష్ఠము లైనదీర్ఘసమాసములతో నింపి రసమును జెఱుపక పోయినను తమగ్రంథములు బహుజనులకు దుర్గ్రాహ్య మైనకఠినశైలిని జేసిరి. ఇట్లా కాలములో భారత భాగవత రామాయణాదిముఖ్యగ్రంథము లన్నియుఁ దెలిఁగింపఁబడఁగా, అటుతరువాతఁ బదునాఱవశతాబ్దారంభమునం దల్లసాని పెద్దనాదు లొక క్రొత్త త్రోవం ద్రొక్కి కేవలభాషాంతరములు కాకుండఁ బురాణములలోని కథలు గైకొని స్వకపోలకల్పితములైన వర్ణనలుచేర్చి పెంచి శ్రీనాథాదులశయ్య నవలంబించి రసవంతముగా ప్రబంధములను జేయ నారంభించిరి. ఈపని నూఱు నూటయేఁబదిసంవత్సరముల వఱకును జరుగుచు రాఁగా, ౧౬౫౦వ సంవత్సరములోపల బహుమార్గముల నూతనప్రబంధము లనేకములు తెలుఁగునఁ జేయఁబడినవి. అంతటితో నూతనసృష్టి బహుతరముగా నంతరింపఁగా, ఈవలివారు వసుచరిత్రము మాతృకనుగాఁ గొని దానికి పాఠాంతరములో యనునట్లు పూర్వవర్ణనలనే తలలుమార్చి ప్రయోగించుచు వెనుకటి ప్రబంధముల ననుకరించి తమప్రబంధముల నల్లఁజొచ్చిరి. చేసినదానినే పేరులుమార్చి మగుడఁ జేయుచుండుటచేత నూతనార్థకల్పనలుజేయుట దుష్కరమయినందున నీవలివారిలోఁ గొందఱు మహాపురుషులు యర్థలోపమును పదాటోపముతోఁ బూరింపఁ బ్రయత్నించిరి. పూర్వపువా రక్కడక్కడ సముచితముగా శబ్దాలంకారములను జేర్చుచు వచ్చినను భాషావధూటికిఁ బ్రాణ మైనయర్థసారస్యమును జెడఁగొట్టకుండిరి. ఇటీవలివా రర్థసారస్యము నంతగాఁ బాటింపక నిఘంటువుల వెదకిపదము లేరికూర్చి బంధించి తమ సరస్వతిని హృదయాకర్షకముగాఁ గాకపోయినను కర్ణరంజకముగా నైనను జేయఁ బాటుపడిరి. ఇట్టివారిలో నెన్నికగన్న కొందఱు బంధాదుల నతిమాత్రముగాఁజేర్చి యర్థసారస్యమును బూర్ణముగాఁ జెఱిచి యవయవములు విఱిచి తమభాషావధూటిని విరూపినిజేసి శవప్రాయను జేసిరి. మన యీవేంకటేశ్వరవిలాసకృతికర్తయు బలరామచరిత్ర కృతికర్తయైన గుడారు వేంకటదాసకవియుఁ గొంతవఱకీ కడపటితెగలోఁ జేరినవారు. ఒకఁడు తనపుస్తకమునకుఁ బ్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాస మని పేరు పెట్టుకొనఁగా నింకొకఁడు తనపుస్తకమునకుఁ బ్రబంధరాజశిరోభూషణ ప్రకృష్ట బలరామచరిత్రమని పేరుపెట్టుకొనెను. వేంకటదాసకవి

"నిరోష్ఠ్యమత్తేభవిక్రీడిత శార్దూలోత్పలమాలా తోటక మత్తకోకిల లయగ్రాహి మణిగణనికర పంచచామరస్రగ్విణీప్రమితాక్షర మణిభూషణ ద్రుతవిలంబిత కవికంఠ

భూషణ విషయస్వఘాతా దృష్టపూర్వ ణిరథోత్థతాంబురుహ కవిరాజవిరాజిత గణస
మకదండకార్యాగీత సీస ద్వివిధకంద శ్లోకచూర్ణికా వచనకైవార గద్య కళికో
త్కళికామంజరీ ద్విపద ధవళసువ్వాలశోభనారాత్రిక నానారగడభేదసప్తతాళైలా
మహార్ణవమిలాలీశానదస్వాత్రింశద్రాగ నానావిధవిచిత్ర నాగబంధ పుష్పమాలికా
బంధసంయుక్తకల్పిత కల్పవల్లీ చంపకమాలికావృత్తము'

అని పేరుపెట్టియొకపద్యములో ననేకబంధ గర్భవృత్తముల నిమిడింపఁగా, మన యీ
వేంకటకవి దీని మించునట్లుగా ,

"బహువిధచిత్రకంకణ బంధత్రిగుణితసీసచరణచతుష్టయగర్భిత ద్విపదకందద్వయ
సమవృత్తచాపనయుగళాటవెలఁది తేటగీతి మదనవిలసిత తురంగవృత్త బహువిధ
తాళవృత్తాష్టక ధవళశోభనగానారాత్రిక గాన జంపెత్రిపుటార్ధచంద్రిక సువ్వాల
లాలిపద్యలామంజరి సమతాడిండిమతాళవృత్తమణిగణనికర తురగవల్గన రగడోదా
హరణసంబుద్ధి కళికోత్కళికాద్యాహిరి రాగదళ ముఖారిరాగాటతాళదళ కాం
భోజిరాగ రూపకతాళదళ కాంభోజిరాగ సమపద కన్నడరాగ సాంగత్య కొరవంజి
దళ రేవగుప్తిరాగ సమపద సావేరిరాగైకతాళదళ బిలహరిరాగాటతాళ సమపద
పుష్పమాలికాబంధ గోమూత్రికాబంధ తార్క్ష్యబంధ షోడశదళపద్మబంధ పాదుకా
బంధ నవరంగబంధ ఖడ్గబంధ గుచ్ఛబంధ ఛత్రబంధ చామరబంధ గదాబంధ
చక్రబంధ శకటబంధ నాగబంధ రథబంధ వీణాబంధ శంఖబంధ మృదంగబంధ
పాదభ్రమకబంధ పాదార్ధభ్రమకవింశతిబంధ భేదకందానుష్టుప్ శ్లోకాంతర్గత
చతుశ్ఛత్ర నవరంగ సర్వతోభద్రాందోళికాబంధ యుక్తానులోమవిలోమ కంద
భాషాశ్లేషకందకందాటవెలఁది గర్భితాంత్య తేటగీతియుక్తచాపష్టి భేదచిత్రసీసము"

అని పేరుపెట్టి యొకపద్యములోనే బహుబంధ గర్భవృత్తముల నిమిడ్చెను. కవిమిక్కిలి కష్టపడి పయిని జెప్పఁబడినరీతి గర్భబంధకవిత్వమును, ఏకాక్షర నిఘంటులను వెదకి

క. కైకోకీకాకకుకై । కోకాకాకింకకూకి కూకకకోకీ
కాకుకకు కేకికేకక । కూకోకోకూకకింక కోకైకాకా.

అనురీతి నేకాక్షరములతోడ చిత్రకవిత్వమును, ఒక్కదానిలో నేయితరపుస్తకములోను లేనంత యమితముగాఁ జెప్పి తనశిల్పవ్యాపారకౌశలమును గొంత చూపినను, కాళ్ళతో నడచి గమ్యస్థానమును చేరు సామాన్యమార్గమునువిడిచి యడ్డముగా భూమిమీఁదఁబడి కడుపుతో దొర్లి ప్రయాసపడి గమ్యస్థానముఁ జేరి యసాధారణప్రౌఢిమను జూపిన బుద్ధిమంతునిశక్తిని మెచ్చుకొనునట్టి యిట్టి కపటాచమత్కృతులు మెచ్చుకొనఁదగియుండును గాని యంతకంటె నెక్కువ శ్లాఘాపాత్రములు గావు.

నవరసరసికు లెప్పుడును హృదయాహ్లాదకరముగా నర్థకల్పనము చేసియు కర్ణరసాయనముగా మృదుమధురవాగ్గుంభనలతో భావములఁ గూర్చియు రసోద్దీపకముగా నీతిపోషణమొనర్చియు వర్ణనలు చేయఁగలిగిన కవినిమాత్రమే మెచ్చుకొందురుగాని కావ్యదోషములకు లక్ష్యము లగునట్లుగా నర్థగౌరవముఁ జెఱిచి పదములవిఱిచి పద్యములలోఁ బద్యములను గూర్చినవానిని మెచ్చుకోరు. ఈ వేంకటకవివర్యుని కవనమునందు వ్యాకరణదుష్టము లయినప్రయోగము లనేకములు కానఁబడుచున్నవి. ఈకవికాల మేదో సరిగాఁ దెలియ రాకపోయినను, ఈతని గ్రంథములోని సలాము సాహెబు పిరంగి తుపాకి మొదలగుపదప్రయోగము లీతఁ డాధునికుఁడని ఘోషించుచున్నవి. బంధగర్భచిత్రకవిత్వములకొఱకై శ్రమపడి కూర్చినభాగములను విడిచినపక్షమున, ఈతని కవిత్వము మొత్తముమీఁద రసవంతమయి పదలాలిత్యము కలదయి మనోహరముగానే యున్నది. ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయవిలాసములోని కొన్నిపద్యముల నిందుఁ బ్రదర్శించుచున్నాము—

చ. తగునె నృపాలకన్యలకు దవ్వులనవ్వుల పువ్వులాటలే
వగలఁ జరింప నిందుఁ దగవా మగవా మగవార లుండఁగా
మగుడి పురంబుఁ జేరఁ జనుమా వినుమా యనుమాన మేల నీ
సొగసు విలాస మందమును సొంపును నింపును దెంపుమీఱఁగన్.

ఉ. ప్రేలిమి ప్రేల్వఁ డెప్పుడును ప్రేల్చు మొగంబు వధూలలామకై
చాలఁగ సంధ్యవార్చఁడు త్రిసంధ్యలవార్చును వంటవార్పులా
బాలికయింటఁ దండ్రి సలుపం గనఁ డొల్లఁడు దేవపూజ యే
వేళల లంజెతల్లి యిలువేలుపుమాత కిడుం బ్రణామముల్.

చ. అడిగినఁ దెచ్చువాఁడొ కడునందమునం గనైనవాఁడొ మే
ల్నడవడికాఁడొ వీటఁ దగునాయకమై చరియించువాఁడొ చే
విడిముడికల్గువాఁడొ తలవెంద్రుక లందఱు రాకుమారకుల్
ముడుపులు వానగాఁ గురియ ముట్టవు కారణ మేమికూఁతురా.

శా. ఏమీ పల్కవు నేను బిల్వ దయ లేదే నీకు నాయయ్య ని
న్నేమంటిన్ సుకుమార నాయెడను దప్పేది కుమారాగ్రణీ
నామీఁదన్ జల మేలరా తనయ నన్మన్నించరా పెన్నిధీ
నీముద్దుల్గననోచినానుగద తండ్రీ నీతిపారంగతా.



## వేముగంటి-దత్తోజీపండితుఁడు.

ఈకవి ప్రస్థానత్రయములో నొకటియైన భగవద్గీతా యోగశాస్త్రమును బద్య కావ్యముగాఁ దెనిఁగించెను. ఇతఁడు హరితసగోత్రుఁడు; నాగమాంబకును నాగోజీపండితునకును బుత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; మాధ్వమతస్థుఁడని తోఁచు చున్నది. ఈయనకాలము మొదలయినవానింగూర్చి యేమియు నిశ్చయముగాఁ దెలియదు. ఇతఁడు నూఱుసంవత్సరముల లోపలివాఁడు కాఁడు. కృష్ణార్జునసంవాద మనునామాంతరము గల యీయోగశాస్త్రములోని కొన్నిపద్యముల నిందుదాహరించు చున్నాను—

ఉ. కోకలు జీర్ణమై చనఁగఁ బొబ్బన వానిఁ బరిత్యజించి తా
క్రొక్కొరనూత్నవస్త్రములఁ జెల్వుగఁ దాల్చినభంగి దేహిసు
శ్లోకుఁడు జీర్ణదేహములక్షోభను ద్రోసిన జీవమూర్తి యీ
లోకపుగోమలాంగముల లోలతఁ దాల్చును భద్రమూర్తియై.— అధ్యా. ౨

ఉ. సల్లలితంపుఁగర్మములు సాంద్రయశోనిధి సద్విరక్తిచే
నొల్లక సన్యసించి పటుయోగసుఖంబుఁ జెందుచుండుఁ దా
నెల్లెడ జీవుఁ బోలి కడుహేయపుఁదొమ్మిదితూంట్లమేనిలోఁ
ద్రవ్యముఁ జేయ నొల్లఁడు ప్రతోషముతో నియమింపఁ దన్యులన్.— అ. ౫.

ఉ. వేదములన్ మఖంబులను విశ్రుతదానతపంబులన్ సము
త్పాదితమైనపుణ్యము నధఃకరణంబొనరించుయోగి య
య్యాదిమపూరుషోత్తముని జ్ఞాఁగను నెమ్మది సంగ్రహించి ని
ర్వేదన లేక యాద్యమగు విష్ణుపదంబును జెందు నర్జునా.— అ. ౮,

ఉ. ఇంద్రియసౌఖ్యసంపదల నేమియుఁ గోరక వీతరాగుఁడై
సాంద్రయశుం డహంక్రియలచక్కటిఁ బోవక దూరవర్తియై
యింద్రజ మేనికిన్ జరయు మృత్యువు జన్మము వ్యాధులున్ వని
స్తంద్రత దుఃఖదోషములుఁ జాలఁగఁగల్గు నెఱుంగఁగాఁదగన్.— అ. ౧౩.

ఉ. కామము రాగముం బలుఁగల్గి యహంకృతి దంభయుక్తుఁడై
యేమనుజుండు శాస్త్రవిధి నెంతయుఁ దుచ్ఛముగాఁ దలంపుచున్
భూమికి భీకరం బయినభూరితపం బొనరింపుచుండు నా
పాముని నాసురక్రియులఁ బల్కెదవానిఁగ నిశ్చయింపుమా.— అ. ౧౭.

## గుడారు-వేంకటదాసకవి.

ఈకవి బలరామచరిత్రమని సామాన్యముగా వాడఁబడు ప్రబంధరాజశిరోభూషణ ప్రఖ్యాత బలరామచరిత్ర యను నాల్గాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడు బలిజవంశజుఁడు; పైడిపాలగోత్రుఁడు. ఈతని తండ్రి గురవేంద్రుఁడు; తల్లి రంగమాంబ. ఇతఁ డాధునిక కవియే యయినను, కాలనిర్ణయము చేయుట కాధారము లేవియుఁ గానరాలేదు. ఇతఁడు నూటయేఁబది సంవత్సరముల క్రిందట నుండెనేమో! ఈతని కవిత్వము ప్రౌఢమైనది. బలరామచరిత్రమునుండి రెండుపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి:—

శా. నీరేజాక్షికి హారమౌక్తికతతుల్ నీలంబులై తైలముల్
జాలంగాఁ బగడంబులై పిదప వజ్రాకారముల్పూని వి
స్తారస్వేదకణంబులం దడిసి సున్నం బయ్యె నాదుర్దమ
స్మారస్ఫారశరాగ్ని హైమపట మచ్ఛచ్ఛాయమై తోఁచినన్.— ఆ ౩.

ఉ. వారిధిధీరమానసుఁ డవారితతేజుఁడు నైజరాజకం
ఠీరవభావభీతహరిణీభవదున్మదవైరివీరుఁ డు
ద్దారుణమార్గణప్రకరదైన్యవిదారణదానదక్షుఁ డీ
భూరమణాగ్రణిం గనుము పుష్కరనేత్ర విదూరకాహ్వయన్.— ఆ. ౫

## కామనూరి-కృష్ణయ్య.

ఇతఁ డిందుమతీపరిణయ మనెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచించెను. రఘువంశములోని యజమహారాజుచరిత్ర నీప్రబంధరూపమునఁ జేసినట్లు కవియే యీపద్యమునఁ జెప్పియున్నాఁడు:—

గీ. కాళిదాసకవిశ్రేష్ఠకల్పితంబు। భవ్యచరితంబు రఘువంశకావ్యమందు
నజునికథ యాంధ్రభాషచే నలఘుమతిని। కృతి రచింపఁ బూనితి నలంకృతులు చెలఁగ.

ఈకవి నందవరీకబ్రాహ్మణుఁడు; గోవిందయామాత్యనందనుఁడు. ఇతఁడు నూటయేఁబదిసంవత్సరముల నాఁటివాఁడయి యుండునేమో. ఈతనికవిత్వము మనోహరమైనది. ఇందుమతీపరిణయములోని రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను:—

ఉ. అంత దిలీపభూపతనుజాగ్రణి దేశము మేలుబంతి మ
ధ్యందినపంకజాప్తనిభుఁ డాధరణీశుఁడె మేటి తత్సుతుం

డిందు వసంత చిత్తజ సురేశ్వరసూనులకన్న మిన్న వా
నందముఁ జెప్పఁ జూప వశమా యసమానపరాక్రమక్రమా. — ఆ. ౧.

ఉ. అన్నకు మ్రొక్కి తక్కరుణ నాయితపెట్టినదంతపుంబనిన్
జెన్నలగారుపల్లకి వసించి చొకాటపుఁదేటకెంపురా
కన్నె మెఱుంగుఁగేలఁ బొసఁగంగ ధరించె మధూకదామ మ
త్యున్నతమంగళప్రకటతూర్యరవంబులు మిన్నుముట్టఁగన్. — ఆ. ४.

## వేంకటాచార్యుఁడు.

ఈకవి భద్రరాజపుత్రచరిత్రమను నైదాశ్వాసముల ప్రబంధమును రచియించెను. కళాపూర్ణోదయమునందువలెనే యిందలికథలును కవిచే నూతనముగాఁ గల్పింపఁబడినవి; కాని కవిత్వ మంత ప్రౌఢమయినది కాదు. ఇందలికథలను బోలిన కథ లనేకములు కొన్ని వైష్ణవగ్రంథములలోఁ గానఁబడుచున్నవి. ఈకవి వైష్ణవ బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; ఆత్రేయసగోత్రుఁడు; శ్రీనివాసాచార్య పుత్రుఁడు. ఇతఁడు నూటయేఁబది సంవత్సరములక్రిందట నుండినవాఁడయినట్లు చెప్పుచున్నారు భద్రరాజపుత్రచరిత్రమునుండి రెండుపద్యముల నిందుఁజూపుచున్నాను —

శా. ఏమం జెప్పెనధంగిఁ జేసితివె కాశీశుండు ప్రత్యక్షమై
తా నిన్మెచ్చితిఁ గోర్కి వేఁడు మనెనే ధన్యుండ నైతిఁ గృపన్
నానాసౌఖ్యశుభాకరంబుఁ బరము న్నాకిమ్మి యంటే శివుం
డానందించి యొసంగెనే వరము నీ వబ్బంగిఁ జేకొంటివే. — ఆ. ౧.

ఉ. ఎవ్వరు నావిధంబు జలజేక్షణకుం దెలిపించి మేలు లో
నివ్వటిలంగరంగ నని నేర్పుదలిర్పఁగఁ దెచ్చికూర్చి యీ
నెవ్వగఁ బాపువారు తమి నిల్వఁగఁగూడదు మేనఁ బ్రాణముల్
రవ్వశిఁ బోవుచున్న యవి రాదు ధరింపఁగ నేమిచేయుదున్. — ఆ. ౫.

## మల్లంపల్లి-నాగభూషణకవి.

ఇతఁడు బసవవిజయమను మూఁడాశ్వాసముల గ్రథమును రచియించెను. ఇతఁడు వీరశైవమతస్థాపకుఁడైన బసవేశ్వరుని చరిత్రమునుమాత్రమేకాక బసవచరిత్రాదులను రచించినపాలకురికిసోమనాథాదులనుగూర్చియు నిత్యాదిపద్యములలో వ్రాసియున్నాఁడు—

క. వీరప్రతాపరుద్రుఁడు । ధారుణిలోఁ గలుగుప్రజల ధర్మాత్ముండై
యారూఢి నేలయు నేలుచు । గారవమున నున్నయట్టికాలమునందున్.

సీ. ఫాలాక్షభక్తుండు భవపాశత్యాగి సముచితభూతిరుద్రాక్షధారి
పంచాక్షరీమంత్రపఠనపారీణుఁడు విమలఘోరవ్రతవీరయుతుఁడు
కావ్యకళాశాస్త్రకామితప్రవణుండు శాఖాగ్నిఫలపత్రజలము లైన
భనిచేఁ జేకొనం దవి విననోపఁడు భాతిమీఱంగను బాలకుఁడు
సోమనాథుఁ డనంగ సురలు ప్రస్తుతిచేయ । సకలశాస్త్రములను జదివిచూచి
ప్రకటితముగ శివునిభక్తి యధికమని । బసవదేవుమహిమ ప్రబలఁజేసె.

ఈకవి శైవబ్రాహ్మణుఁడు, హారితసగోత్రుఁడు; త్రిపురాంతకారాధ్యపుత్రుఁడు; ఇతఁడు నూటయేఁబది సంవత్సరముల క్రిందట నుండినట్లు తెలియవచ్చుచున్నది. ఈతని కవిత్వ మంత మంచిది కాక, వ్యాకరణవిరుద్ధములైన ప్రయోగములతోఁ గూడియున్నది. ఈతని బసవవిజయములోని రెండుపద్యము లిందుఁ బ్రదర్శింపఁబడుచున్నవి:—

చ. బసవపురాణకావ్యమును బ్రాభవ మొప్పఁగఁ బద్యగద్యలన్
బాసఁగఁగ నాంధ్రకావ్యములు బుద్ధిని దా రచియించి చెప్పఁగాఁ
బసిగొని భూసురుల్ పనియుఁ బాముక గుఱ్ఱలు కూడి రాజుతో
మసలక పోయి పాల్కురికిమాన్యుఁడు సోమన చేయుశాస్త్రముల్ — ఆ. ౧.

చ. అధములు మీరు బ్రాహ్మణులె యందఱుఁ జూడఁగ నొక్కచెక్కి యీ
పథమున వేదవాక్యములు పాడి పదంబుల విమ్ము నందఱన్
బధిరులఁ జేసెఁగాన సభాపాల్పడి మీ రొకరైన వానితో
నెదుటను నిల్చి సంహితల నేర్పడఁ జెప్పఁగఁజాల రెవ్వరున్.— ఆ. ౧



## చిత్రకవి—సింగరార్యుఁడు.



ఈకవి బిల్హణీయమను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచియించి శ్రీరామాంకితము చేసెను. ఈకవి యారువేలనియోగిబ్రాహ్మణుఁడు. ఈతని యనంతరమున నీతని పుత్రుఁడగు నారసింహకవి తనతండ్రి రచియించినగ్రంథమును దెచ్చి పండిపెద్ది కృష్ణస్వామి కిచ్చి యాతనివలన ధనస్వీకారము చేసినట్లును, వారిద్దఱును గలిసి కృత్యాదియందలి కొన్నిపద్యములను గద్యములనుమార్చి గ్రంథమును కృష్ణస్వామి రచియించినట్లు దిద్దినట్లును చెప్పుచున్నారు. ఆకొన్నిపద్యములను మార్చుటలోఁ గూడఁ గృష్ణ

స్వామికి నారసింహాకవిసాహాయ్య మున్నదఁ తెలుపుటకుఁ గాఁబోలును ఓల్లాణీయమున నీక్రిందిపద్యము వేయఁబడియున్నది—

క. ము న్నింద్రదత్తనాథపురమున వెన్నుఁడు సహాయు డైనకథమున సేనా
సన్నుతసద్గుణగణసత్పన్నుం డగుకవివరాధిప సహాయమునన్.

గ్రంథమునందుఁ బండి పెద్దికృష్ణస్వామియే గ్రంథరచన చేసినట్లుచెప్పఁబడియున్నను నిజముగాఁ గృతికర్త సింగరయ్యయే యగుటకు నిదర్శనము ప్రథమాశ్వాసాంతమునం దుండిన యీక్రింది చక్రబంధమునందుఁ గానఁబడుచున్నది—

శా. ధన్యా సింహాభచంద్రకీర్తి వరవిద్యాపండితాగ్ర్యక్రమా
గణ్యా గర్వధనంజయా శివదమక్ష్మాకృత్స్విగక్రప్రభూ
జన్యారాజితభూశశాత్రవసుభృజ్జావిద్రమావిక్రమా
మాన్యారాధన త్యాగభోగజయధామా నవ్యభాగోత్తమా.

ఈకావ్యము నూటయేఁబది సంవత్సరములకుఁ బూర్వము రచియింపఁబడినట్లు తెలియవచ్చుచున్నది. ఇందలికథ మనోహరముగాను కవనము రసవంతముగాను గొంతవఱకున్నను దారాశశాంకమువలెనే యిదియును నీతిబాహ్యమైనదగుటచేఁ జదువఁదగినది కాదు. మదనాభిరాముఁడనురాజు రూపలావణ్యవతియగు యామినీపూర్ణతిలకకు సంగీతసాహిత్యములు చెప్పింపఁదలఁచి, సమస్తవిద్యలయందును సమర్థుఁడయిన బిల్హణుఁడను సంస్కృతకవీంద్రుని రావించి, అతఁడును రూపయౌవనసంపన్నుఁ డయినందునఁ దన కూఁతు నాతనికడ నొంటిగానుంచి చదివించుట కిష్టము లేనివాఁ డయి మంత్రితో నాలోచింపఁగా నతఁడు

వ. ఒకచిత్రప్రతి మున్న దవ్వరకు రాజోత్తమ సిద్ధంబుగా
నకలంకాకృతి యోషనీతనయ జాత్యంధు న్విలోకింప దా
సుకవీంద్రుండును గుష్ఠగాత్రి నెపుడుం జూడ న్మనం గోరఁ డిం
దుకు నేమో వచియించు టే నెఱిఁగి యుండు న్నత్తత్కార్యమున్.

మ. కవిరాజాగ్రణి పుట్టుగుడ్డగుచు నీకంజాక్షికిం జెప్పి యా
క.కిన్ మీకుఁ గుష్ఠగాత్రియని వేషంబుం దెల్పి యవ్వాకిన్
భువి నన్యోన్యవిలోకనక్రియలు నేర్పుల్మీఱఁ గాకుండున
ట్లు విచారించెద నొక్కయుక్తి వినుఁ డట్లున్ రాజదేవర్షభా.

అని రాజపుత్రి తాను జాత్యంధునిముఖముఁ జూడనని నియమముపట్టియున్నందున నామెతో నావిద్వాంసుఁడు పుట్టుగుడ్డివాఁడని చెప్పియు బిల్హణుఁడు కుష్ఠగాత్రిని జూడనని నియమముచేసికొనియున్నందున నాతనితో రాజపుత్రి కుష్ఠగాత్రియని చెప్పి

యు నిరువురకు నన్యోన్యముఖావలోకనము లేకుండ నడుమ తెర వేసి చదివింప వల నని యుపాయము చెప్పెను రాజా యుపాయమునకు సంతోషించి తనకొమారితతోను విద్వాంసునితోను నట్లుఁబలికి వారి నొడఁబఱిచి యిరువురిమధ్యను తెర వేయించి కూఁతు నాతనివద్దఁ జదివింప నారంభించెను. కుశాగ్రమతియైన యామినీపూర్ణతిలక యాతని వలన సంగీతసాహిత్యాదివిద్యల నభ్యసించి యల్పకాలములోనే కవిత్వము చెప్ప నేర్చు కొనెను. ఇట్లు కొంతకాలము జరుగఁగా నొకనాఁటిరాత్రి క్రొత్తగా నుదయించిన పూర్ణచంద్రునిఁ జూచి కవి

చ. జలనిధిపంక మంచు మఱి చాయయెఁ జహ్నము లేడిపిల్ల కం
దళితసురేంద్రనీలమణిధామ మటంచు వచింతు రంద ఱీ
కలువలరేనియందుఁ గలకందును నే ననుకొందు రాత్రియం
దలవడ మ్రింగినట్టితమ మంతరసంస్థ మటంచు నెంతయున్.

ఇత్యాదివాక్యములతోఁ జంద్రవర్ణనము చేయఁజొచ్చెను. ఆవర్ణన నాలకించి యామినీ పూర్ణతిలక

శా. అంధుం డెక్కడ చంద్రుఁ డెక్కడ తదీయంబైన యావర్ణనా
బంధం బెక్కడ యిట్టివింత గలదే భావింప నెచ్చోటనై
నం ధాత్రీంద్రుఁడు మాకు నిర్వురకు నందంబొప్ప నన్యోన్యదృ
క్సంధానం బగు నంచుఁ జేసె నిటులం జర్చింప వేమున్నదే.

పుట్టుగ్రుడ్డివాఁ డెక్కడ? చంద్రవర్ణనము చేయు టెక్కడ? రాజు మాకిరువురకు నన్యోన్య సంధానము కలుగకుండ నీమిష కల్పించెఁగాఁబోలు ననితలఁచి, వ్రతభంగమయినను గానిమ్మని సాహసము చేసి తెర దీసి చూచెను.

ఉ. ఆకడ బిల్హణాఖ్యకవి యత్తఱిఁ దామరసారిఁ గూర్చి యెం
తో కళ యుప్పతిల్ల వినుతు ల్పచరింపుచునుండి యంతలోఁ
బ్రాకటబద్ధకాండపటిపై రమణీమణిమోముఁ జూచి య
స్తోకమహోదయాద్రిపయిఁ దోఁచిన చంద్రునిఁ బోల్చి యిట్లనన్.

ఆయౌవనపురుషుఁడు పంతువెన్నెలఁ గాయుచుండఁగా సంపూర్ణపూర్ణిమాచంద్ర బింబమును మీఱిన నిండుజవ్వనియొక్క ముఖచంద్రబింబము నొంటిగాఁ జూచిన తరువాత జరిగినపని చెప్పనక్కఱయే లేదు. ఇట్లు కొంతకాలము రాజపుత్రియుఁ గవీశ్వరుఁడును యథేష్టవిహారముల నానందించుచుండఁగాఁ దెలిసి కావలివారు రాజు నకు విన్నవింపఁగా నతఁడు కూఁతుం జేరఁబిలిచి

ఉ. కోరినరాకుమారకునకుం బ్రియ మారఁగ నిన్ను నిచ్చి యిం
తో రతిమీఱి సౌఖ్యమున నుండెదనంచుఁ దలంచియున్న నా
కోరిక లెల్లఁ బోఁగలఁచి కొంకుఁగళంకము లేనిముత్కలం
బారఁగ దుర్యశంబు మహి నందఁగఁజేసితివమ్మ బాలికా.

అని కోపముతో బిల్హణుని శిరశ్ఛేదము చేయ నియమించెను. రాజభటు లాతనిని వధ్యస్థలమునకుఁ గొనిపోవుచున్నారని విని రాజపుత్రి యిట్లు విలపింపఁజొచ్చెను—

మ. అరవిందంబులరీతిఁ జెన్నలరు నీహస్తంబు లెట్లోర్చె ము
ప్పిరిగాఁ బెట్టిన కాలపాశమునకున్ ముగ్ధాంగనాగానధ
వ్యరసోత్కృష్టము లైననీశ్రుతియుగం బత్యుద్ధతోర్వీపకిం
కరనాదార్భటి కెట్లు తాళె మదనాకారా మనోనాయకా!

కవియును దన ప్రాణాపాయమును బాటింపక శోకపాడుగునను దనప్రియురాలిని దలఁచుకొని యామెపయి నీరీతిని బద్యములు చెప్ప నారంభించెను—

ఉ. హా కమలాయతాక్షి చెలి హా సరసీరుహకుట్మలస్తనీ
హా కమనీయగాత్రి సతి హా నవమోహిని హా వధూమణీ
హా కనకాంగి నేను విడనాడితి నంచుఁ దలంచె దీవు నీ
లోకమునందు జీవునకు లోలత గాక స్వతంత్ర మున్నదే?

కవి తలవరులు తనశిరమును ఖండింపఁబోవునప్పు డొకపద్యమును వ్రాసి రాజున కంపఁగా నతఁ డది చదువుకొని కవిని క్షమించి, బిల్హణునికిని దనపుత్రికకును గల యన్యోన్యానురాగమును విచారించి, తనకూఁతు నాతని కిచ్చి వివాహము చేసెను.

మ. పొలుపొందన్ ద్విజరాజశేఖరునకున్ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతిఁ గన్య నిచ్చుపగిదిన్ శ్రీనాకముఖ్యంబుగాఁ
బొలుపొందన్ ద్విజరాజశేఖరునకున్ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతిఁ గన్య నిచ్చె సుమనస్సంతానము న్మెచ్చఁగన్.



## రేవణూరి_వేంకటార్యుఁడు.



ఇతఁడు శకుంతలాపరిణయమను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడు నందవరీక వైదికబ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; తిరుమల కొండయార్యపుత్రుఁడు. ఈతఁడు తన శకుంతలాపరిణయము నొకానొక రాజున కంకితము చేయ నుద్దేశించియుండఁగా నొకకరణము విఘ్నమాచరించినట్టును, అందు చేతఁ

దనకృతిని వేంకటేశ్వరుని కంకిత మొనర్చినట్లును, కవి యీ క్రిందివాక్యములలో వ్రాసి కొని యున్నాఁడు—

వ. "అపూర్వపూర్వకవినుపర్వపానగ్రహంబునం బుణ్యగుణకథాశ్రవణకుతూహలిక బుధసహానుబంధం బగు నొక్కప్రబంధంబు సగసహమనోనుబంధంబుగా నిర్మింపం బూనియున్న సమయంబున నతిప్రభావసంపన్నుం డగు కశ్చిత్ప్రభుండు.

శా. శ్రీవత్సాన్వయు రేవణూరికులజున్ శ్రీపాదరేణుప్రభా
సౌవర్ణ్యస్ఫుటకావ్యకల్పకకళన్ సంకీర్తనాచార్యపు
త్రీవంశోత్తము నందవైదికబుధాదిప్రోక్తవృత్తిస్వయం
భావున్ దిర్మల కొండయార్యసుతు శుంభద్వేంకటాభిఖ్యునిన్.

క. పిలువంబంచి యెదురొక్కని । మిలమిల నలఘుప్రభాసమిద్ధాస్థాన
స్థలిఁ జాఁగిలి మ్రొక్కి పటీ। కలితసుఖాసీనుఁ జేసి కలకల నగుచున్.

చ. కనఁగొని చండికాభిసుఖప్రదనందవరాగ్రహారపా
వన ఘన పెద్దిభట్టకులవార్ధినిశాకర నీవు శ్రీనివా
సుని యలమేలుమంగకృపఁ జొక్కిన దిక్కరి వాంధ్రభూమిరా
డ్వినుతసభాస్థలీవసనవీనపికంబవు కాకలీకృతిన్.

శా. సల్లాలిత్యభవత్కవిత్వపటిమాసందర్భవైదర్భకా
పల్లాపంబులు మామకీనసుకులస్వామీంద్ర కీలాద్రి రా
ణ్మల్లేశుండును మెచ్చ నొక్కకృతి నిర్మాణంబు గావింపుమా
మల్లీఫుల్లసుమోల్లసన్మధుఝరీమాధుర్యకౌదార్యతన్.

మ. అని హేమాంబరరత్నభూషణసుగంధాలంకృతుం జేసి స
ద్ఘనసారస్ఫుటవీటికాదు లొసఁగన్ గైకొంచు వాక్ఛ్రీవధూ
వనజాతాంఘ్రిఘుఘుల్ఘులన్నటజ్జిహ్వాస్థానవాగ్గోస్తనీ
జనితానందమరందకందళనదీజంఘాలవేలాస్యుఁడై.

వ. అమ్మహాకవివరుండును దదీయవంశావతారనిర్ణయవర్ణనానుపూర్వంబుగాఁ దత్ప్రబంధబంధురానల్పకల్పనం బొనరించి తత్సముచితకృతికన్యాకరణంబునకు నవకరణంబుగా నుపకరణంబగు నొక్కకరణంబు కృతఘ్నుండై విఘ్నంబు చేసిన.........శ్రీ వేంకటరమణునకు.........దండప్రణామ పుష్పాంజలి ప్రపూర్ణభర సమర్పణంబుగా సమర్పించెద.

ఇంత చెప్పినవాఁడు కశ్చిత్ప్రభుండనక యాప్రభుఁ డెవ్వఁడో పేరొక్కనియుండిన

పక్షమునఁ గవికాలనిర్ణయమున కనుకూలపడియుండునేమో! అయినను కవి తన శకుంతలాపరిణయమునందుఁ జేసిన యీ కవివర్ణనమునుబట్టి యితఁ డాధునికుఁడగుట స్పష్టమగుచున్నది—

మ. పరఁగన్ భారతకల్పనారతులు శబ్దస్ఫూర్తి సంధింప ని
ర్భరవృత్తిన్ బరమేశసోమఘను లాలంకారము ల్గూర్పఁ జూ
పరు లైనట్టిపితామహాద్యులు నుతు ల్వాటింప నర్తించు నీ
సరసాంధ్రోక్తివధూటి కేను సుకుమారస్ఫూర్తి గావించెదన్.

ఈకవి నూఱు నూటయేఁబదిసంవత్సరముల క్రిందట నుండియుండవచ్చును. ఇతఁడు శబ్దాలంకారములనిమిత్త మమితముగాఁ బాటుపడి గ్రంథమునందు వ్యాకరణదుష్టము లైన ప్రయోగముల ననేకములను జేసియున్నాఁడు. వసుచరిత్రములోని కల్పనలను బోలిన కల్పనల ననేకములఁ జేసినను మొత్తముమీఁద నీతనికవిత్వము శబ్దాలంకారభూయిష్ఠమయి హృద్యముగానున్నది. ఇతఁడు తాను రామచంద్రోపాఖ్యానమను మఱియొకగ్రంథమును జేసినట్లు చెప్పికొనెనుగాని యాగ్రంథము దొరకలేదు. ఈతని కవితారీతిని జూపుటకయి శకుంతలాపరిణయములోని కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. సింగము లెన్ని పీరలకు సిద్ధముగా మొలబంటి మత్తమా
తంగశిరస్తటంబులు పదంపడి బ్రొమ్ములబంటి యంచు సా
రంగచయంబు లెల్లను శరాసనిగా నెదిరింపలేక మా
వ గడపున్వధూమణులవాలికచూపులకున్ భయంపడున్.—ఆ. ౧.

ఉ. శ్రేణులుగట్టి మౌనిజనశీర్షజటాచ్ఛట లుద్గమింప న
క్షీణవిరాగయోగములు చెదును పల్లవరాజకోటికిన్
స్థాణులకున్ బరాగగుణసారతరాంకురలబ్ధి గల్గు పూ
బోణులమేని వాసనలు పొల్చినమాత్రఁ దదాశ్రమంబునన్.—ఆ. ౨.

ఉ. వారనిప్రేమ నేఁగి రటు వారనిన్ విని మాఱుఁదద్దఱన్
వారువ మైనయుక్కుటికి వారు వనంబునకున్ ఫలంబు ల
క్ష్వారిగఁ దేరఁగాఁ జనిరి వారిఁ గనుంగొను గారవంబునన్
మీ రరుదేరఁగాఁ దెలిసి మీఱరు దాఁటవత్తు రింతకున్.—ఆ. ౩.



## పోచిరాజు-వీరన్న.

ఈకవి తాను కృష్ణార్జునసంవాదము, పంచకావ్యములు, విభూతి మాహాత్మ్యము, మార్కండేయచరితము, మనువంశపురాణము, ముక్తదేవుకథ, ఆనందలహరి, సౌందర్యలహరి, సుభాషితము, అను గ్రంథములను రచియించినట్లు భల్లాణచరిత్రమున నీక్రిందిపద్యములలోఁ జెప్పుకొన్నాఁడు—

సీ. పదునాలు గగునేట మొదటఁ గృష్ణార్జునసంవాదము ప్రబంధసరణియయ్యెఁ
బదునెన్మిదగునేటఁ బంచకావ్యము లాంధ్రపద్యకావ్యములుగాఁ బాధకలై
నిరువదిరెండగునేట విభూతిమాహాత్మ్యంబు ద్విపదకావ్యముగ నొప్పె
నిరువదియాఱగునేట మార్కండేయచరితంబు రచితమై సంఘటిల్లె
ముప్పదగునేట మనువంశముఖ్యనృపపు।రాణము ప్రకల్పితంబయి ప్రకటనయ్యె
ముప్పదాఱగునేట శ్రీముక్తదేవు। కథ కథితమయ్యె నాచేతఁ గౌశలమున.

గీ. సంస్కృతంబై శంకరాచార్యవిరచి।తంబు లానందలహరి సౌందర్యలహరి
భర్తృహరికృతమైన సుభాషితమును। శతకములుగాఁగ మత్పరికల్పితములయ్యె.

ఇందుఁ జేర్కొనఁబడినవానిలో నీపుస్తకముగాక మాకు మనువంశపురాణ మొక్కటి మాత్రము లభించినది. భల్లాణచరిత్రమును గవి బందరుపురములో నుండిన చిత్రకార (ముచ్చి) కులస్థుఁడయిన దాము మొగ్గన్న కంకితముచేసెను. బందరుపురమును చిత్రకారకులమును వర్ణించినపద్యముల రెంటి నిందుఁ బొందుపఱిచెదను.

సీ. శ్రీకంఠవైకుంఠసేవావికుంఠ వందారుమందిరము బందారుపురము
నిరతోత్సవైశ్వర్యనికరాభిభూత బృందారకపురము బందారుపురము
సంతతాయాత యాచకజనవ్రాత మందారభాసురము బందారుపురము
సకలవర్ణాశ్రమాచార సంపత్సమందారతిభరము బందారుపురము
శిల్పివర్తక వర్తక చిత్రకార। సూత్రకారాదివివిధవిచిత్రకృత్య
దానధర్మపరప్రజోత్కరచకోర। కారవిందారికరము బృందారపురము.

ఉ. ఆపురి నుండ్రు దాముకులజాఢ్యులు మౌక్తికసంప్రదాయు లు
ద్దీపితకీర్తిలోలు రతిథిప్రియశీలురు శూలిపాదపూ
జాపరతంత్రమంత్రగుణశాలు లఘాటకీలు లర్థధ
ర్మోపకృతిస్వభావమతియుక్తులు చిత్రవిధానశక్తులున్.

మనువంశపురాణము బెజవాడ మల్లేశ్వరస్వామి కంకితము చేయఁబడినది. దీనికి ఖండకపాలాఖ్యానమని నామాంతరము. కవి నియోగిబ్రాహ్మణుఁడు; తండ్రి వీర

భద్రుఁడు; తల్లి మూర్తిమాంబ; నివాసస్థలము కృష్ణామండలములోని కొలకలూరు. ఇతఁడు కౌండిన్యగోత్రుఁడు. ఇతఁడు నూఱుసంవత్సరములక్రిందటివాఁడయి యుండ వచ్చును. ఈతనికవనధోరణి యీక్రిందిపద్యములవలనఁ దెలిసికోవచ్చును—

భల్లాణచరిత్రము.

చ. కలువలసొంపు డాఁగె భుజగంబులు పుట్టల దూఱెఁ దారకా
వళి రుచి జాఱెఁ జక్రవలవంతలు దీఱెఁ జకోరకవ్రజం
బులసుఖ మాఱె దమ్ములకు మోదము లూరె నిశాకరద్యుతుల్
వెలవెలఁబాఱెఁ దూర్పుదెస వెల్లడిగాఁ దెలవాఱె నయ్యెడన్.—ఆ. ౧.

ఉ. ఇంటికిఁ దోడితెచ్చి యుపనీశ్వరుఁ డవ్వటరూపుఁ డైనను
కృ...టిని ధీరసంగతులిగా నొనరించి సపర్యసల్పి నే
జంటకు మాఱుగాఁ దలఁచి జాజులు నించినసెజ్జఁ జేర్చి వా
ల్గంటిని జూచి పల్కెఁ గుతుకంబు మనంబునఁ దొంగలింపఁగన్.—ఆ. 3

మనువంశపురాణము

మ. ఖల! దుష్టాత్మ! మనుప్రభూత! బుధధిక్కారంబుఁ గావించి తీ
విల నీయన్వయ మింతయుండి వసుధాధీశత్వ మొక్కమై
తిలఘ్రాతెవ్యవహారలక్షణముతో దీర్ఘత్వముం బూని ని
మ్మళమై యుండె నుఁ గాత సర్వజనము ల్గర్హింప హైన్యంబునన్.—ఆ. ౨.

శా. భూనాథోత్తమ! మేనిసుగంధనంబు ల్గోరఁగాఁగూడ దీ
ధేనూత్తంసము యజ్ఞకార్యమున కాధిద్రవ్యమౌఁ గావునన్
దీనిం బట్టఁగరాదు మీ రఖిలధాత్రీపాలకుల్ ధర్మని
ష్ఠానైపుణ్యులు మీ కెఱుంగనికథాసంఘుం బిలం గల్గునే—ఆ. ౪.

## అయ్యలరాజు నారాయణకవి.

ఈకవి హంసవింశతికథల నయిదాశ్వాసముల పద్యకావ్యమునుగా రచియించెను. హంసవింశతియందు కట్టుమతము రచియించినకవు లీపద్యమునఁ జేర్కొనఁబడియున్నారు—

ఉ. అయ్యలరాజుఁ దిప్పసచివాగ్రణిఁ బర్వతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిఁ బ్రధానవరుం డగుకొండధీరునిన్

జయ్యనఁ దిమ్మయప్రభుని సత్కవితారచనాధుర్యు లైనమా
యయ్యలరాజువంశజుల నాతెకవీంద్రుల సన్నుతించెదన్.

౧౭౫౦ వ సంవత్సరమునందుండిన కవులను జేర్కొనియుండుటచేత నితఁ డాకాలమునకుఁ దరువాత నుండినవాఁ డనుట స్పష్టము. ఇతఁ డిప్పటికి నూఱుసంవత్సరముల క్రిందట ౧౭౦౦ వ సంవత్సరప్రాంతములయం దుండియుండును. పైపద్యమునఁ జేర్కొనఁబడిన యయ్యలరాజవంశజు లయినకవులలోఁ బ్రాతరాజును గొండయ్యయుఁ దిమ్మయ్యయుఁ జేసినగ్రంథము లేవో తెలియరావు. ఈకవితండ్రి సూరనార్యుఁడు; తల్లి కొండమాంబ; గోత్రము కౌండిన్యసగోత్రము. ఈతనికవిత్వములో లక్షణవిరుద్ధము లయినప్రయోగము లనేకములు గలవుగాని మొత్తముమీఁదఁ గవిత్వము ప్రౌఢము రసవంతము నయినదిగా నున్నది. ఈపుస్తకమునం దన్యదేశ్యము లనేకములు వాడఁబడియున్నవి. ఈతఁ డాయాజాతులవారి వర్ణింపవలసివచ్చినప్పుడు మిక్కిలి కష్టపడి వారివారికుచితము లయిన యుపకరణాదులనామముల నన్నిటిని సంగ్రహించి వివరించియున్నాఁడు. ఈకథయొక్క ముఖ్యోద్దేశము

ఉ. మున్న లరావణాదులు సముద్ధతి సాధ్యులఁ గోరి యేమిసా
ఖ్యోన్నతిఁ జెంది రట్లగుట మర్త్యజనావళు లన్యకాంతలన్
బన్నుగఁ గోరరాదు కడుఁబాతక మంచుఁ దలంచి యింతిపై
నున్నమనంబు ద్రిక్కని యథోచితపద్ధతి నుండె భూవరా.

అన్నట్లీకపురుషుని నన్యకాంతనుండి విముఖునిఁ జేయుటయే యయినను, పుస్తకమునిండ నంకుపోయి బొంకాకి తప్పించుకొన్న యుపాయములే వర్ణింపఁబడి యుండుటచేత నిది దుర్నీతిబోధకమయి నీతిపరులకుఁ బఠనయోగ్యము కానిదయి యున్నది. ఈపుస్తకమునుండి కొన్నిపద్యము లిందుదాహరింపఁబడుచున్నవి—

శా. పన్నీట న్నయనంబు లొత్తెఁ దనువుం బాటీరపంకంబుతోఁ
జెన్నారం బన నిచ్చె గీతి పిగ వేసెం దాయెతు లుస్సెట్టె జీన్
సొన్నాపట్టెరుమాలు గట్టె జలతార్పట్టంచుడాల్మించ వేల్
మిన్నా సన్నపుదుప్పటంబు దగ హాళిం గప్పె సొంపారఁగన్.—ఆ. ౧.

చం. కమటము కట్లసంచి యొరగల్లును గత్తెర సుత్తె చీరముల్
ధమనియు త్రాపణంబు మొలత్రాసును బట్టెడ నీరుకారు శా
ణము పటకారు మూస బలునాణెపరీక్షలమచ్చు నాదిగా
నమరఁగ భద్రకారకసమాహ్వయుఁ డొక్కరుఁ డుండునప్పురిన్.—ఆ. ౨.

శా. పున్నాగంబున గెల్పుఁజాలు రుచిరాంభోజాస్య వేణీరుచుల్
పున్నాగంబున నవ్వనో వెఱుఁగన్ లోలాక్షియానంబులం
బున్నాగంబును గేరిమీఱి మెఱయుం బూఁబోఁడినూగారుడాల్
పున్నాగంబును మించు నాభిచెలువంబుల్ సారెవర్ణింపఁగన్.—ఆ. ౩.

మ. చతురోపాయసమగ్రుఁ డప్రతిమశౌచాతుర్యధుర్యుండు వి
శ్రుతకార్యజ్ఞుఁడు రాజనీతిపదదక్షుం డింగితజ్ఞుండు స
ద్భృతశక్తిత్రయపారగుండు గుణసంపూర్ణప్రభావుండు సం
తతభూపాదరణీయుఁ డొక్కరుఁ డమాత్యశ్రేష్ఠుఁ డుండుం బుధా.—ఆ. ౪.

## వెణుతుర్ల వడ్డికవి.

ఇతఁడు శృంగారరసాలవాల మను పేరుగల మూడాశ్వాసముల యలంకారశాస్త్రమును రచియించెను. ఇతఁడు ప్రథమశాఖ బ్రాహ్మణుఁ డయినట్లును రామభక్తుఁ డయినట్లును శృంగారరసాలవాలములోని యీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

ఉ. శ్రీరఘువీరభక్తిరససింధువిహారుఁడ శుక్లయజుస్సా
చారుఁడ దేశికాంఘ్రిపరిచారుఁడ నే వెణుతుర్లవంశవి
స్తారుఁడ వడ్డినామ కవిసత్తముఁడన్ రఘువర్యుపేర శృం
గారరసాలవాల మను కావ్య మొనర్తు జగద్ధితంబుగన్.

ఈకవి కౌండిన్యసగోత్రుఁడు; వేంకనార్యపౌత్రుఁడు; మంగళగిరిపుత్రుఁడు. ఇతని కాలమేమో తెలియరాలేదు గాని కవిత్వము రసవంత మయినదిగాఁ గనుపట్టుచున్నది. శృంగారరసాలవాలములోని పద్యములరెంటి నిందుఁ జూపుచున్నాను—

ఉ. కుందనముల్ హసింపఁగలకోమలికోమలదేహవల్లిపైఁ
గందళితంబులయ్యె సితకాంతులు సంతత మమ్ముఖుఁదు నిం
పొంద మనంబులోన నిడియున్న మనోభవుఁడందు నాతనిన్
గ్రందుగ జేయుపుష్పశరగాఢరుచుల్ వ్యయిఁబోఁచెనో యనన్.—ఆ. ౧.

ఉ. ఆసలు బాసలిచ్చి కపటాత్మసఖుల్ పొదరిల్లు చేరఁగాఁ
దీసిన నందు నిందుముఖి తెల్లమిగా హరి లేమిఁజూచి వి
శ్వాసములోఁగుత న్మరలివచ్చెనెడన్ మరలింప దచ్చటన్
భాసిలు చంచరీకములబారు గనుంగొను దృష్టి పెంపునన్.—ఆ. ౩.

## కొత్తలంక-మృత్యుంజయుఁడు.

ఈకవి బృహన్నారదీయము, ధరాత్మజాపరిణయము, నిరోష్ఠ్యనలచరిత్ర, అను పద్యకావ్యములను రచియించెను. ఇతఁడు శివబ్రాహ్మణుఁడు. శివాలయములలో నర్చకులుగానుండెడి యీతెగబ్రాహ్మణుల నీప్రాంతములయందు శివలవాండ్రని వాడుదురు. ఈతని నివాసస్థలము గోదావరీమండలములోఁ గౌశికీతీరమందున్న కొమరగిరి గ్రామము. ఈకవి బోధాయనసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; విశ్వనాథపుత్రుఁడు. ఈతఁ డించుమించుగా నూఱుసంవత్సరముల క్రిందట నుండినవాఁడు. ఈతని మునిమనుమ లిప్పటికిని గోడి యను గ్రామములో జీవించియున్నట్టు వినుచున్నాము. ఈతని కవిత్వము హృద్యమయి సలక్షణముగా నుండును. ఇతఁడు రచియించిన పుస్తకములలో బృహన్నారదీయపురాణ మాఱాశ్వాసముల గ్రంథము; ధరాత్మజాపరిణయము నాలుగాశ్వాసముల ద్వ్యర్థికావ్యము; నిరోష్ఠ్య నలచరిత్ర మైదాశ్వాసముల చిత్రకావ్యము. ఈకావ్యములలో ధరాత్మజాపరిణయమును కవి తన కాశ్రయుఁడైన యల్లూరి యప్పలరాజను క్షత్రియునకు రచియించిన ట్లవతారికలోఁ

ఉ. ఎల్లజగంబులం గరుణ నేలెడువేలుపు నిందిరామనో
వల్లభు నాశ్రయించి యనవద్యతదీయకృపావిభూతి భూ
వల్లభసత్సభావిబుధవర్ణ్యకవిత్వనిరూఢిఁ గన్న శ్రీ
యల్లురి వంశసంభవుఁడ నప్పనృపాలక నామధేయుఁడన్.

ఇత్యాదిపద్యములచేఁ జెప్పినను, ఆశ్వాసాంత గద్యమునఁ దనపేరే వేసికొనియున్నాఁడు. ఈప్రాంతములయందలి క్షత్రియులు సామాన్యముగాఁ దాము మాధవవర్మసంతతివార మని చెప్పుకొనునట్లే యీయల్లూరివారును మాధవవర్మసంతతివారే యయినట్లు ధరాత్మజాపరిణయమునందు వంశకర్తగా మాధవవర్మ యిట్లు వర్ణింపఁబడెను—

ఉ. మాధవవర్మ నాఁగ నొకమానవభర్త జనించి విస్ఫుర
ద్బోధసమగ్రుఁడై కనకదుర్గను శ్రీజయవాటికాపురీ
సౌధవిహారిణిం గొలిచి చక్కఁగఁ దత్కరుణారసంబుచే
నీధర హేమవృష్టిఁ గురియించె నతిస్థిరకీర్తి మీఱఁగన్.

కవినిగూర్చి వ్రాయఁదగిన విశేషము లంతగాఁ దెలియనందునఁ, పూర్వోక్తగ్రంథముల నుండి కొన్నిపద్యముల నుదాహరించి విరమించుచున్నాము—

బృహన్నారదీయము.

చ. హృదయమున న్వివేక మొకయించుక లేనిదురాత్మునింటిసం
పదలు శరన్నదీజలముభంగి నశించు ననూయ యాత్మలోఁ
బొదలినవానిసంపదలు పోఁడిమి దక్కను మారుతంబుతోఁ
గదియుతుషానలంబుక్రియఁ గంజభవాత్మజ యాలకింపవే — ఆ. ౧.
ఉ. ధ్యానవిహీనుఁ డయ్యు ననయంబు జితేంద్రియవర్గుఁ డయ్యెనా
యానరుఁ డెన్నఁడుం జెడనియట్టిపదంబున నుండు నిశ్చల
ధ్యానసమేతుఁ డింద్రియజయం బొకయించుక లేకయున్నఁ ద
ద్ధ్యానము నిష్ఫలం బగు నతండును మూఢుఁ డనం బ్రవర్తిలున్. — ఆ. ౪.

ధరాత్మజాపరిణయము.

ఉ. అనఘ వసిష్ఠమౌనిముఖు లవ్విబుధాఘముఁ గూడి యమ్మహా
వనిపభుఁ బూర్ణభూతిభవు వర్ణితతేజునిఁ జూచు వేడుకం
జని విలసిల్లుతద్విపులసంజనితప్రమదాన్వితాధికా
ననసుషమం గనుంగొని మనంబున నుబ్బుచుఁ బల్కి రీగతిన్. — ఆ. ౧
ఉ ఆగ్రహబుద్ధిచేత విషయంబు లశేషము గాజయించి లో
కాగ్రియబాహుశౌర్యగతి యాగవిహింసకుఁడై తఱుచ్చ న
య్యుగ్రునిమీఁద శాతశర మొక్కటి వేయఁగ సమ్మతింప మా
నిగ్రహభూతవైరిగణ నీదగు పట్టి కార్యసిద్ధికిన్. — ఆ. 3
ఉ. అచ్చట నచ్చట న్వెలయు నచ్చపుఁబచ్చలతోరణంబులన్
రచ్చల హెచ్చులై వనెలరాలయురంగులరంగుల న్సదా
లచ్చికి నాటపట్టయినలచ్చనము ల్పరికించి చూచుచో
నొచ్చెము లేనియచ్చెరువు నొందఁగఁజేసెఁ బురంబు వాంకిన్. — ఆ. ౪.

నిరోష్ఠ్య నలచరిత్ర.

ఉ. అల్లలితాంగి చంచలకటాక్షనిశాతశరాళి నేయఁగాఁ
గల్లరి యైనచిత్తజునిగాసిఁ దలంకితిఁ గ్రాసగీతి సం
ధిల్లఁగ నీరసంతతికి దీనత గాంచితి రాకరాకశే
జల్లని తల్లడిల్లితిని జల్లనిగాలికి సంచలించితిన్. — ఆ. ౧.
ఉ. చంచలరీతిగా నధికచంచలతం గనినట్టియిందిరా
చంచలనేత్ర నెల్లెడ నచంచలఁగా నెడఁదం దలంచి యా

చించినయర్థిరాజి నిరసించినదుర్గతకీర్తి కాంత చి
తించిన నక్కటా తగినవిష్కృతి కల్గఁగనేరదే కదా. — ఆ. 3.

చ. అలిగినయత్తలిం గలఁక నందక సారవయానిరీక్షచే
నలరఁగఁ జేసిన తటి నహంకృతిఁ జెందక ధాత్రికీతి ని
శ్చలత నిజేశసన్నిధిని సంతతహర్షనికాంతచిత్తయై
చెలఁగెడికన్య ధన్యగతి చే నలరారెడి సారసాననా. — ఆ. ౪.

అంతర్వేది నృసింహస్వామి కంకితము చేయఁబడిన యీనిరోష్ఠ్యనలచరిత్రము కొన్ని వ్రాఁతప్రతులలో

"ఇది శ్రీమద్భవానీశ్వర శాశ్వత కృపాపాత్ర కొత్తలంక విశ్వనాథపండిత పుత్ర సకలసుకవి జనానుగ్రహసహాయ మృత్యుంజయనామధేయప్రణీతంబైన నలరాజచరిత్రము"

అను గద్యమునకు మాఱుగా

"ఇది శ్రీమదంతర్వేది లక్ష్మీనృసింహస్వామి చరణారవిందార్చక రుద్రరాజాన్వయాభరణ ధనంజయగోత్రపవిత్ర కూనన్నపాలపుత్ర నిరర్గళ కవితావిలాస సంతోషితాశేష విద్వత్కవిరాజ తిరుమలరాజ ప్రణీతంబైన నలరాజచరిత్రము"

అను గద్యము కానఁబడుచున్నది. మృత్యుంజయకవి యీగ్రంథముయొక్క కర్తృత్వమును ధనస్వీకారకారణముచేత రుద్రరాజు తిరుమలరాజునం దారోపించి యుండును.



## తిరుమల బుక్కపట్టణపు-వేంకటాచార్యుఁడు.



ధరాత్మజాపరిణయ మను పేర మృత్యుంజయకవి రచించిన ప్రబంధమువంటి దానినే యీకవి "అచలాత్మజాపరిణయము" అను నామము గల మూఁడాశ్వాసముల ద్వ్యర్థిప్రబంధము నొకదానిని రచియించియున్నాఁడు. ధరాత్మజాపరిణయమునకంటె నచలాత్మజాపరిణయము ప్రౌఢతరముగా నున్నది. ఈగ్రంథకర్త మిక్కిలి సమర్థుఁడు. ఇతఁ డాశ్వాసాంత గద్యమునందుఁ దన్నుఁగూర్చి యిట్లు వ్రాసికొనియున్నాఁడు—

"ఇది సర్వతంత్ర స్వతంత్రసకల భాషావిశేష కవితాధురంధర ప్రతినవప్రబంధ పరమేశ్వర శ్లేషయమక చక్రవర్తిబిరుదాంక తిరుమల బుక్కపట్టణ శ్రీనివాస తాతాచార్యతనయ శ్రీమదణ్ణయాచార్య దీక్షితసుత పిత్రవ్య శ్రీనివాసాచార్య కృపాకటాక్షలబ్ధ సకలపాండిత్య తర్కాలంకార వాగీశ్వర బిరుదాంక వేంకటాచార్య ప్రణీతంబైన యచలాత్మజాపరిణయము."

-వైష్ణవకవిగ్రామణి యేకాలపువాఁడో తెలియరాలేదుగాని యిక్కవి యాంధ్రనిఘంటు కాఁడని తోఁచుచున్నది. అచలాత్మజా పరిణయములోని రెండుపద్యములు లిందుక్రిందఁ బొందుపఱుపఁబడుచున్నవి—

ఉ. చల్లనివాఁడు పాదములచాయలఁ జేరి నెల్లవారికిన్
గొల్లలుగాఁగ నూరిగలఁ గొబ్బునఁ గాంపకకంకణంబులున్
జల్లెడువాఁడు వాహినులసంఘటనం బ్రతికూలవర్తన
ఖుల్లకభూమిభృత్కులముఁ గ్రుంగఁగఁజేయునతండు మేదినిన్.—ఆ. ౧.

ఉ. రాజకుమారశేఖరుఁడు రమ్యత నంపయి స్వాదరమున్
రాజిల నార్యసంగతి యనంతసుఖాశ్రయ మంచు నెంచుచున్
దాఁ జనుదెంచెఁ దాపసహితస్థితి నవ్వల నివ్వల న్వనీ
రాజుల నల్లపెల్లనృగరాజులు తన్నని విస్తరుంపఁగన్.—ఆ. ౩.

## కటికనేని-రామయకవి.

కువలయానందమని సాధారణముగా వాడఁబడెడి యలంకారశాస్త్రమును కువలయానందప్రకాశ మనుపేరితోఁ దెనిఁగించిన యీకవి చెఱుకునూళ్ళగోత్రుఁడు; నూరనకును బుచ్చమకును బుత్రుఁడు. కవి తనకు పద్మనాయకకుల మగుట యీక్రిందిపద్యముచే నిట్లు చెప్పియున్నాఁడు—

సీ. సకలజగజ్జనస్వర్గసోపానోర్మిగంగ నెచ్చట సిద్ధగతి జనించె
పతితాపజాశ్రితాపతితసతీశుద్ధభావకస్రద్ధజ మెందుఁ బరిఢవిల్లె
సనకాదినిఖిలసన్మునిమనఃషట్పదనికరములు ధుకరంబులమాడ్కి మలయు నెచట
బలిబంధనోత్కృపకలితాబ్జజాండగోమలు కేసరాభ నెచ్చోటఁ గనియె
నట్టి నారాయణాంఘ్రిపద్మాంతరమునఁ, బుట్టి కులంబులఁబూర్ణమహిమ
నాయకత్వముఁ గనుటచే నవ్యగరిమఁ! బ్రకట మయ్యెను పద్మనాయకకులంబు.

ఈకవి గాలమేదో యెక్కడనుండినవాఁడో తెలియరాలేదు. ఆతఁడు నూఱు నూటయేఁబదియేండ్లక్రిందట నుండియుండవచ్చును.

గీ. సరసుఁడకళంకవంశాబ్ధిచంద్రుఁడనఘుఁ! డైనరంగార్యవర్య్యసాహాయ్యమునను,
గువలయానందమిలను దెనుఁగరచింపఁ! గడఁగితిని దుష్కరంబైనకార్యమునను.

అను పద్యమునందుఁ గవి తా నీగ్రంథమును రంగార్యుని తోడ్పాటుచేత రచించినట్లు

చెప్పుకొనియున్నాఁడు. కవిత్వనైపుణి తెలియుటకయి కువలయానందప్రకాశము యొక్క మూఁడుఘట్టముల నుండియు మూఁడుపద్యము లిందుక్రింద నుదాహరింపఁబడు చున్నవి—

చ. అబలలయందుఁ గాంచనమునందు భ్రమ న్విధి కల్గఁజేసె నా
యబలలయందుఁ గాంచనమునందును భ్రాంతి దొలంగి నిష్ఠచేఁ
బ్రబలినవాఁడు చూడఁగ నరాకృతిఁ దాల్చి చెలంగుచున్నయ
న్నిబిడపరాక్రమక్రమవినిద్రుఁడు కేవలరుద్రుఁడే ధరన్.—ఘ. ౧.

చ. ధనికులమోము గన్గొనవు దబ్బఱలాడవు వారిగర్వదు
ర్వినయవచస్సుతు లెన్నవు వేమఱు వారల డాయఁబోవు క్ర
న్ననఁ దిసెకిచ్చ నూతనతృణంబుల నిద్దురరాఁగ నిద్దురం
గొనియెద వెందు నేమి వ్రతగోష్ఠిని జల్పితో తెల్పు మేణమా—ఘ. ౨.

చ. ధృతిని మధువ్రతంబులు నిజేష్టమధుప్రపరైన పద్మసం
తతి ముకుళింపఁజేసె వెసఁదా నితఁ డంచుఁ దలంచి పంకజా
హింతతతబింబమున్ బలిమి నేర్చి పడిం గడునాక్రమించి యం
చితముగ మేన నంకమునుచేసె నిజం బిది యెన్ని భంగులన్—ఘ. ౩.



## కొండమడుగు-పురుషోత్తమకవి.



ఈకవి సానందగణేశ్వర మను మూఁడాశ్వాసముల గ్రంథమును రచించెను. పుస్తకము దీబగుంట వీరేశ్వరస్వామి కంకితము చేయఁబడినను, కవి తనగ్రంథమును కుంటేటి బుచ్చయ్య యను కోమటియొక్క ప్రార్థనమీఁద రచియించి యందుఁ గోమటు లీవిధముగా వర్ణించెను—

శా. సాలంకాయనమౌని పూర్వమున భాస్వద్దివ్యతేజోధనం
డాలీలాధివంశసంభవులలో నత్యుజ్జ్వలోదారవా
గ్జాలుర్సత్యధనుల్ కుబేరసదృశుల్ సౌభాగ్యభాగ్యోదయుల్
మే లి-పంచినవైశ్యవర్ధనులు గాంభీర్యామితౌదార్యులన్.

కవి నియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు; గిరియప్పనందనుఁడు. కవి తోసేకయ్యలూరు మొదలయిన యగ్రహారము లుండినట్టు వ్రాసికొనియున్నాఁడు. ఈతని కాలము సరిగా తెలియదు. నూఱుసంవత్సరముల క్రిందటివాఁడయి యుండును. సానందగణేశ్వరములోని రెండుపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

ఉ. ఇంటికి నేగుదెంచి తనయింతిని గాంచి ప్రపంచవృత్తి నై
కొంటకుఁ బొంచి రత్నరుచికుండలమండితగండ యైన వా
ల్గంటికి శంభుఁ డిచ్చినవరంబు కరం బనురక్తిఁ దెల్పి క
న్గొంటి భయంబుఁ దక్క మీకుఁ గోమలి కాముకలీల నేలెదన్. —ఆ. ౧.

ఉ. మీనము లెల్లలం గడిమి మ్రింగుచు గాలములందు డిందు నెం
దేని పరాంగనారతికి దీకొని యే మిటు లైతి మింతె కా
దా నలినాయతేక్షణల యుబ్రపుగుబ్బల గోరు లుంచఁగా
సోఁగ నల్లవారినుపనూదుల గ్రుచ్చిరి మచ్చరంబునన్. —ఆ. 3.

## నాగులూరి-శేషనారాధ్యుఁడు.

ఈకవి శ్రీపర్వతపురాణమనెడి యాఱాశ్వాసముల గ్రంథమును రచియించెను. ఈపుస్తకమునకు శ్రీశైలమాహాత్మ్యమని నామాంతరము గలదు. ఇతఁడు గ్రంథాదిని తెలుఁగు నిట్లు పొగడియున్నాఁడు—

చ. జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్
ఘనలలితార్థగౌరవనికాని తెనుం గభిరమ్య మంతకున్
గనుఁగొనఁ జాతబీజమునకంటెను గోమలపత్రపుష్పశో
భనమృదుపల్లవాభినవబాలరసాలము సొంపు నింపదే.

ఆధునికుఁడే యయినను గవి యేకాలమునం దుండినవాఁడో సరిగా తెలియదు. ఇతఁడు నూటయేఁబదిసంవత్సరముల క్రిందట నుండియుండవచ్చును. ఈతనికవిత్వము సరసమయినది. శైలి జూపుటకయి శ్రీపర్వతపురాణమునుండి రెండుపద్యముల నిందుదాహరించుచున్నాను—

ఉ. శ్రీనగకంధరంబున వసించి చరించుపులిందబృందముల్
భూనుతభోగమోక్షములఁ బొందఁగఁ జూచి నిలింపసంఘముల్
శ్రీనిలయాభిరామ మగు శ్రీగిరిమీఁదఁ జరింతు రిట్లు య
మ్మానితనాకసౌఖ్యమహిమంబుల నెల్లఁ దృణీకరింపుచున్. — అ. 3.

శా. పాటింపందగు ముజ్జగంబులఁ బురప్రత్యర్థిజూటాటవీ
కోటీకోటరపావనామరధునీఘూర్ణోత్తరంగావళీ
వ్యాటీకాయుతవేణికానికరసమ్యక్పుణ్యతోయచ్ఛటా
చాటుత్వంబు వహించు శ్రీనగముపైఁ జంచజ్జలశ్రేణికల్. —ఆ. ౯.

## పీసెము_లక్ష్మీపతి.

ఇతఁడభిమన్యు పరిణయమనెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడు స్వస్తికరణవంశజాతుఁడు. పీసెము కృష్ణరాజునకును రంగమాంబకును జనియించినవాఁడు. ఇతఁ డభిమన్యుపరిణయములోఁ దన్నుఁగూర్చి యిట్లు చెప్పికొనుచున్నాఁడు—

ఉ. మాగధవంశసంభవుఁడ మానితపీసెకులావతంసుఁడన్
భోగబిడౌజుఁ డార్యజనపూజిత వేంకటకృష్ణరాజుకున్
బాగుగ రంగమాంబకును నౌరసపుత్త్రుఁడ లక్ష్మణాఖ్యుఁడన్
శ్రీగలుగన్ రచించెదను నే నభిమన్యుచరిత్ర వేడుకన్.

ఇతఁ డెప్పు డెక్కడనున్నవాఁడో తెలియరాలేదు. దాదాపుగా నితఁడు నూఱు సంవత్సరముల క్రిందటివాఁడయి యుండును. ఈతనికవిత్వ మంత మంచిది కాదు. అందు ఛందోవ్యాకరణదోషము లనేకములు కానఁబడుచున్నవి. అభిమన్యుపరిణయములోని రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. పన్నినవీరయోధులను బాహుబలంబున నగ్గుసేయు సం
పన్నుఁడ వార్యసన్నుతుఁడవు పాండవపౌత్త్రుఁడ వైననిన్నుఁగన్
జిన్నెల పువ్వులు న్సరులుఁ జేనఁగఁ గూర్పరు నేరఁబట్టియో
కన్నియ లెట్లు నీమనసుకాంక్ష కరంగఁగఁ జేయువారలో.—ఆ. ౧.

ఉ. నారదమౌనిమాట మది నమ్మితి నేఁడది కానిచందమై
దూరము నాట కానఁబడెఁ దూర్యవాదులఁ జుట్టుపక్కలన్
వారును నీ రెదుర్కొనుచు వచ్చుట కీయ్యగివేళ పోవుచు
న్నారిక విఘ్నము ల్గలవె నన్నిట దైవము మోసపుచ్చెనే.—ఆ. ౪.

## వేమనారాధ్యుల_సంగమేశ్వరారాధ్యుఁడు.

శైవుఁడయిన యీకవి యహల్యాసంక్రందనవిలాసమనెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఒక యెత్తుగీతములో

గీ. అట్టిసాహసవిక్రమారూఢుఁడైన। వాసిరెడ్డ్యన్వయాంభోధివరసుధాంశు
చంద్రమౌళిక్షమాపాలజనవిభుండు। కొలువుదీర్చి మహోత్సవాడంబరమున.

అని కవి వాసిరెడ్డి చంద్రమౌళిప్రభువు తన్నుఁ బిలిపించి వేఁడఁగా తానహల్యాసంక్రం

దనవిలాసము నారాజమౌళి కంకితము చేసినట్లు చెప్పెను. ఈవాసిరెడ్డిచంద్రమౌళి కృష్ణామండలములోని యమరావతీపురమును బరిపాలించిన కమ్మవంశజుఁడు. ఇతఁడు సుప్రసిద్ధుఁడయిన వాసిరెడ్డి వేంకటాద్రినాయని సోదరపుత్రుఁడు. ఈకవి కవిత్వము ప్రౌఢమయినది కాని యిందు వ్యాకరణదుష్టములైన ప్రయోగము లనేకములు కానఁబడుచున్నవి. ఈగ్రంథము నూఱుసంవత్సరములక్రిందట రచియింపఁబడినది. అహల్యాసంక్రందనవిలాసమునుండి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

మ. పరకాంతారతిదోష మంచు మది సంభావింపఁడో యన్య తె
వ్వరు గన్నం దను విందసేతు రనుభావం బెంతయుం బూనఁడో
నరుఁ డొక్కింత యెఱింగనేని సిలుగు ల్వాటిల్లునం చెన్నఁడో
పరమామోదమె కాని యింద్రునకుఁ బాపభ్రాంతి లే దేమియున్.—ఆ. 3

చ. సరిసం! నిన్నువంటి నెఱజాణలు పుట్టరె వార లెల్ల నీ
కరణిఁ దలంతురే చింతితకార్యము లిచ్చటఁ జెల్లునే యయో
పరమపతివ్రతైన మునిభామినితో నొకసక్కెమేమి నీ
గరిమను గావవచ్చునని కంటిరొ వింటిరొ బుధాగ్రణుల్.—ఆ. 5.

## ములపాక బుచ్చన్నశాస్త్రి

ఈకవి వేంకటేశ్వరమాహాత్మ్యమను పద్యకావ్యమును రచియించెను. ఇతఁడు కోనసీమ ద్రావిడబ్రాహ్మణుఁడు. ఈబ్రాహ్మణులనే యారామద్రావిడు లనియు, పేరూరి ద్రావిడు లనియు, వాడుదురు. వీరు మొట్టమొదట నఱవవారే యయినను చిరకాలము క్రిందటనే యీయాంధ్రదేశమునకు వచ్చి తోఁటదొడ్లను సంపాదించి యిచ్చటనే నిలిచిపోయినవా రగుటచే నఱవభాషను మఱచిపోయి యించుమించుగాఁ దెనుఁగు భాషనే స్వభాషగాఁ జేసికొనియున్నారు. వీరు తెనుఁగున గ్రంథరచన చేయుటయే యీవిషయమును దెలుపుచున్నది. ఈకవి కోదండరాముని పుత్రుఁడు; భార్గవ గోత్రుఁడు; గుడూరియం దుండినవాఁడు. ఇతఁడు తనపూర్వులను గూర్చియు, తన్నుఁ గూర్చియు, వేంకటేశ్వరమాహాత్మ్యమునం దిట్లు చెప్పియున్నాఁడు—

సీ. అనుపమకోనసీమాభిధాన ద్రావిడాన్వయంబునను విఖ్యాతిమీఱు
ములపాకవా రనుముఖ్యాన్వవాయులు కాశ్యప భార్గవ కౌశి కాత్రి
గోత్రజు ల్గల రందు గుణశరభార్గవగోత్ర సంజాతుఁడై కొమరుమీఱు
వేంకటపతి వాని కుంకువమీఱ వెంగాంబికయందు సుబ్బాభిధాన

విబుధవరుఁ డుద్భవించె నవ్విమలమతికి। బుచ్చమాంబికయందు-సంపూర్ణచంద్ర
మండలమురీతి సత్కళామండనుండు। రహి జనించెను గోదండరామవిభుఁడు.

* * * * * *

సీ. మట్లవంశోద్భవక్ష్మాపాలపాలిత గుఁడ్లూరిపురి నుండు గురుయశుండ
నాంధ్రగీర్వాణభాషాష్టభాషాకవిత్వాభి నిర్మాణమహత్త్వవిదుఁడఁ
గాశికాపశ్వేశకరుణాకటాక్షాభిభాషితబహుళప్రబంధచయుఁడ
హితనాటకాంతసాహిత్యనిత్యాభ్యస్తసకలపురాణార్థసారవిదుఁడ
సాంద్రములపాక విద్వత్కవీంద్రవంశ। వార్ధిచంద్రుండ సర్వసర్వంసహాభి
విశ్రుత సుకవికులగోత్రపులపక్షు। లాగపఃర్యైన బుచ్చనశాస్త్రికవిని.

ఇతనికాలము తెలియదు. ఇతఁడు నూఱుసంవత్సరముల పయివాఁ డయియుండును. వేంకటేశ్వరమాహాత్మ్యమునుండి మఱి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. సంగతిమీఱ మీచరణసారస మందు జనించినట్టి యా
గంగకు దక్షిణంబున నగాధతరం బగుదక్షిణాబ్ధికిన్
రంగగు నుత్తరంపుదెస రాజిలుపూర్వసముద్రపశ్చిమా
శం గన నొక్క రా వమరు సారతరోన్నతదండకాటవిన్.—ఆ. ౧.

చ. గిరిజయు నీవు నెల్లప్పుడుఁ గిన్నర పన్నగ సిద్ధ సాధ్య భూ
సుర నరసంఘము ల్గొలువ సొంపు దలిర్పఁగఁ జేరి యాసరో
వరతటసీమనుండుఁ డభివర్ణన కెక్క భవత్సమాఖ్య ని
గ్గిరియు సరోవరంబు నను గేవలమోదముతో హరుం డనన్.—ఆ. ౧.



## పాలవేకరి-కదిరీపతి



ఈకవి శుకసప్తతియను కావ్యమును రచియించెను. ఈతని కవిత్వము హృద్యముగానే యున్నది కాని పుస్తకమంతయు దొరకలేదు. దొరకిన రెండాశ్వాసములను బట్టి చూడఁగా నితఁడు ప్రౌఢకవి యగుటకు సందేహ మగపడదు. “ఇది శ్రీమత్కదిరీ నృసింహ కరుణాకటాక్ష వీక్షణ సమాగత కవితాధార పాలవేకరికుల కలశాంభోధి సుధాకర తాడిగోళ్ళ కరియమాణిక్య నృపహార్యక్షపౌత్ర పవిత్రచరిత్ర కదిరిధరా మండలాఖండ పుత్ర విద్వత్కవిరక్షాయసంధాయక కదిరీపతినాయక ప్రణీతంబైన” ఇత్యాది గద్యమునుబట్టి చూడఁగా కవి నాయకకులజుఁ డయినట్లును, కరియ

మాణిక్యనృపపౌత్రుఁ డయినట్టును కదిరిరాజపుత్రుఁ డయినట్టును దెలియవచ్చుచున్నది. కప నెల్లూరిమండలములోనివాఁడు. ఇతఁడు తనగ్రంథమును శ్రీరామాంకితము చేసెను. ఈతనికాల మేదో తెలియరాలేదు గాని యితఁ డాధునికుఁ డగుటకు సందేహములేదు. శుకసప్తతినుండి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. అలజయకేతనుండు రుచిరాంగతిరస్కృతమీనకేతనుం
డెలమి మదిం దలిర్ప దయ నేలికయుం దలిదండ్రు లయ్యెడన్
దలఁచినకార్యభాగ ముచితజ్ఞులచే విని నీతికార్యవ
ర్తు లగునియోగిపుంగవులతోడ రహస్య మొనర్చి యిట్లనున్.— ఆ. ౧.

మ. అక్కట దోసతోఁట యిడియోఁ దదీయఫలంబు లమ్మి యీ
డొక్కయు సాకఁ గోరితిఁ గడు న్నడురేయిని వచ్చి యెవ్వరో
మక్కువలేక నాకడుపుమంటయుఁ బుచ్చుకొనంగఁ బూని యీ
చెక్కగవంటిపండ్లు తినసాగిరటంచుఁ గృశించు నెంతయున్.

## మాధవమంత్రి.

ఇతఁడు భగవద్గీతలను నాలుగాశ్వాసముల పద్యకావ్యమునుగా రచియించెను. ఇతఁడు గోదావరీమండలములోని నియోగిబ్రాహ్మణుఁడు. గిరిమనమంత్రి పుత్రుఁడు; కిడాంబి వేంకటాచార్యుల శిష్యుఁడు. ఈతని గ్రంథమునందు లక్షణవిరుద్ధములైన ప్రయోగము లనేకములు గానఁబడుచున్నవి. అయిన నితఁడు తనగ్రంథము నందు దత్తోజీ పండితవిరచితమయిన భగవద్గీతలలోకంటె వృత్తముల నధికముగా వేసియున్నాఁడు. ఇతఁడు తనకృతిని భద్రాద్రిరాముని కంకితము చేసెను. ఈతని పుస్తకమునుండి రెండు మూఁడు పద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

మ. ధరఁ బాలిన్యక లోభకాంక్షయుతుఁడై ధాత్రీశుల న్మిత్రులన్
గురురాజీకితఁ జంపఁగాఁ దలఁచి తాఁ గ్రూరాత్ముఁడై యున్నచోఁ
బొరిఁగొన్నన్ దురితంబు చెందు వినుమీ పాతొల్ల నాకేల య
స్థిర మీరాయము దీనికై కులజులం ద్రెళ్ళింపఁగాఁ బాడియే?— ఆ. ౧.

శా. విద్వన్ముఖ్యుఁడు కర్మపుంజములు తా విధ్యుక్తమార్గంబుచే
మద్వాక్యంబులరీతి సల్పుచును సాత్త్వం గాంచి యవ్వేళలన్
హృద్వ్యాసంబున మోహ ముప్పతిల వర్తించు న్మముత్వాది రా
గద్వేషంబులు లేక యోగి సమతన్ గంభీరుఁడై ఫల్గునా.— ఆ. ౨.

చ. పరులు నుతింపఁ బాలు పని పల్కుచుఁ జిత్తములం దలంచి సు
స్థిర మగుబుద్ధి లేక ఫలసిద్ధిఁ గాంక్ష యొనర్చి దంభులై
యురవడి నట్టిజ్ఞానమున కెంతొ విరోధము చేయుచుట్టి యా
నరు లొనరించు యజ్ఞము ఘనంబుగ రాజసయజ్ఞ మర్జునా.— ఆ. ౪.

## గోపాలుని-సింగయ్య.

ఈకవి భారవికృతమైన కిరాతార్జునీయ మను సంస్కృతకావ్యమును నయిదాశ్వాసముల గ్రంథముగాఁ దెనిఁగించెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; మౌద్గల్య గోత్రుఁడు; భాస్కరామాత్యపౌత్రుఁడు; వీరనమంత్రి పుత్రుఁడు. ఈకవి కర్నూలు మండలములోనివాఁడు. ఇతఁడు తనగ్రంథమును శ్రీమదహోబల లక్ష్మీనృసింహస్వామి కంకితము చేసెను. ఈకవిపుత్రుఁ డెనుబదిసంవత్సరములక్రిందట జీవించియుండెను. కాఁబట్టి కవి నూఱుసంవత్సరములక్రిందటివాఁడు. ఈతని కవిత్వము రసవంతమయి సలక్షణ మయినదిగా నున్నది. కిరాతార్జునీయకావ్యములోని కొన్నిపద్యముల నిందుఁ బొందుపఱుచుచున్నాను—

చ. కొలిచినభృత్యకోటి ననుకూలత నొప్పెడు మిత్రులట్ల మి
త్రుల మఱి బంధువర్గములతో సరిగాఁ గను బంధుజాలమున్
దెలియఁ గృతాధిపత్యమున విశ్రుతమాతఁవఁబోలె నాదరం
బలరఁగఁ దన్మయుం డగుచు నాగయు లెస్సగ సంతతంబునన్ — ఆ. ౧.

ఉ. భానుకరప్రసారపరభాగితలస్ఫురదింద్రనీలసం
తానవిరాజమానరజతస్ఫటికాంచితకుడ్యదీధితుల్
మానుగ నెంచిచూడ దినమధ్యమునందును గౌముదీభ్రమన్
ఘూకతత మాటిమాటికిని బుట్టఁగఁ జేసెడుఁ జూడు విగ్గిరిన్ — ఆ. ౨.

ఉ. కొప్పులు వీడఁగా నడిచి కొజ్జఁగిదండలు జాఱఁగొట్టియున్
గప్పురగంధము ల్చెదరఁగా వెసఁ దాఁకియుఁ జెక్కునేరముల్
తప్పక యిగ్గతి న్సలిపి తత్సతు లందలిభీతిచేబలెన్
దప్పర సైంకంపమునఁ దేలుచునుండెను వీడు లత్తఱిన్.— ఆ. ౩.

ఉ. అట్లైన స్మృతిరోమియున్న వినుమీ యారాజు నిప్రాణసం
కట మా వేళను వచ్చిసూకరముఁ దా ఖండించి రక్షించె ని

నన్నటుగా నం బరమాప్తుఁ డంచు మదిలో హర్షించి వైరింప కొ
క్కటియైయుండు కృతజ్ఞతాసిలయు లోఁగాధగ న్సజ్జనల్ — ఆ.౪.

మ. జయవాంఛ న్విడనాడుచుం బఱచునా సైన్యంబులం జూచిఁ ద
దయపుట్టె న్మనలోన నర్జునుఁడనుం దర్కింప న్లేకదా
భయులై చిక్కినవీచశత్రుల దయం బాటించి రక్షించి త
నయుఁ గీర్తి మహాత్ములౌనరుల కెన్నఁగావె యుద్ధంబులన్. ఆ ౫

గూళికల్లు వేంకటరమణకవి.

ఇతఁడు కనకరంజితశిఖామణిపరిణయ మనువిక్రమార్కునిగూర్చిన యాఖ్యానములపద్యకావ్యమును రచియించెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; వేంకటమాత్యునకును రంగమాంబకును కుమారుఁడు. ఇతఁడు హరివంశమునుగూడఁ దెనిఁగించినట్లు కవినిగూర్చి వేంకటేశ్వరుఁ డన్నట్లున్న కనకరంజితశిఖామణిపరిణయములోని యీ క్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

సీ. నీయిష్టదైవంబ నినుఁబ్రోచుచుండెడు శ్రీవేంకటేశుండ నీ వెఱుంగు
మోవత్స యిప్పుడు నీభావంబు తెలిసి వచ్చితి గూళికల్లుఁగ శేఖరుఁడవు
వేంకటామాత్యుఁడై వెలయుమంత్రికి జిక్కలేటివంశజయౌవధూటి రంగ
మాంబకు జనియించి మాపేరుగొన్న వేంకటరమణుఁడవు సత్కవివి మాకు
మునుపు హరివంశ మంతయుఁ దెనుఁగు చేసి
యంకిత మొసర్చితివి విక్రమార్కచరిత
మిఁకఁ బ్రబంధ మొనర్చి మాకిమ్ము సిరులు
శుభము లొసఁగెదనని పల్కె సుముఖుఁ డగుచు.

ఈ వేంకటరమణకవి నూఱుసంవత్సరములక్రిందట నుండినవాఁడు. ఈతనికవిత్వము రసవంత మయినదే. కనకరంజితశిఖామణిపరిణయములోని రెండుపద్యముల నిందుదాహరించుచున్నాను—

ఉ. అంత నితాంతమామకతపోగ్ని దహింపఁ బురంబులో మహా
కాంతుఁడు మిత్రబాంధవనికాయముతోఁ బరిదగ్ధుఁ డైని
ల్లెంతయు ఘోరకాననము వృద్ధి వహించె మదీయజీవముల్
చింతిలి మస్తకాంతరముఁ జెందుట నేదరి గాన కుండెడన్.—ఆ. ౧.

చ. తెలిపినవాఁడు రంజిలుచు దేవర దేవరకు న్వరంబు ని
ర్మలమతి నిచ్చెఁ గావునఁ గుమారుని మారునివంటివాని స
త్కలి గలవాని సర్వజనమిత్రుని మిత్రునిఁబోలుఁ సత్ప్రతా
పలసితుఁ గాంచి యొప్పుము శుభంబుల భంబుల దేలిచాద్భుతన్. — ఆ. ౫.

## కృష్ణకవి.

ఇతఁడు శకుంతలాపరిణయ మనెడి మూడాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఈకవి మైత్రేయసగోత్రుఁడు; నారసింహార్యుని పుత్రుఁడు. కవి తనయింటిపే రేదో తా నేతెగ బ్రాహ్మణుఁడో చెప్పుకోలేదు గాని శకుంతలాపరిణయ ప్రథమాశ్వాసములోని యీక్రిందిపద్యములనుబట్టి చూడఁగా నితఁడు వైష్ణవుఁ డైనట్లూహింపఁ దగియున్నది—

మ. నను రామానుజపాదపద్మ యుగళీనవ్యావ్యయధ్యానపా
వనతన్మాద్భాగవతావతంసపదసేవాసక్తచిత్తున్ మరు
త్తనయారాధనచారులబ్ధకవితాధారున్ సదారూఢభా
వన నాస్థానకవీన్ నిజాశ్రితుని బిల్వంబంచి పల్కెం గృపన్.

క. పాత్రుఁడవై మైత్రేయస। గోత్రుఁడవై నారసింహగురువర్యునకున్
బుత్రుఁడవై వెలయుదు వీ। ధాత్రిన్ మాపనుపు సేయఁదగుఁ గృష్ణకవీ.

ఈగ్రంథము చింతలపూడి పాపయ్య యను కమ్మనాయని ప్రేరణమువలన రచియింపఁబడినది. కవి నూఱుసంవత్సరములక్రిందటివాఁడు. ఈగ్రంథము పిల్లవసుచరిత్ర మని దాక్షిణాత్యులు కొందఱు అనుచున్నారుగాని యీప్రాంతములయందు దీనికట్టిప్రసిద్ధి లేదు. అబ్బనామాత్య విరచిత మైనకవిరాజమనోరంజనమును, సూరకవి ప్రణీత మైన కవిజనరంజనమును, పిల్లవసుచరిత్ర మని యిచ్చటివారు చెప్పుదురు. ఈగ్రంథకవిత్వము శ్లాఘ్య మైనదే యైనను, పిల్లవసుచరిత్రమని చెప్పఁదగినంత శ్రేష్ఠముగాలేదు. ఈకవి యనేకపద్యములను వసుచరిత్రాదిగ్రంథములను జూచి వానిలోని పద్యములవలె రచియించి యున్నాఁడు. ఇందుకు నిదర్శనముగా వసుచరిత్రములోనిపద్యము నొకదానిని శకుంతలాపరిణయములోనిపద్యము నొకదానిని మాపుచున్నాను—

ఉ. కొండఁట విల్లు వేదలఁట కుండలిరాజఁట నారి యమ్మనం
తుండఁట బైటిపల్లియలఁ దున్నినవాఁడఁట యొందు రెండు భ
ర్గుండిది నిండుపౌరుషమొకో యని గెల్చెవె ముజ్జగంబు లు
ద్దండత నొక్కతుంటవిలు దాలిచి యుంటివిఁ గందర్పఫాలక. — వసు. ౧.

ఉ. తుంటటంట కార్ముకంబు కరదాల్చినతేంట్లట వింటినారి చే
నంటినవాడుతూపు లట యుప్పులపాలట కేతనంబు వా
గంటిపులుంగు గుజ్జుమట కాయము లేదట నీకు లోకముల్
గెంటెతనంబున న్గెలిచితో వీ యచ్చెరువుంబు మన్మథా.—శకుంతల

ఇందప్రశస్తంబులగు ప్రయోగంబులును గొన్ని కానఁబడుచున్నవి.

క. ఆ ఖేటమునకు ధాత్రీ । శేఖరుఁ డనుమతింప లేతెం డనుచున్
శ్లాఘించుచుఁ బశువారులు । లాఘవమునఁ బిలిచి రగ్గలంబుగ వారల్.

ఇందు శ్లాఘించు 'లాఘవము' అనుపదము లప్రయోగము లైనను గావలెను, ఖఘల కొండొంటికిఁ గూర్చినయప్రశస్తప్రాసము లైనను గావలెను. ఈపుస్తకములోని మంచి భాగము లనేకములు కాళిదాసుని యభిజ్ఞాన శాకుంతలనాటకమునుండి తెనిఁగింపఁబడినవి. అభిజ్ఞాన శాకుంతలములోని మనోహరములైన నాలుగుశ్లోకములలో రెంటిని కవి యీక్రిందిరీతిని తెనిఁగించియున్నాఁడు—

చ. కనుఁగవ బాష్పపూరములు గ్రమ్మెను గద్గదభిన్నమై యెలుం
గనువుగ రాదునా హృదయ మాకుల మయ్యెడు మేను మ్రాన్పడుం
బెంచినవారి కింతవగఁ బిమ్మటిఁ గ్రమ్మెనె కన్నవారలుం
దనయను బంపలేక సంతాపభరంబున నెట్లు సైతురో.

మ. గురుశుశ్రూషలు సేయుమీ సవతులన్గూర్మి న్విలోకింపుమీ
పరివారమ్ములఁ బ్రోవుమీ సిరుల గర్వస్ఫూర్తిఁ గైకోకుమీ
పురుషుం దూలకుమీ సకుల్ నడచు నేర్పుల్ నీకు సూచించితిన్
దరుణీలోకమతల్లి చేకొనవె మాతల్లీ మదీయోక్తులన్.

ఇట్లున్నను మొత్తముమీఁదఁ గవిత్వము ప్రౌఢమనియే చెప్పవచ్చును. కవిత్వప్రౌఢిమ తెలియుటకయి శకుంతలాపరిణయములోని రెండుపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

ఉ. మోవ మొగ్గఁ బుష్పవతుల త్రుగ్గులపై నొఱపైన ముగ్గులన్
గేదఁగి పూలచెక్కులఁ గదలిరాకుల తోరణంబులన్
బ్రోది వహించుపక్వఫలపుంజములన్ శుకకోకిలాళిస
న్నాదములన్ నికుంజభవనంబుల నీలన్నృపాలనూతికిన్.—అ. ౧.

శా. పాదన్యాసంబులు పల్క నేల నృపతీ పన్నీరకర్పూరక
ర్పూరస్ఫారపటీరసౌరభపయఃపూరంబె జంద్రాతపం

భారామానిలసేవనంబు మును మీ రక్రాంతముం గాంతురా
హేరాళంబుగఁ బుత్రగాత్రమిళనం బెట్లుండునో చూడుఁడీ.—ఆ 3.

## వల్లూరి-నరసింహకవి.

ఇతఁడు నాగ్నచిత్తీపరిణయ మనుమూడాశ్వాసముల ప్రబంధము రచియించెను. ఈకవి యాపస్తంబసూత్రుఁడు; కౌండిన్యగోత్రుఁడు; హనుమత్కవిపుత్రుఁడు; ఆరువేలనియోగికులపవిత్రుఁడు. ఇతఁడు నూఱు సంవత్సరముల క్రిందటివాఁడని తోఁచుచున్నది. ఈతనికవిత్వము రసికజన హృదయాహ్లాదకరముగా నున్నది. కవితాపటిమ తెలియుటకై నాగ్నచిత్తీపరిణయములోని మూడుపద్యముల నెత్తి చూపుచున్నాను—

చ. తనయునిముద్దుపల్కు చెవిఁ దార్కొన సంతసమందుచున్నత
జ్జనకునికీతి మామకవచశ్శ్రీకరంబు వినంగఁగోరె మీ
తనసినవేళ నిట్లు సెల విచ్చుట నాయెడఁ గూర్మిఁ గాద మీ
పనుపున విన్నవించెదను బద్ధదళాత్మకుభప్రసంగముల్.—ఆ. ౧.

ఉ. వందుర నేల యిట్లు మగువా తగనా నగువాఁ జూడ కీ
యందఱిలోఁ జెప్పుగదా పగదాయగదా యటంచు నన్
గంమ రటించు నిట్టు లుడుగన్ నుడుగం దొడఁగందలంచి నీ
కందువ లింక మాను కొఱగాదఱగా లెఱగాను నెచ్చెలీ.—ఆ. ౨.

ఉ. కోసలుఁ డాత్త నేనృపులకున్ వృషభంబులఁ బట్టరామికిన్
గాసిలి వీఁక బట్టుకొని కట్టినవానికిఁ గన్య నిత్తు నే
బాస యొనర్చినాఁడ నని పల్కతి నింకిటఁ దప్పి తేని పెన్
దోసము తమ్ము నీకొమరితో జతగూర్పఁగ నెవ్వఁ డబ్బునో.—ఆ 3.

## గొంతేటి-సూరన్న

ఇతఁడు కృష్ణాభ్యుదయ మనెడి యైదాశ్వాసములపద్యకావ్యమును రచించెను. ఈకవి తన్నుగూర్చి కృతిపతి యైనబొల్లాప్రెగడ కామమంత్రి పలికినట్లుగా గ్రంథాదియం దీపద్యమును వ్రాసికొనియున్నాఁడు—

మ. ననుఁ గొంతేటికులసత్కులున్ జెలిమియొప్పన్ దాను వీక్షించి నూ
గవ నీ వక్కజమైనసత్కవివి యోగ్యశ్రేణి లగ్గింప భ

త్తిని కృష్ణాభ్యుదయప్రబంధము జగద్గేయప్రమేయంబుగా
నొనరం జెప్పుము మెప్పు లుప్పతిల సర్వోగామరాగంబునన్.

ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు; కామయామాత్యపౌత్రుఁడు; కాశిరాజపుత్రుఁడు. ఈతనికవిత్వ మంతశ్రేష్ఠ మయినదని చెప్పఁదగినదికాదు. ఇతఁడు నూఱుసంవత్సరములక్రిందట నుండినవాఁడు. కృష్ణాభ్యుదయములోని రెండుపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి:—

ఉ. దేవకిగర్భగోళమున దేవశరణ్యుఁ డగణ్యపుణ్యసం
భావితభద్రమూర్తి యగుపంకజనాభుఁడు భవ్యలాభుఁడై
శ్రీవెలయం బ్రతిష్ఠిత వసించె జగజ్జనరక్షణక్షమన్
భావభవాబ్జభూప్రభవభావుకుఁ డయ్యును ధీనికాసతన్.—ఆ. ౧.

చ. పదముల ప్రాలి బాలకునిపై దయసేయుము తప్పు చేసితిన్
సదమలచిత్సుఖా రుద సత్తను యుత్తమ మైనీకథా
భ్యుదయము గోరి నీదు పదపద్మములను లగ్నవచ్చినాఁడ నా
కొదవలు దీర్ప దేవతలకైన పె హాస్పఁ దవగ్ర నీవెకా.—ఆ. ౪.

## బేతపూడి-కృష్ణయ్య.

ఈకవి జానకీరాఘవ మను నయిదాశ్వాసములప్రబంధమును రచియించి దానిని కమ్మప్రభు వయిన యడపానాగప్ప కంకితము చేసెను. ఈపుస్తకమునుగాక కవి యలమేలుమంగావివాహము, పండితమనోభిరామము, అనుగ్రంథములను రచించిన ట్లవతారికలోని యీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

సీ. మఱి శ్రీయలమేలుమంగావివాహంబు శ్రీజగన్నాయకార్పితము చేసె
రహిఁ బండితమనోభిరామశృంగారకావ్యము ధవళాద్రిరాయనికి నొసఁగెఁ
బహుకల్పనాకల్పబంధుకీర్తులతోడ రచియించె జానకీరాఘవంబుఁ
బ్రాకటప్రాసాదపంచాక్షరీమంత్రజపపరాధీనరసజ్ఞుఁ డితఁడు
హరికథలె కావ్యములు చేసినాంధ్రభాష యందుమద్భక్తుఁడితని చెన్నొందుకావ్య
రత్న మైనట్టిజానకీరాఘవంబు । శ్రీకరం బగు నారధాత్రీశలేంద్ర

ఈకవి శ్రీవత్సగోత్రుఁడైన యాఱువేలనియోగి. ఈతనికవిత్వము సరసముగానే యున్నది. ఇతఁడు నూఱుసంవత్సరములక్రిందటివాఁ డయియుండును. జానకీరాఘవమునుండి రెండుపద్యము లిం దుదాహృతము లగుచున్నవి:—

చ. పృథులకుచప్రకాశనములు బింబఫలాధరసద్రుచుల్ సుధా
మధురపికానులాపములు మత్తమయూరవిహారముల్ శుభ
గ్రథనవినీలవద్భ్రమరకంబులు కప్రపుఁ జెక్కులున్ వనీ
మధుకరవేణికల్ దనరు మాధవుఁ డం దమరాగ మానఁగన్.—ఆ. ౪

శా. ఆకోదండము రామభద్రుఁడు సముద్యల్లీల నీక్షించి శాఁ
గైకోఁ జూచి ప్రదక్షిణంబుగ భుజాగర్వంబుతో వచ్చి పూ
జాకల్పంబుగ దానిఁ బుచ్చుకొని నిస్సారంబుగా నంతఁ దా
నాకర్ణాంతముగాఁగఁ దీసి విఱిచెన్ హస్తప్రభావంబునన్.—ఆ. ౫.



## బసవరాజు—నాగేంద్రకవి.



ఇతఁ డానందసుందరీచాతుర్యవిలాస మను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఈకవి యాఱువేలనియోగి; పాపనామాత్యుని కుమారుఁడు. ఇతఁడు సుమారు నూఱుసంవత్సరములక్రిందట నుండియుండును. ఆనందసుందరీచాతుర్యవిలాసమునుండి రెండుమూఁడుపద్యములను గవి కవిత్వకౌశలమును జూపుటకయి యిందుఁ బొందుపఱుచుచున్నాను.—

ఉ. క్షోణిప యాతఁ డక్కుధరకూటశిఖాంతరమందుఁ గాంచె న
క్షీణజలోచ్చలన్మదజశీకరబంధురసింధురార్భక
శ్రేణిని హంసకోకబకచిత్రితరమ్యవిశాలసైకత
శ్రోణిని దీర్ఘవేణిని బహుప్రఘరాణినిఁ గృష్ణవేణినిన్.—ఆ. ౨.

ఉ. భూమిపతీ యాతఁ డక్కమలపూరములోపలఁ గాంచె నుల్లస
ద్భానుసహస్రరమ్యమణిభాసితభోగవిభూషు నానసో
న్నాసితకైటభారిగుణమంజులసౌఖ్యుర స్తదోషు నం
భోనిధికాననాకలితభూధరబాహుని శేషు శేషునిన్.—ఆ. ౨.

ఉ. సైన్యము దక్కఁ జాపశరదారుణఖడ్గము లూఁపట్టి యు
న్నోన్యవధాశ చేఁ బెనఁగునప్పుడు చూడు మురారిశక్తి న
త్యున్నతిఁ దద్బలంబు నధికోజ్జ్వలతోయధులు పిచ్చలింపఁగా
జన్యమునందుఁ గూల్చెడను జక్రి శుక్రుఁడు తల్లడిల్లఁగన్.—ఆ. ౩.



## మాచవరపు-పాపనామాత్యుఁడు.

ఇతఁడు నందవరీక పుత్రము రెండాశ్వాసముల గ్రంథమును రచియించెను. ఈనందవరీకులచరిత్ర మీవలనే యిందు వ్రాయఁబడినది. కవి నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; వేంకటాచలమంత్రిపుత్రుఁడు. ఇతఁడు తన వాసస్థలాదులనుగూర్చి యిట్లు చెప్పుకొనియున్నాఁడు—

సీ. శ్రీమించు వినుకొండసీమలో నల్ల యనంతవరం బనునగర మొకటి
కొమరొప్పు బెల్లముకొండదేశంబున మానితంబై యొప్పు మాచవరము
గ్రామద్వయంబునఁ గాణాచి యేకభోగముమీఱ వెలసినఘనయశుండు
పెద్దనామాత్యుండు ప్రియురాలు జ్ఞానాంబ వారికి జనియించె వరసుతుండు
పాపనాహ్వయుఁ డనఁ బ్రఖ్యాతుఁడై యొప్పు నాతనిభార్య శ్రీయచ్చమాంబ
వారికి ముగురుపుత్రు లుదయించిరి। మొదటివాఁడుతనయుతఁ డ్రిమూర్తు లనఁగ
నగ్రజుఁడు వేంకటాచలం బనెడుపేర । బరఁగెను విభవసౌభాగ్యగరిమ.

క. అతనిదేవి పతివ్రత । సీత నరుంధతినిబోలి సృష్టిని వెలసెన్
జేతోమోదంబున సం । ప్రీతిం శ్రీకొండమాంబ ప్రియుతముఁ జనింపన్.

ఉ. శ్రీపరమేశుసత్కరుణ శ్రీవిలసిల్లఁగ వారికిన్ సము
ద్దీపితచారుమూర్తు లతిధీయుతు లిద్దఱుపుత్రు లందులోఁ
బాపన నగ్రజుండ నయి భాసిలి సత్యము దేవభక్తియున్
బ్రాపుగ నమ్మి సద్గురునిపాదములే గతిఁ గాంచుచు నున్నాడన్.

నందవరము లిప్పు డనేకములు కానఁబడుచున్నవి. పూర్వకాలమునందు నందుఁ జేరి నట్టియు నందవరీకుల కియ్యఁబడినట్టియు నందవరము కర్నూలుమండలములోనిదయి నట్టు కవి యీక్రిందిపద్యమున వర్ణించియున్నాఁడు—

సీ. అందమై విలసిల్లుఁ గందనోలీసీమలో నందవరం బనునగర మొకటి
తప్పట్టణంబుసౌందర్యంబుఁ గొనియాడఁ జిత్ర మొప్పారెడి విచిత్ర మరయ
సుందరం బగుచు సంక్రందనపురిఁబోలి యిందిరాదేవికి మందిరముగఁ
గడురమ్యమై చాలఁ గర మొప్పుచుండును గూపతటాకము లారామవిసరఁ
బంకజాకరవిలసితపద్మనికర । మధురమకరందరసపానమత్తమధుప
సరసఝుంకృతసంగీతిసంకులంబు । నగుచుఁ దగఁ జెల్లు విశ్రాంతి యవనియందు

పయిపద్యములోని యనావశ్యకములయిన పదముల ప్రయోగమునుబట్టియే యీకవిత్వ

మంత మంచిదికాదని చదువరు లెఱుఁగవచ్చును. ఇతఁడు నూఱు నూటయేఁబది సంవత్సరముల క్రిందటివాఁడేమో! నందవరీకచరిత్రము రెండాశ్వాసములనుండియు రెండేసిపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి:—

మ. శివమం దెల్లను రాజ్యభారముఁ దగం దీర్చున్ మఱిన్ రాత్రులం
దవలీలం జని జాహ్నవీసలిలమం దారూఢిగా స్నానమున్
సవిశేషంబుగఁ జేయుచున్ విరత మీచందంబునన్ రాజపుం
గవుఁ డంహోరహితప్రభావయుతుఁడై గాంభీర్య మింపొందఁగన్ —ఆ. ౧.

ఉ. ఒక్కమహానుభావుఁ డిటవచ్చి దయారస ముప్పతిల్ల నల్
దిక్కుల దివ్యతేజములు దీటుకొనం గడుసత్త్వభావుఁడై
మక్కువ యోగవాగ మనుమంత్రము నా కుపదేశ మిచ్చి తాఁ
జక్కఁగ నిచ్చి పాదుకల సంభ్రమ మొప్పఁగ నేగె నంతటన్ —ఆ. ౧.

ఉ. నందవరంబు మాకును ఘనంబుగ నచ్చట ధారపోసె నా ద
త్తుండిటు దాను గూడుకొని శుభ్రతరం బగుజాహ్నవీజలం
బందులఁ గాన వచ్చితిమి యాతనితో మఱి దెల్పి వేగ మా
కుం దగఁజెప్పు మన్న ననుకూలత నచ్చెరుపాటు తోఁపఁగన్. —ఆ. ౨.

ఉ. భూసురకోటి వచ్చుటకు భూపతి యాత్మఁ గలంగి దానమున్
జేసితి మున్ను వీరలకు జేయులు గావునఁ దప్పినన్ విప
ర్యాసముఁ బ్రత్యవాయమును రాఁగల దిచ్చిన విత్తహీనమా
మోసము వచ్చె నెట్లనుచు మో మొకయించుక వంచె నంతలోన్. —ఆ. ౨.

## కృష్ణదాసకవి

ఇతఁడు రాధాకృష్ణవిలాస మనుపేర జయదేవవిరచితమైన గీతగోవిందమును మూఁడాశ్వాసముల కావ్యమునుగా రచియించెను. ఈతనితండ్రి వేంకటదాసుఁడు. ఈతఁడు శూద్రకులజుఁడని తోఁచుచున్నది. అయినను కవిత్వము హృద్యముగానే యున్నది. రాధాకృష్ణవిలాసములోని మూఁడుపద్యము లనిం దుదాహరించుచున్నాను—

చ. అలఘుభుజాబలంబులు నొయారము లన్యసమానసాహసం
బులు నెర వైనసాదనలు పోటరిపంతము లేకవీరతల్
చలమరితెంపులున్ జవవిలంఘనముల్ విలసన్నియుద్ధతుల్
గలిగినకాల్బలంబు కటకంబున దంబున నొప్పు నెప్పుడున్ —ఆ. ౧.

ఉ. కూరిమి చేయుదిక్పతులకోరిక లీరిక లెత్త రావణో
దారశిరంబులం దునిమి దద్దిశలన్ బలిపెట్టి సర్వభూ
భార మడంచి మౌనిజనభావనల న్విహరించినట్టిదు
ర్వారబలాభిరామ ధృతరాఘవరూప నినున్ భజించెదన్.—ఆ. ౨.

ఉ. ధ్యానము చేతఁ జూచెద సుధానిధితోఁ బ్రతివచ్చునట్టి రా
ధానన మిప్డు కోపజనితారుణమై కడువంకలై బొమల్
పైఁమరంగ శోణకమలంబునఁ ద్రిమ్మరునంచరీకసం
తానరమావిలాసములు తానొక్కఁడనియ్యుండక మాననేర్చునే.—ఆ. ౩.

## చెన్నూరి-శోభనాద్రి.

ఇతఁడు బిల్హణునికథను శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయ మనుపేరను నాలుగాశ్వాసముల ప్రబంధముగా రచించి గుమ్మనపు పాపన్నవతి కంకితము చేసెను. కృతిపతిగాని కృతికర్తగాని యెప్పు డుండినవారో తెలిసినదికాదు. కృతిపతి పద్మనాయకకులసంభవుఁడయి గుళ్ళపాటి పురాధీశ్వరుఁ డయిన జగ్గనప్రభుని కుమారుఁడు; కృతికర్తయాఱువేలనియోగియైన చెన్నూరి రామచంద్రుని కుమారుఁడు. కవిత్వము ప్రౌఢముగా నున్నది. శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయ మనెడి యీ యామినీపూర్ణతిలకకథనుండి రెండుమూఁడుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. చక్కనివాఁడు మాటలకు జాణ కళాగమసాహితీగుణం
దక్కట బిల్హణుం డిగనియుందను చూచిన మందయాన ల
మ్మక్కయటంచు భర్తలను మాని పయింబడివచ్చి నిచ్చలుం
జొక్కకయుందురే రతులఁ జొప్పడునే మన కీతఁ డుండినన్.—ఆ. ౨.

ఉ. అంధుఁడు బిల్హణుండు తెరచాటున నుండి నీవు స
ద్గ్రంథము లన్నియుం జదువఁగావలె నీతఁడు బుద్ధిమంతవా
లంధయసార్వభౌముఁ డని తండ్రి విధించిన నమ్మియుంటి జా
త్యంధుఁడయౌని యీతఁడు సుధాంశునిఁ గాంచను శక్తుఁ డెట్టులో?—ఆ. ౩.

మ. నయా రాజకుమారుల న్విడిచి విద్యాంశున్ గ్రహింపంగ నీ
మన సెట్లొప్పెను రాజకన్యవుగదా మర్యాదయా నా ధరన్
వినవే పెద్దలు చెప్పుచుందురుగదా విద్వత్సుదారిద్ర్యతా
అని తద్వాక్యము వ్యర్థమయ్యెనుగదా హా యేమిచేయందగున్.

## కోటీశ్వరుఁడు.

ఈకవి భోజకన్యాపరిణయమనెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఈతనిది రసవంతమైన కవిత్వమే కాని యందందు వ్యాకరణవిరుద్ధము లయిన ప్రయోగములు కానఁబడుచున్నవి. భోజకన్యాపరిణయమునందు రుక్మిణికిఁ గృష్ణునితోడి వివాహకథ చెప్పఁబడియున్నది. కవి నియోగిబ్రాహ్మణుఁడు; చక్రప్పకును మంగమ్మకును నందనుఁడు. ఈతనికాలము మొదలయినవానినిగూర్చి యేమియుఁ దెలియదు. ఇతఁడు నూటయేఁబది సంవత్సరములక్రిందట నుండియుండవచ్చును. ఈతని ప్రబంధములోని యొక్కొక్క యాశ్వాసమునుండి యొక్కొక్క పద్యము నిందుఁ బ్రదర్శించుచున్నాను—

ఉ. కోమలి యోర్తు చందనము కుంకుముతోడ నగూర్చి యంత న
త్తామరసాక్షుమై నలఁదఁ దద్దయు నొప్పె మనోహరాకృతిన్
సోముఁడు నీరజాప్తుఁడును జోడ్కలయందు వసించియుండుటన్
గోముచెఁ గూడి యాతపము గ్రమ్మి వెలింగెడు నంద మొందుచున్.—ఆ. ౧.

మ. జనభీతిప్రదఘోషపంకజననస్ఫారాయశశ్రీప్రాప్తిపో
వనరాశిం దప మొంది శంఖముకలస్వానామృతౌఘంబు శో
భనరేఖాత్రయభాసురంబు నయి తద్భామాగళత్వంబు నొం
దిన ముక్తావళి తద్భవత్వమున నెంచెన్ హారవామాకృతిన్.—ఆ. ౨.

మ. అన నబ్జాస్య యనున్ వయస్యలకు నీయబ్జాక్షిఁ గైసేయుమం
చని నే సొమ్ములపెట్టె తెచ్చి మణిభూషానేకము ల్వానఁబో
యిన నొం డేదియుఁ బాటిగామిఁ జెలి యేమే చెల్ల నాసొమ్ము లే
వని ఖండించుచుఁగాని నేర దెలుఁగన్ స్వప్రాప్తకాలోక్త్యున్నతిన్.—ఆ. ౩.

శా. భద్రేభంబులఁ గూల్చి సింహముగతిన్ బ్రత్యర్థిభూపాలురన్
రౌద్రోల్లాసవిలాసము ల్మెఱయఁ బోరన్ గెల్చి నానాదిగ
త్యుద్రశ్రీలకు నాటపట్టుచుఁ బొల్చు న్వాసవుండో యనన్
భద్రాధీశుఁ డితండు చూచితివె శ్రీమద్రాజబింబాననా.—ఆ. ౪.

చ. సురవరదత్తమండనవిశోభితుఁడై హరి యిట్లు రుక్మిణీ
పరిణయకాంక్ష నుండుటయు భానుఁడు కన్గొని తాను నట్లయా
హరికి ననర్ఘరత్నములు సర్వము చేయఁదలంచియో యనన్
బరువడిఁ బశ్చిమాంబునిధిపారమున న్నిలిచెన్ త్వరాదృతిన్.—ఆ. ౫.

## చల్లపిల్ల-నరసకవి.

ఇతఁడు యామినీపూర్ణతిలకావిలాసమను పేరిటో బిల్హణచరిత్రము నాలాశ్వాసముల శృంగారకావ్యముగా రచియించినకవి. ఈతనికావ్యము పూర్వోక్తమయినబిల్హణీయముకంటె మిక్కిలి రమణీయముగా నుండును. ఈకవి వైదికబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భారద్వాజసగోత్రుఁడు; కామకవి పుత్రుఁడు. ఈకవి తాను గొంతకాలముక్రిందట మృతుఁడయిన పిఠాపురపురాజుగారి పితామహుఁడగు శ్రీరావు నీలాద్రిరాయనింగారి కాలములోఁ దదాస్థానములోని కడియమను గ్రామమున నుండినట్టు యామినీపూర్ణతిలకావిలాసములో నీక్రిందిపద్యమునఁ జెప్పికొనియున్నాఁడు—

సీ. త్రిభువనపూతకృతిక్రియగల్గు గౌతమీతీరవితీర్ణధాత్రీప్రసిద్ధ
తరమైనకంకణపురవరసంస్థానభూమిఁ జెందినవాఁడ భూసురుండ
శ్రీరామనామమంత్రారాధనపరుండ సకలవిద్వన్మహాజనహితుండఁ
బూజ్యతరప్రాజ్యరాజ్యసత్పీఠికాపురవరసామ్రాజ్యపరివృఢుండు
విమలరేచర్లగోత్రపవిత్రమూర్తి। రావు వేంకటనీలాద్రిరాయనృపతి
చేత సత్కృతి నొంది ప్రసిద్ధి నొందు। నట్టి నరసయనామవిఖ్యాతయశుఁడ.

కడియమనెడి యీగ్రామము రాజమహేంద్రవరమునకు మూఁడుక్రోసులదూరమున కాకినాడకాలువయొడ్డున నున్నది. శ్రీరావు వేంకటనీలాద్రిరాయనింగారు నూఱుసంవత్సరములక్రిందట నుండినవారై నందున నాతనికాలములో నుండిన కవియు దాదాపుగా నూఱుసంవత్సరములక్రిందటివాఁడు. ఈయనకవిత్వము రసవంతమయి ప్రౌఢముగా నున్నది. ఈయన కవనరీతి దెలుపుటకయి యామినీపూర్ణతిలకావిలాసములోని కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. నిరుపమసాహసాతిశయనిర్భరదుర్భరవైరివీరసం
హరణరణోత్సవోచితవిహారమహారథికప్రదత్తస
త్పరిణయకార్యధుర్యతరభాణధణంధణనాదఘంటికా
నుగమితగర్జనీజనమనోరథముల్ రథము లుప్పొంగంబునన్.— ఆ. ౧.

చ. ఘనకబరీస్తనాకృతులు కంధరమై ధరమై నగమైక్యమై
చను నొగిఁ గంరవక్త్రములు సాదరమా దరమా రమాకమా
దినుసుగ వాగ్ముఖాంగములు తేనెలతో నెలతో లతోక్తితో
నెనయుగు నాభిజంఘగతి హేమకరిన్ మకరిన్ గరిన్నగున్.— ఆ. ౨.

ఉ. అమ్మకచెల్ల! చెల్లదగు నల్లికబల్లికమాటలాడి చి
త్రమ్ముగ బన్ని నన్నిటులు దారిచి మీరుపు దండ తొంకకై
గమ్మని గేలిసేయ నొడిగట్టితి రమ్మ యిఁకేమి మాటలన్
నమ్మఁగరాదు విమ్మనుచు నర్మిలి వేత్రకతీరు మీటిరన్.—ఆ. ౩.

చ. కలువ లెసంగఁ దామరలు కందిముడుంగ దెసల్వెలుంగ వె
న్నెలలు చెలంగ జక్కవలు నెక్కొని సేగి మునుంగఁ జీఁకటుల్
బలిమి నడంగ వేగ మరుఁ బ్రాయపువారలడెంద మందమై
పొలుపలరంగ వారినిధిఁ బొంగఁగఁజేయుచు రాజు రాజిలెన్.—ఆ. ౪.

శా. స్వామీ నేరము లేదు నావలన నీసర్వంబు నీకృత్రిమ
స్తోమంబు న్ననుఁ భ్రాంతి ముంప సమయానుష్ఠాత్రిన్ మదీయానన
ద్మేమాలోకనబద్ధకాండపటరాజిం గూర్చి తేఁ గాదె మ
త్ప్రేమానందకరాశయగ్రహణకారిప్రాప్తిగ మున్నుగన్.—ఆ. ౫.

ఉ. రాముశరప్రయోగము సురప్రభువజ్రము చక్రిచక్రమున్
ధామనిధిప్రియాత్మజునిదండము కామరిపుత్రిశూలమున్
భూమి నొకప్డు రిత్త యయిపోయెఁ బోవుఁగాక యీశివ
స్వాములవాక్ప్రయోగము బ్రహ్మకునైనఁ దరంబె త్రిప్పఁగన్.



## అయ్యగారి - వీరభద్రకవి.



ఈకవి రాఘవయాదవపాండవీయ మను మూడాశ్వాసముల త్ర్యర్థికావ్యమును రచియించెను. ఈతఁ డారువేలనియోగి యైనశైవుఁడు; కౌండిన్యగోత్రుఁడు; సోమనారాధ్యపుత్రుఁడు. ఈతఁ డేకాలమునం దుండినవాఁడో నిశ్చయముగాఁ దెలియరాదు. ఇతఁడు నూఱు నూటయేఁబది సంవత్సరముల క్రిందట నుండియుండవచ్చును. మూఁడర్థములు గల పద్యమునుబట్టి కవననైపుణి యిట్టిదని చెప్పుటకు వలనుపడదు. ఇట్టికవిత్వరచనయే కష్టము. అయినను గవి యవతారికలోఁ జెప్పిన

ఉ. హారికిరీంద్రవిగ్రహవిహారికి నాశ్రితబృందదుఃఖసం
హారికి ధూర్తదేవరిపుహారికిఁ గౌస్తుభసజ్జ్వలన్మణీ
హారికి హస్తపద్మగమహారికి సాగరబాలికామనో
హారికి వాహనస్ఫణవహారికి శౌరికిఁ గేలు మోడ్చెదన్.

సీ. నిండుచందురుఁడాలు నీటుకేలఁగఁజాలు మొగముపైఁ జెఱునవ్వు మొలకలాడఁ
దలిముత్తెములమించు తేటమాటాడించు నెలకూనయును దలఁ దళుకు లీనఁ
గొదమగుమ్మెదబారు నదలించితనరారు కడచూపు లక్కటికంబు నించ
జోడుగేదఁ తెల్పు సొగసుకత్తుకనల్పు మేవన్నెలకు వింతమిసిమి నొసఁగ
నలువ మొనలైనవారు తన్గొలిచిరాఁగ । గిబ్బ బాబాపయింబొల్చియబ్బురముగ
నెలమి చెన్నారఁగా వాఁగులకుగానఁ । బడియొనుక్కంటికన్నులపండువుగను.

ఇత్యాదిపద్యములనుబట్టి చూడఁగా నితఁ డాంధ్రగీర్వాణపదబహుళముగా మంచికవిత్వము చెప్పఁగలవాఁ డనియే తోఁచుచున్నది. ఈతనిగ్రంథములోనివి కొన్నిపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి.

శా. నానారత్నవిభూషితాఖిలజనానందదానుసంధాయిశ్ర్యం
గానూనంబులు చారుగంధనుమ శ్రీప్రాంచన్మహాపాదపా
లీనవ్యంబులు సద్వ్యపాళిగతముల్ లీలార్ధగోత్రాళు లెం
తో నేత్రోత్సవస బు నా పఁ జెలుగొందుం దత్పురం బందునన్.—ఆ. ౧.

ఉ. ప్రాంచితకీర్తి రాముఁ డు పాశగజాతుఁడు కృష్ణమూర్తి దా
మించినవేడ్క నంప జట మీఱఁగఁ గెంచి విరాధరాజితో
దంచదనూ లీలల నుదాత్తముగా యవనాశ్రము న్నతు
గ్గాంచుచు నింద్రకీలధరాలితదీప్తి నతండు భాసిలన్.—ఆ. ౨.

ఉ. రాముని ధర్మరాజు రణరంగవిరాజితు నచ్యుతప్రభున్
సీమకు మర్త్యగాఁ దలఁచి నీతివిహీనతఁ బోరఁబోకుమీ
సామము మేలు తద్విభుఁడు శస్త్రబలంబున మేటి భూమిలోఁ
గామిని రత్నయుక్తముగఁ గ్రక్కున నిచ్చి కులంబుఁ బ్రోవుమా.—ఆ. ౩.

## మట్టు ప్రభువు.

ఇతఁడు సురాభాండేశ్వరము, కుచేలోపాఖ్యానము, యాజ్ఞవల్క్యచరిత్రము, అను మూఁడుపద్యకావ్యములను రచియించెను. ఇతఁ డెల్లామాత్యునిపుత్రుఁడు. ఈ కవి యాజ్ఞవల్క్య నియోగిబ్రాహ్మణుఁడయినట్టు కనఁబడుచున్నాఁడు. ఇతఁడు కుచేలోపాఖ్యానములోఁ దన్నుఁగూర్చి యిట్లు వ్రాసికొనియున్నాఁడు:—

సీ. భ్రమరాంబికావరప్రభవదివ్యకవిత్వవిద్యాప్రవీణత వెలసినాఁడ
ఘటికాశతగ్రంథఘటనాసమంచితచాతుర్యమహిమకుఁ జాలినాఁడ,

ప్రౌఢిమ నేకకపత్నమానమహాప్రబంధకల్పనశక్తిఁ బ్రబలినాఁడ
మతియు నాలుగు చిత్రమాధుర్యవాక్యప్రగల్భనంబున నుతు ల్గాంచినాఁడ
శ్రీకుధరమల్లికార్జున శ్రీపదాబ్జ మత్తభృంగాయమాన సన్మానసుండ
నక్కవీశ్వరకరుణాప్రసాదవశుఁడ! ఘట్టుప్రభునామధేయ విఖ్యాతయశుఁడ.

ఈకవి నెల్లూరిమండలములోనివాఁడయినట్టును, అప్పటికి ఎనఁబది సంవత్సరముల క్రిందట నుండినట్టును, నెల్లూరిమండలచరిత్రమునందు వ్రాయఁబడియున్నది. కాఁబట్టి కవి యిప్పటికి నూఱుసంవత్సరములక్రిందట నుండినవాఁడు. ఇతనికవిత్వ మంతగా నిర్దుష్టమయినదియు ప్రౌఢమయినదనియుఁ గాకపోయినను, మంచి లోకోక్తులతోను న్యాయములతోను నిండియుండి ద్రాక్షాపాకమున జదువువారి కింపుగానుండును. ఇతఁడు రచియించిన యాజ్ఞవల్క్యచరిత్రము ప్రస్తుతమున నావద్ద లేదు. తక్కిన గ్రంథములనుండి కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

కుచేలోపాఖ్యానము.

శా. చిత్రం బెన్నఁగఁ జిన్ననాఁడె తనయుల్ శిష్యానుగుణ్యుల్ తుదన్
బాత్రు ల్గారలిదండకార్యములకున్ బ్రాయంపువారైన ని
ద్ధాత్రిం జుట్టములట్లు చూడవలదా తండ్రు ల్తనూజాతులన్
బుత్రం మిత్రవదాచరే త్తనుచు నేప్రౌఢుల్ ప్రముఖు ల్పాటిఁగన్.—ఆ. ౧.

ఉ. కామితవస్తుజాతములు గల్గి దయాపరులైనపుణ్యులన్
బ్రామతి నిచ్చి పుచ్చుకొనుభావము సందలపోయఁ డెంతయున్
గ్రామము క్రొత్తదైనఁ దనకర్మము క్రొత్తయె పెక్కుమాటలిం
కేమి యదృష్టహీనునకు నెచ్చటి కేగినఁ గల్గునే సిరుల్.—ఆ. ౨.

ఉ. అన్నము లేకయుండిన లఘుంబగు దేహము రక్తమాంసముల్
సున్నగు నింద్రియస్ఫురణ సుక్కు మదాళియుంబు దూరమౌ
నన్నులమిండ్రిప్రేమ చెడు నచ్యుత నీపయి నిల్పుమానసం
బెన్నటికైన జ్ఞానులకు హెచ్చు దరిద్రతసాటియే సిరుల్.—ఆ. 3.

సురాభాండేశ్వరము.

చ. తవిలినమోహపాశమున దైన్యముఁ బూని మనోవ్యథం గడుం
దివురుచు విన్ననై యవనిదేవుఁడు ప్రార్థనచేసి మొఱ్ఱకఁగా
నువిదయుఁ జేరికిం గొనక యూరక యేగను నిర్దయాత్మయై
శివశివ మిక్కిలిం గఠినచిత్తులుగారె లతాంగు లిమ్మహిన్.

చ. పరమవివేకశీలుఁడవు బాపఁడ వుత్తమవంశజుండ వీ
వెఱుఁగవె యొండ్లభూమితల నీగతిఁ గోరుట ధర్మమే మహా
దురితము లైనపట్లఁ గడుదూరముగా నెడలించి పోవుమా
మఱచుట ధర్మ మండ్రు మతిమంతులు వేదపురాణసమ్మతిన్.

## ముప్పిరాల-సుబ్బరాయకవి.

ఇతఁడు కృష్ణాభ్యుదయమనెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచియించి చిక్కాల శేషయామాత్యున కంకితము చేసెను. ఆగ్రంథమునఁ గవి తన్నుఁగూర్చి యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

మ. నను శ్రీనాథకథాసుధారససరిన్నాథాగ్రయోషాంబుగా
మానదూరీకృతసర్వకల్మషు మహాయాస్యానుగ్రహప్రాప్తసా
రనిరాఘాటనితాంతశోభికవితారాజ్యాన్వితున్ సత్సుధీ
జనసంతానవిధేయుఁ జూచి పలికెన్ సంతోష ముప్పొంగఁగన్.

సీ. అతిశయోత్ప్రేక్షోపమాద్యలంకారముల్ గొలఁకంగ ముద్దులు గులుకుఫణితిఁ
బద్యకావ్యముగాఁగఁ బ్రద్యుమ్నచరితంబు రసికు లౌననఁగను రచనచేసి
తలయుచు ద్విపదగా వెలయు సావిత్రిచరిత్ర యొనర్చితి చిత్రలీల
భద్రాద్రిఁ దగు రామభద్రునిపై నొక్క శతకంబుఁ జేసితి చతురఫణితి
నేరయుడ నరస్తుతులు నీవుసేయ వైన! భ్రాతృవాత్సల్యమెసఁగఁ బ్రబంధమొకటి
చెప్పి నా కంకితంబుగఁ జేయుమిపుడు! సుకవినుతగుణసముదాయ సుబ్బరాయ

పయిపద్యములనుబట్టి యీకవి ప్రద్యుమ్నచరిత్రమును సావిత్రీచరిత్రమును భద్రాద్రిరామశతకమునుగూడ రచియించినట్లు తెలియవచ్చుచున్నది. ఈకవి యెప్పటివాఁడో తెలియరాలేదుగాని నూఱుసంవత్సరములకంటెఁ బూర్వపువాఁడు. ఈతని కవనము మృదువయి మధురముగా నున్నది. కృష్ణాభ్యుదయములోని కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను —

ఉ. సంతుమదాదిగంధయుతసారసమీరము మీఁతిశీవఁగాఁ
గంకణఝుంకృతు ల్వెలయఁగా సురసుందరు లొయ్య నొయ్యనన్
బొంకములాఱ మాఁపఁగను భోగికులాధిపడోలికన్ రమా
పంకజగంధిఁ గూడుకొని బంధురహర్మ్యతరంగితాత్ముఁడై. — ఆ. ౧.

చ. విను చెలి జోడుకోడెలగు వేఁడివెలుంగును రేవెలుంగునున్
వనజదళాయతాక్షునకు వారిరుహాసనుఁ డింపొనర్పఁగాఁ
గనుఁగవఁ జేయ నాసయును కాంచనపుష్పము నాశ్రయించి నా
రనిశము పుష్పవంతు లను నాఖ్య వహించిరి ముజ్జగంబులన్.—ఆ. 3.

ఉ. మారశరాళికిన్ మలయమారుతపాళికి మంజులాళికిన్
మీఱుమరాళికిన్ జిగురుమెక్కెడునీలిగళాళికిన్ శశాం
కోరుకరాగ్రకేళికి మయూరకదంబము కేళికిన్ సితాం
భోరుహనేత్ర కుంది తలపోయఁ దొడంగె మనంబులోపలన్.—ఆ. ౪.

చ. కొనియెద రుక్మిణీసతిని గోపవధూవిటుఁ డడ్డమైన మా
ర్కొనియెద మద్భుజాబల మకుంఠితమైనఁగ నెల్లి మీఱ క
న్గొనియెద రంచు బంధుజనకోటికిఁ దెల్పుచుఁ జైద్యుఁ డంతటన్
గని యెదురైనవారు నగఁ గ్రక్కున వచ్చె నృపాలువీటికిన్.—ఆ ౫.

## ప్రయాగ-కామేశ్వరకవి.

ఇతఁడు గోపాలలీలాసుధాలహరి యను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచియించి రామతీర్థస్వామి కంకితము చేసెను. ఈకవి విశాఖపట్టణమండలపువాఁడు; వైదికబ్రాహ్మణుఁడు; కౌశికగోత్రుఁడు; నారసింహపౌత్రుఁడు; సర్వేశ్వరపుత్రుఁడు. ఇతఁడు నూఱుసంవత్సరముల క్రిందట నుండినవాఁడు. కవిత్వము మంచిదేయైనను శృంగారవర్ణన మితఁడు మిక్కిలి పచ్చిగాఁ జేసినందునఁ బుస్తక మిప్పటివారు చదువుట కంతగా యోగ్యమయినది కాదు. ఈప్రబంధమునుండి రెండుపద్యముల నిందుదాహరించుచున్నాను—

ఉ. దుండగ మేలచేసెదవు తోయజసాయక దండనిల్చి కో
దండము డించి మాచెలికి దండము పెట్టుము రెండుకన్నులన్
నిండిననీరు దోయిటను నించి శపించుఁ దదశ్రువారినిన్
దండనచేయుఫాలశిఖితండ్రిసుమీ కడుశిక్ష చేయఁగన్.—ఆ. ౨.

మ. యమునాతోయము దోయిటం గొని సముద్యల్లీల వేఱొక్క భా
మముఖాబ్జంబునఁ జల్ల నాచెలఁతయున్ స్మార్తోము గావించుచో
దుమికెం దుమ్మెదచాలు ఫుల్లనవపాథోజంబుపై నాఁగ శ
క్రమణీరోచులనీనుకొప్పు విడి వేగం గ్రమ్మెఁ దద్వక్త్రమున్.—ఆ.3.

## అనంతనార్యుఁడు.

ఈకవి గాధేయోపాఖ్యానమును నేకాశ్వాసశృంగారప్రబంధమును రచియించి కామాంబకును జిన్నప్రభుకును బుత్రుఁడగు కృష్ణభూపాలుని కంకితము చేసెను. ఇతఁడు తాళవలింగకవికుమారుఁడు. ఈకవినిగూర్చియు నీతనికాలమునగూర్చియు మఱేమియుఁ దెలియరాలేదు. ఇతఁడు నూఱేండ్లకు లోపలివాఁడుకాఁడు. ఈతని కవిత్వము హృద్యమయి యనవద్యమయియున్నది. కవితామాధుర్యమును జూపుటకై గాధేయోపాఖ్యానములోనిపద్యముల రెంటి నిందుక్రిందఁ బొందుపఱుచుచున్నాను—

ఉ. మానక యింతవంత దరమా సురమాన్యపదంబుగన్న మ
న్నీని కిదేల పట్టివగ నీకృపచే వగ నేవగ న్జగ
న్మానితతత్తపోమహిమ మానప నాదవిలాసమోవు నీ
పూనిక మాపు నాపయిని మోపు వెత న్విడుమోపురంకరా.

చ. చిలుకలకు న్వచోగురుతఁ జెందుచు సప్తవిధస్వరంబులన్
బలుమఱుఁ దేనియ ల్గులుకఁ బాడెడునీలలితాంగిఁ జూచి లో
కులు మఱి కీరవాణియును గోకిలవాణియు నంగఁ దోఁచ చి
ల్కలు మఱి రామరామ యనఁ గన్నులఁ గెంపు వహించుఁ గోవిలల్.

## భైరవకవి

ఇతఁడు రత్నశాస్త్రమును తెనుఁగునఁ బద్యకావ్యమునుగా రచియించెను. ఇతఁడు గౌరనసుతుఁడు. ఇతఁడు భ్రమరాంబికావరప్రసాదముచేతఁ దనకుఁ గవిత్వము వచ్చినట్టు క్రిందిపద్యములలోఁ జెప్పుకొనియుండుటచేత కర్నూలుమండలములోనివాఁ డయినట్టు తోఁచుచున్నది—

క. తన్నుఁ బ్రియమార వేఁడినఁ। మున్ను మునీంద్రుల కగస్త్యముని చెప్పిన యా
సన్నుతమణిలక్షణములు। చెన్నుగఁ గ్రోడీకరించి చెప్పెదఁ దెలియన్.

క. భ్రమరాంబికామహావర। సముచితనిరవద్యహృద్యసాహిత్యకళా
శ్రమవిమలప్రతిభాసం। క్రమణుఁడ మతిశాలి నైన గౌరనసుతుఁడన్

„భైరవుఁడ నుభయభాషాపరీణుఁడ” నని కవియే తనకు సంస్కృతాంధ్రభాషాద్వయపాండిత్యము కలదని చెప్పుకొనెను. ఈతనికవిత్వము మొత్తముమీఁద చక్కఁగానే యున్నది. రత్నశాస్త్రములోని రెండుపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి.

ఉ. నీరదము ల్దిగంతములనిండి తటిద్ఘనగర్జితంబు లిం
పారఁ మహోగ్రవృష్టికురియం బ్రభవించు నింతాతకాంతితో
నారయఁ గుక్కుటాండసమమైపడుమత్త్యము లంతరిక్షసం
చారులు పట్టుకొందురు వెసన్ వసుధం బడకుండ నేర్పునన్.

ఉ. చేత ధరింప మానవులచెంతను జేరవు భూతకోటు లే
రీతిని దుష్టవిద్య లొనరించిన నెక్కువు క్రూరజీవముల్
ఘాతలు సేయలేవు సతిగర్భముమోప సుఖప్రసూతియౌ
నాతతభాతితోఁ బ్రతిదినంబును బ్రీతి యొనర్పఁ గేతువన్.

## అనముగుర్తి రంగయ్య.

ఇతఁడు యాదవగిరిమాహాత్మ్య మనెడి యైదాశ్వాసముల పద్యకావ్యమును రచియించెను. ఇతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు; తిమ్మయామాత్య తనూభవుఁడు. ఈకవి తనగ్రంథమును రావూరి వేంగామాత్యున కంకితము చేసెను. కవి యెప్పటివాఁడో సరిగా తెలియదు గాని నూఱుసంవత్సరములకుఁ బూర్వపువాఁ డనుటకు సందేహము లేదు ఈతనికవిత్వము శ్రావ్యముగానే యున్నది. యాదవగిరి మాహాత్మ్యములోని రెండుమూడుపద్యముల నిం దుదాహరించుచున్నాను.—

చ. పిసుగులఁబోలు నెండసెగఁ బెట్టి పైరులు వాడిపోయినన్
మడిమడిఁ దప్ప నేతములు నాటుచు; బావులు త్రవ్వి కారుపై
రిడి యొకకొన్ని బాన లటు లెత్తుచు గాడ్పులదూలి సారనీ
రెడలినఁ జూచి యెక్కటడి యిత్తురు హాలికు లశ్రుధారలన్.—ఆ ౩.

చ. బెళఁకులు నేర్పఁ జూపు తిరు వెల్లు లపారగఁ జల్లె మేనిడాల్
కెలఁకులఁ జూడఁజూడఁ బెనఁగెం జనుఁబూపలు సిగ్గుదేరఁ జే
కృలికవ సన్నమూలువడి కన్నడు మెక్కడనుండివచ్చెనో
చెలు లొకనాఁడు కేరుపనిసిగ్గు వధూటికి నాఁడు నాటికిన్.—ఆ. ౪.

ఉ. వాలికచాగు వేఁగుజడ వారిపయింబడి తేలియాడుచున్
వ్రాలఁగ, నీలహంస మని వారిరుహంబని డాయ, నొక్క ప్రో
యాలి మెఱుంగుమో మమరె నవ్వల నివ్వల రాహుకేతువుల్
బాలిని డాయ వారియెడఁబ్బ్వనపగ్వసుధాంశుఁడో యనన్.—ఆ. ౫

## తామరపల్లి-తిమ్మయ్య

ఇతఁడు శేషధర్మమనెడి యైదాశ్వాసముల పద్యకావ్యమును రచియించి శ్రీరామాంకితముచేసెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; పరణయామాత్యునిపుత్రుఁడు. ఇతఁడుండినకాలమేదో తెలియదు. నూఱుసంవత్సరముల క్రిందట నుండియుండును. ఇతనికావ్యమునం దపప్రయోగములు కొన్నిగలవుగాని కవిత్వము మొత్తముమీఁద చక్కనిధారకలదయి శ్రావ్యముగా నుండును. ఈతనిశేషధర్మములలోని కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. తోడికులాంగన ల్మణులతోఁ గనకంబులతోడ వెండితో
వాడలవాడలన్ సిఁకి వస్త్రలు వెట్టుచు నాథపుత్రులం
గూడి సుఖింపఁగా మనము కూటికిఁ గూరకుఁ జిక్కి బిడ్డల
ల్గాడఁగ నెల్లకాలము మహాత్మ కనుంగొనుచుండ శక్యమే —ఆ. ౧.

మ. మును పోషించినపుత్రమిత్రవనితాముఖ్యుల్ స్వకార్యంబులం
జని యొందేఁ జన వాంఛ జపతపస్స్వాధ్యాయము ల్బాసి దు
ర్జనులం గూడి పరాపకారనియతిం బ్రౌఢత్వము ల్చూప నా
పెనుపాపంబున గర్భవేదనలు పైపెట్టుకొన్న నెట్లేగుదన్.—ఆ. ౩.

ఉ. అక్కడనున్నయాపశుమృగాదులు తావకపాదపద్మముల్
దిక్కని ముక్తికామినికి దీవన లిచ్చు సుపర్వ లింతయున్
నిక్కమ యిగ్గిరీంద్రమున నిల్వఁగవచ్చును బణ్యశాలికిన్
గక్కసమౌ మహాదురితకర్ములకున్ వసియింప నిచ్చటన్ —ఆ. ౫.



## నారన సూరన.



ఇతఁడు వనమాలివిలాసమను కావ్యమునుజేసి, కొండూరి యక్కదండనాథుని కంకితముచేసెను. నావద్దనున్న యీగ్రంథముయొక్క ప్రతి యసమగ్రమయినది; అవతారిక లేదు. కృతిపతిమంత్రియు దండనాథుఁడునయి యజ్ఞముచేసిన నియోగిబ్రాహ్మణుఁడు. కవినారనామాత్యుని కుమారుఁడైన నియోగివిప్రుఁడు. ఇతఁ డాధునికుఁడని చెప్పుటకుఁ గవికాలనిర్ధారణముచేయుటకుఁ బుస్తకమునం దాధారమేదియుఁ జిక్కలేదు. ఈతని కవిత్వము సలక్షణమయి మృదువుగానున్నది. వనమాలివిలాస

ములోని కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. గొజ్జఁగినీరుపోసి పసుపూర్చి సుచందనవాసిఁదోఁచి లా
మజ్జకతాళవృంతముల మాటికిఁ ద్రిప్పఁగ రాలుశీకరం
బజ్జలజాక్షుచెక్కిళులయందుఁ దనర్చె ముఖేందుసుజ్వరం
బుజ్జ చేతఁ గూడఁబడియున్న యుడుప్రకరంబుచాడ్పునన్.—ఆ. ౧.

చ. మెఱయు కపోలపాళికలమీఁదఁ జలత్కణికుండలద్యుతుల్
గిఱికొన ఫాలభాగమునఁ గ్రించి దుదంచితనర్తనంబులై
కొఱికురు లింపుచేయఁ గమనీయవిలోచన లూఁచి రావలల్
కొఱలి భవద్యశోమహిమ కోనలి మాటికిఁ జెప్పుచుండఁగన్—ఆ. ౨.

చ. కలమధురంబులైన కలకంఠివచోరచనాగుంభనం
బులు విని సిగ్గునం బలుకుపూనిక లెల్లను బోవడించి మూఁ
గలవలె నోళ్లు మూసికొని కాననసీమలఁ జేరియున్న కో
కిలముల బుజ్జగించి పలికించు మధూదయమాత్రసంగతిన్.—ఆ ౩.

ఉ. తొల్లియు మోసపోయితివి తోయరుహానన పెక్కుమాఱు లో
చెల్ల మదీయధూర్తసఖులచేతనె యిప్పుడు నమ్మి కానె నీ
యుల్లము సారెసెత్తు లిడుచున్నది యీక్రియ నాఁడు మంచు నా
కల్లకథాంబు లింతటివి గాఁ దలపోయు నరాళకుంతలా.—ఆ. ౪



## పోడూరి పెదరామామాత్యుఁడు.



ఇతఁడు ఆఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శివరామమంత్రికిని సీతమాంబకును బుత్రుఁడు. ఇతఁడు శివరామాభ్యుదయ మను ద్వ్యర్థికావ్యమును రచించెను. ఇతఁ డీగ్రంథమును గురజాల వీరయార్యుని ప్రేరణమునఁ జేసెను. కవి కృతిప్రేరకుని తన గ్రంథమునందు

సీ. ఏమంత్రితిలకుఁ బూర్వుఁ డిలఁ జమత్కారభారత మొనర్చె శ్రీరంగరాజనాముఁ
డేమంత్రిముఖ్యుతాత యామల్లయజ్వ దాక్షాయణీపరిణయగ్రంథమందె
యేమంత్రితాత యజ్ఞామాత్యుఁ డొనరించె సప్తసంతానముల్ సరవితోడ
నేమంత్రిపిత పార్వతీశ్వరుఁ డాపదుదాత్తుఁడై పద్యగద్యంబు లంద
నట్టిగురజాలకులకలశాబ్ధిసోముఁడు। రసికుఁ డివటూరిమల్లనారాధ్యశిష్యుఁ
డభవపూజాధురంధరుఁ డైన పేరనఘుఁడు సాంఖ్యాయనసగోత్రుఁ డైనయతనియాజ్ఞ,

ఇట్లు వర్ణించి, అతఁడు తన్నుఁగూర్చి పలికినట్లుగా నీక్రిందిపద్యములను జెప్పికొని యున్నాఁడు.—

సీ. అనఘభారద్వాజమునిగోత్రజాతు నాపస్తంబసూత్రుఁ బ్రశస్తచరితు
ఘనునిఁ బోడూరి వేంకటమంత్రివరునప్త మహితధీబాపయమంత్రి పౌత్రు
శివరామమంత్రికి సీతమాంబకు సూనులై మించు బాపార్య రామ రా
ఘవులమువ్వురిలోన గణన కెక్కినపెదరామకవీంద్రు శ్రీరమ్యచరితుఁ
జిత్రయమకాంధ్రసంస్కృతశ్లేషకవిత । రచనసేయంగ నేర్చి భారతికరుణను
రాజవిద్వత్సభలయందుఁ బూజితుఁ డగు । నన్నుఁ బిలిపించి పలికెఁ బ్రసన్నఫణితి.

సీ. నీవంశపూర్వధీనిధి కొండకవి చెప్పె భార్గవాభ్యుదయప్రబంధ మెలమి
నీయన్న బాపమంత్రి రచించె నొగి నుషాకన్యకాపరిణయకావ్య మెసఁగ
నీతమ్ముఁ డసమునం దనిరోష్ఠ్యజానకీకళ్యాణకృతి గామకవివరుండు
నీవు ప్రౌఢోక్తిని ర్మించినావు కౌసల్యాపరిణయాది సరసకృతుల
మఱి యుదాహరణాది సుకృతులను । సంస్కృతాంధ్రకవితఁ జెప్పఁజాలినట్టి
ప్రౌఢసత్కవి నీవె ధరాతలమున । గలితగుణగణ్య పెదరామకవివరేణ్య.

ఈ పెదరామకవి సంస్కృతాంధ్రకవులను స్తుతించినపిమ్మట శ్లేషకావ్యములకు మార్గదర్శియైన పింగళి సూరనామాత్యు నిటు పొగడియున్నాఁడు —

ఉ. శ్లిష్టకవిత్వవైఖరివిచిత్రత రాఘవపాండవీయ ము
త్కృష్టముగా రచించి జగదేకనుతుల్గని ధాత్రిలో నవ
ప్రస్థ యనంగఁ బద్మభవసన్నిభుఁడైనమహాకవీశ్వరా
భీష్టసమప్రభావుఁ డగుపింగళిసూరకవీంద్రుఁ గొల్చెదన్.

కావ్యప్రేరకుఁడైన గురుజాల పేరయామాత్యుని యభీష్టప్రకారముగా నీగ్రంథమును గోదావరిమండలములోని యాచంటగ్రామమునందలి రామలింగేశ్వరస్వామికిఁ గంకితము చేయుటచేతనే కవి గోదావరిమండలములోని వాఁడగుట స్పష్టమగుచున్నది. ఈతనికాలము నిశ్చయముగాఁ దెలియరాదుగాని యితఁడు నూఱుసంవత్సరముల క్రిందటివాఁడని తోఁచుచున్నది. ఈతనికవిత్వధార యనర్గళమయి మృదువుగా నున్నది. కవితాధోరణి తేటపడుటకయి శివరామాభ్యుదయములోని రెండుపద్యము లిందుదాహరింపఁబడుచున్నవి.—

చ. తరమె నుతింపఁగా నగణితస్ఫురితాంకతఁ దద్ధరాధినే
త గనికుఁడౌ నసంత వసుధారథుఁ డుగ్రవుగారి భీముఁ డా

ర్వర నుతి కెక్కి-మించె వృషవాహసమాఖ్యుఁ డహీనసద్గుణో
త్కరవరుఁ డాజిభీకరనితాంతపరాక్రమశాలి యానసన్.—అ. ౧.

మ. అలరన్ దత్సుకుమారభానురసహాయుఁ బొప్పఁగాఁ దారకో
జ్జ్వలనామాహితదాసకాంక్ష విబుధాంచద్భృత్యయాదాన నా
కులసత్సంతతిఁ జూడవచ్చె నమితాత్ముం డంపుమీఱంగ మం
జులతారామమహోధ్వరాజితవరాంకు ల్గలునన్వీటికిన్.—అ. ౨.



## రామావఝ్ఝల-కొండుభట్టు.



ఈకవి కపిలగోసంవాద మనుపేర నధ్యాత్మవిద్యాప్రతిపాదకమగు నాల్గాశ్వాసముల పద్యకావ్యమునురచియించి యహోబిలనృసింహస్వామి కంకితముచేసెను. ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు; హరితసగోత్రుఁడు; నరసావధానికిని అక్కమకును పుత్రుఁడు. ఇతఁడించుమించుగా నూఱుసంవత్సరములక్రిందటి వాఁడని తోఁచుచున్నది. ఈతని కవిత్వము మృదువయి నాతికఠినమయి శ్రావ్యముగానున్నది. కపిలగోసంవాదములోని యొక్కొక్క యాశ్వాసమునందలి పద్యము నొక్కొక్కదాని నిం దుదాహరించుచున్నాను—

ఉ. ద్వైతముచే ననిత్యసుతదారధనాద్యఖిలైహికోత్సవ
వ్రాతములందు దైవతనివాససుఖంబులయందు లోలుఁడై
పాతరలాడువారల కపారత నిత్యసుఖాబ్ధిఁదేల నే
భాతి లభించు సద్గురుకృపామహిమం బొడగూడ దేనియున్.—అ. ౧.

శా. ఔనా మీమదులం దనూనతయు యజ్ఞానూనయా దేవిపైఁ బూన మే
మానాతిం జెనకంగఁ జాలుదుమె మీయాలాపము ల్గర్వరా
ద్గానం బోయెద మందు నేమగునొ యం చాదేవదేవోత్తముల్
గానంబోయిరి యమ్మునీంద్రునిసతిన్ గాపట్యవేషంబులన్.—అ. ౨.

శా. వేదాంతార్థసముజ్జ్వలాగ్ని భవసద్విజ్ఞానదీపంబుఁ దా
నాదిన్ మానసహుం గరంగఁగ సముద్యల్లీలమైఁ బూని స
మ్మోదం బొప్పఁగ హృద్గృహాంతరవసన్మోహాంధకారంబు వి
చ్ఛేదంబై చనఁ జొచ్చి యందుఁగలయన్ శేషాహిభూషున్ బరున్.—అ. 3.

ఉ. ఆపరమేశ్వరుండు సకలాంతరబాహ్యములందు నెల్లఁ దా
వ్యాపకుఁ డౌట లింగమనవందును బింబితుఁ డయ్యె నందుచే

రూపరి జీవుఁడై మిగులమూఢిని గర్తను భోక్తనంచు సం
తాపము నొందుచుండుఁ దనుఁ దాఁ గనలేమిని నెల్లభంగులన్.—ఆ. ౪.

మ. ప్రతిబింబంబు లనంగ దుర్విషయదుష్ప్రజ్ఞావిదుర్వాసనల్
సతతంబున్ మదిలోనఁ బాదుకొన నిశ్చాంచల్యముం బొంద నీ
కితరభ్రాంతులఁ ద్రిప్పుచున్ శ్రవణవాగిత్యాదిసంసర్గసం
గతులం బన్వకొనంగలేనియపియాఁ గౌటిల్యమాలిన్యముల్.—ఆ ౫.

ఉ. చక్కెర పుచ్చకాయవలె సంతనగా నొనరించియుంచ నం
దెక్కడనైనఁ జేఁదు గలదే విను మాత్మయఖండరూపమై
పిక్కటిలంగ వే ఱొకటి భేదము తోఁచునె యెట్లుచూడఁ దా
నొక్కటియొక్కటే నిజము నొక్కటి యున్నదియు న్విచిత్రమే.—ఆ. ౬.

## మా ర య క వి.

ఇతఁడు మైరావణచరిత్రము పద్యకావ్యముగా రచియించెను. ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; సర్వయామాత్యునికుమారుఁడు. అక్కడక్కడ వ్యాకరణదోషములు కానఁబడుచున్నను మొత్తముమీఁద నీతనికవిత్వము మృదువయి మనోహరముగా నున్నది. కవనధోరణి తేటపడుటకయి మైరావణచరిత్రములోని రెండుమూడు పద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. చెప్పఁగరానిమాయల విచిత్రపురూపులు దాల్చి యింక వాఁ
డెప్పుడువచ్చునో యిటకు నేమతియుండినఁ గార్యమంతయుం
దప్పునుగాన రాఘవులు దద్దయుఁ గాంచుకథంబు గొబ్బునన్
జొప్పడఁ జెప్పుఁడీ తెలియ సూనృతవర్తనులార నావుఁడున్ —ఆ. ౧.

ఉ. మారుని మోహనాంబకముమూఁడికని ప్రాణము లైదు నున్న బం
గారపుబొమ్మకీతిఁ దొలుకారుమెఱుంగులప్రోకభంగి శృం
గారరసంబువం దొలఁకఁగట్టి పువ్వులయెత్తురీతి న
న్నీరజగంధివచ్చి తగ నిల్చెను ప్రీతిని భర్తముందటన్.—ఆ. ౧.

చ దనుజ దురాత్మ నీకు నిఁకఁ దస్కరవృత్తినిజొచ్చి మాయలన్
దినకరవంశ్యులం దొడరితెచ్చినపద్ధతిఁ బోవరాదు సా
ఘనతరవాలరోమమునఁ గట్టి జగంబులు మెచ్చ నిన్ను న
య్యనిమిషులెల్ల భీతి నిట కడ్డమువచ్చినఁ గావఁ జంపెదన్.—ఆ. ౨.

## పరశురామపంతుల లింగమూర్తి

ఈకవి సీతారామాంజనేయమనెడు మూడాశ్వాసముల వేదాంతగ్రంథమును రచియించెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; రామమంత్రికిని తిమ్మాంబకును బుత్రుఁడు; మహాదేవయోగి శిష్యుఁడు. ఈగ్రంథము ప్రథమాశ్వాసము తారకయోగమును గూర్చియు, ద్వితీయాశ్వాసము సాంఖ్యయోగమును గూర్చియు, తృతీయాశ్వాసము రాజయోగ మనఁబడెడి యమనస్కయోగమును గూర్చియు, తెలుపును. ఈ సీతారామాంజనేయ సంవాదము బహుజనులచేఁ జదువఁబడెడు జనప్రియ మైనపుస్తకముగా నున్నది. కవిత్వము నిర్దుష్టమయి హృద్యముగా నున్నది. ఈకవి తనపాండిత్య ప్రకటనమునకయి యిట్టి వేదాంతగ్రంథమునందు సహిత మేకాక్షరద్వ్యక్షర పద్యములను జొప్పించియున్నాఁడు. ఇతఁడు నూఱుసంవత్సరములకుఁ బూర్వమునం దుండినట్లు తెలియవచ్చుచున్నది సీతారామాంజనేయ సంవాదమునుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. ప్రాపుగ రామనామము నిరంతరమున్ భజియించువా కిం
బాపములేదటంచుఁ బెనుపామును బట్టఁగవచ్చు నగ్నిసం
దీపితలోహఖండము నతిత్వరితంబుగ మ్రింగవచ్చు బ
లోత్కపము పెంచుపెద్దపులిగోళ్లు దీయఁగవచ్చు నిద్ధరన్.—ఆ. ౧.

చ. నమ్ము మనమ్ములో ననుదినమ్ము వెలుంగుచిదాత్మసత్ప్రభా
వమ్ము నిజమ్ము నేనె నిధనమ్మును సంజననమ్ము రూపవ
ర్ణమ్ములుఁ గర్తృకార్యకరణమ్ములు వర్ణగుణాశ్రమాభిమా
నమ్ములు నాకు లే వనుచు నమ్మగునావచనమ్ము నెమ్మనిన్ —ఆ. ౨.

శా. గానంబున్నటనంబుఁ దాళగతులం గావించుచున్ జూపువి
ద్యానైపుణ్యముఁ జూపుచున్ శిరముమీఁదం గల్గుపెందొంతరన్
బూనం గైకొనునాట్యశీలునిగతిన్ బుంఖానుపుంఖోజ్జ్వల
ధ్యానార్థానుభవజ్ఞుఁ డయ్యు బుధుఁ డానందాత్ముఁ గాంచున్నదిన్.—ఆ. ౩.

## పరశురామపంతుల రామమూర్తి.

ఈకవి శుకచరిత్ర మనెడి యైదాశ్వాసముల వేదాంతగ్రంథమును రచియించెను, ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; సీతారామాంజనేయసంవాదమును రచియించిన లింగ

మూర్తిపుత్రుఁడును శిష్యుఁడును; ఈతని తల్లి లింగాంబ. కవి తన తండ్రినిగూర్చియు దన్నుఁగూర్చియు నిట్లు చెప్పికొనియున్నాఁడు.—

సీ. ఆత్మభూశుఁడుగాని యాత్మభూశుఁడుగాఁడు నిగమాగమాంతార్థనియతిదోఁపఁ
బురుషోత్తముఁడుగాని పురుషోత్తముఁడుగాఁడు సజ్జనానుగ్రహాసరణి వెలయ
మృత్యుంజయుఁడుగాని మృత్యుంజయుఁడుగాఁడు సర్వప్రపంచోపశమన మమర
నమృతసిద్ధుఁడుగాని యమృతసిద్ధుఁడుగాఁడు ఘనరసాధిసమఁధనము దనర
నలుచుఁ దా వ్యతిరేకాన్వయప్రసిద్ధి। లను ప్రత్యక్షముగ నజుఁ డచ్యుతుండు
నభవుఁడమరేంద్రుఁడైయెప్పు వసివలెఁడె। లింగమూర్తియు నాగురులింగమూర్తి.

గీ. అమ్మహాలింగమూర్తి లింగాంబికాస। మారుఁడఁ దదీయసేవానుమతుఁడఁ బరశు
రామపంతులమలకంజరాజికర్య। మాకృతిని బొల్చు రామనామకుఁడ నేను.

ఇతఁడు నూఱుసంవత్సరములక్రిందటివాఁ డయినట్టు తోఁచుచున్నది. ఇతఁడు రచి రచియించిన వేదాంతగ్రంథ మయినను కవిత్వము మృదువయి హృదయరంజకముగా నున్నది. శుకచరిత్రములోని కొన్ని పద్యములను గవితాధోరణిని జూపుటకయి యిం దుదాహరించుచున్నాను.—

ఉ. కాయవనంబునన్ ధనువుగా భ్రుకుటిం గుఱిచేసి నారిగా
వాయువు గూర్చి చూపులను వాఁడిశరంబులఁ బూని వణ్ముఖిన్
బాయనిదృష్టి మాటుగొని మానసముఖ్యమృగంబులన్ సుఖో
పాయముగా వధించుమృగయారతు లుందురు తప్పురంబునన్.—ఆ. ౧.

మ. లలనా యౌవనభూమి కెల్లపుడు వాలాయంబుగా నప్సరో
లలనారత్నము లేగి యాఘుకులపాలం గల్గు సేవంతికా
లలనాతీరరసాలజాలకుల నేలాడోలలం గేళిలీ
లల నాట్యంగొని యాడుచుందురు బాలా కంటివే యిచ్చటన్ —ఆ. ౨.

ఉ. ఏనెఱిసైనఁ ద్రిప్పిన హృదింద్రియబుద్ధులహంకృశంబు పూ
ర్వానుభవాభిలాష' ఘయంబులకే చను వాని మల్పి నా
నాగమాంత శాస్త్రవచనశ్రవణాదుల నిల్పి తత్సమా
ధానమె మన్ననిపరనిధానముగాఁగొని యభ్యసించెదన్.—ఆ. ౩.

ఉ. యోగిజనాశ్రితానిలనియోగము సాధకలక్ష్యలక్షణో
ద్యోగము దేవదత్తనినియోగము సంతతముక్తికామినీ
భోగము నిత్యసత్త్వగుణభాగము దృష్టపరాత్మజీవసం
యోగము నొందఁజేయు భవయోగవియోగము రాజయోగమున్.—ఆ. ౪.

మ. జనకుం గాంచితి భేదవాదమతముల్ ఖండాడితిన్ శక్తివా
దిని భంగించితి నాగమాంతమతయుక్తి న్నిల్పి మెప్పింప న
గ్గని మోహించినముక్తికాంతను మహాకల్యాణయుక్తంబుగా
నెనయంగూర్చి నతండు దానిఁగొని యే నేతెంచితి న్వేదుకన్.—ఆ. ౫.

## వేగినాటి కొండనార్యుఁడు.

ఈకవి వివేకసింధువనెడి యైదాశ్వాసముల వేదాంతగ్రంథమును రచించెను. ఇతఁడు వేగినాటి నియోగిబ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు. మొట్టమొదట నీవివేకసింధువును నాంధ్రవచనకావ్యమునుగా రచియించిన ముకుందయోగిని కవి యీక్రింది పద్యమున స్తుతించియున్నాఁడు—

మ. వినుతింపన్ భవరోగవైద్య మగునీ వేదాంతశాస్త్రంబు పా
వనమై యుండఁ బ్రవీణతన్ వచనకావ్యం బొప్పఁగాఁ జేసి స
జ్జనులం బ్రోచినపుణ్యమూర్తి విమలస్వాంతుండు విజ్ఞానశా
సనుఁడైనట్టిముకుందమూనికి నమస్కారంబు గావించెదన్.

ఈకవియు నూఱేండ్ల క్రిందిట నుండియుండవచ్చును. శుకచరిత్రమునందు వలెనే యీ వివేకసింధువునందును వ్యాకరణ విరుద్ధములైన ప్రయోగములు కొన్ని కనఁబడుచున్నను మొత్తముమీఁద కవిత్వము మృదువయి శ్రావ్యముగా నున్నది. కవనరీతి తేటపడుట కయి వివేకసింధువునుండి కొన్ని పద్యము లిం దుదాహరింపఁ బడుచున్నవి—

చ. కడువడిఁ గర్మమార్గ మనుకాఱడవిం బడి విభ్రమించుచున్
జడమతి నింద్రియార్థఫలసంచితతిక్తకషాయసారముల్
దడఁబడఁగ్రోలి దుర్వ్యసనదాహముచేన్ వెసఁ డొంది స్రుక్కి మీ
యడుగులు గాంచితిన్ నను గృపామృతమానఁగనిచ్చి ప్రోవవే.—ఆ. ౧.

మ. వడిగాఁదీసి ధనుర్ధరుండు విడువం బాణంబు నెందాఁక న
వ్వడిగల్గున్ శర మంతదాఁక నడుచున్ వచ్చెనయచోటనే
పడుఁ బ్రారబ్ధపుఁగర్మవేగమున నాపర్యంతమున్ దేహముల్
పడ వావేగము తూలినం బడును జూ భగ్నంబులై మేదినిన్.—ఆ. ౨.

మ. సమతన్ మేఘుఁడు వారిధారలు మహిన్ సంప్రీతి వర్షింపఁ బ
ల్లములై యుండినచోట్ల నీరు నిలుచున్ రక్షింపఁగాబండపై

దుగుకున్నీరము నిల్వ దట్లగుట నెదుం బాత్ర మూహించి యు
త్తమునందుం దగ బ్రహ్మవిద్య నిలుపన్ ధర్మంబు చింతింపఁగన్.—ఆ. 3.

మ. తనువుల్ స్వప్నమనోరథంబులక్రియన్ దండోపతండంబులై
యనయంబుం బొడమాఁగి బోవు నివి కర్మాధీనసంప్రాప్తముల్
ఎనయ న్నాకును వీనితోఁ దగులు లే దెల్లప్పుడున్ నే ఘనం
డను నిత్యుండ నిరామయుండ విమలుండన్ సాక్షిచైతన్యుఁడన్.—౪.

ఉ. అప్పుడు పుట్టినట్టిశిశువందును జవ్వనియై మిటారియై
యొప్పులకుప్ప యైనవికచోత్పలలోచనయందు వార్ధకం
బుప్పతిలంగ నున్నముదియు గ్మలియందును నిర్వికారుఁడై
చెప్పెడి దేమి యొందు సమచిత్తుఁడు షండుఁడ యెంచిమాడఁగన్.—ఆ. ౫.

# వాసుదేవయోగి.

ఈకవి జీవప్రబోధమనెడు నాలుగాశ్వాసముల వేదాంతగ్రంథమును రచియించెను. యోగశాస్త్రము లనుపేర రచియింపఁబడిన వేదాంతగ్రంథములలో ననేకములకంటె నిందలికవిత్వము సలక్షణమయి హృదయంగమముగా నున్నది. కవి యేకాలపువాఁడో తెలియదు గాని నూఱుసంవత్సరముల పయివాఁ డని తోఁచుచున్నది. జీవప్రబోధములోని కొంతుపద్యముల నిం దుదాహరించుచున్నాను.—

చ. అనవరి జీవుఁ డిట్లుమఁ బ్రయత్నముఁ బ్రాప్యపదంబు లేక తా
ననయము ఖండమై జగములందును గారణకార్యరూపతం
బెనఁగొనియున్నయాత్మ కొకపిండపదంబుఁ బ్రయత్నసాధనం
బును నసఁ గల్గునే యనుచు బుద్ధికిఁ దోఁచెడి వీనిఁ జెప్పవే.—ఆ. 3.

కు. అంధతమిశ్రసక్రత్యనుగతాత్ముల శుద్ధశరీరశుద్ధిచే
బంధవిముక్తి గోరి కరిభంగిని నీట మునుంగ దేహదు
ర్గంధము వాయుఁగాక భవకర్గనిబంధవిముక్తి కల్గునే
బంధురరాగరోషములఁ బాసిన శుద్ధతఁ గాక జీవుఁడా.—ఆ. ౪.

## కానాల నరసింహకవి

ఈకవి హరివంశములోని యాశ్చర్యపర్వమునందలి శేషధర్మముల నెనిమిదాశ్వాసములపద్యకావ్యముగా రచియించెను. ఈతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు; వాసిష్ఠగోత్రుఁడు; వేంకటేశయామాత్యపుత్రుఁడు; ఈతనివాసస్థలము తఱిగొండగ్రామము; ఇతఁడు తనశేషధర్మగ్రంథమును తఱిగొండ నృసింహస్వామి కంకితము చేసెను. ఈతనికాల మేదియొ తెలియరాలేదు. ఇతఁడు తనగ్రంథమునందు

'గీ. ఆంధ్రవిద్వజ్జనాచార్యు నన్నపార్యు । సుజనగుణమాన్యు సోత్పలసోము సోము
సుకవిరాలంకృతిభ్రాజిసోమరాజి । సత్కృపాసనాథు శ్రీనాథు సన్నుతింతు'

అని యాంధ్రకవులను వర్ణించుచోఁ దమనందవరీకులలో సుప్రసిద్ధులైనపెద్దనాదికవులనుసహితము వర్ణించియుండలేదు. ఇంతమాత్రముచేత నితఁడు పెద్దనాదికవులకంటెఁ బూర్వుఁడనికాని వారితోడి సకాలికుఁడనికాని చెప్ప వలనుపడదు. ఇతఁడించుమించుగా నూఱునూటయేఁబదిసంవత్సరముల క్రిందట నుండియుండవచ్చును. అక్కడక్కడఁ గొన్నివిలక్షణము లైనప్రయోగము లున్నను కవిత్వము మొత్తముమీఁద మృదువయి నిరర్గళధార కలదిగా నున్నది. ఈతనిశేషధర్మములలోనుండి కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను.

చ. పటుతరమేఘమండలవిభాసితసౌధచయోపరిస్థితో
త్కటవరహేమకుంభసముదాయధగద్ధగితోరుకాంతివి
స్ఫుటచపలాకృతి న్మెఱయుఁ జూడఁగవచ్చినవార లెల్ల ని
చ్చటఁ గలచంచలల్ కనునచంచల లంచు భ్రమింతు రెంతయున్ — ఆ. ౧.

చ. ఘనవిషజంతుపూరిత మగాధము కూపము దీనఁ జూడు నీ
వొనరఁగఁ గూఁతు నియ్యవు తిలోదక మియ్యవు గాన దాన మా
తనువులు జీర్ణతం బొగసె దారుణరూప సమేతకూపమం
దున వసియున్నవార మతిదుఃఖసమాకులతన్ మహాత్మకా. — ఆ. ౨

శా. దారాపత్యయుతుండ దకించనుఁడు విద్వాంసుండు వేదాంతమా
ర్గారూఢుండును వృత్తిహీనుఁడును నిత్యానందుఁడున్ శ్రోత్రియుం
డైగా జిల్లినబ్రాహ్మణోత్తమున కత్యానందులై జీవనం
బీరే దాతలు పొందరే సుగతు లుర్వీశా ధరామండలిన్. — ఆ. 3

ఉ. నీసము లెందఱో శమనునింటికిఁ బోయిరి నీకుఁ జావురా
దాసరుఁ బుట్టినిల్లయి మహాకలుషంబు లొనర్చి సభ్యులన్

మోసముచేసి నేఁ డిటులు మూల్గిఁ బోవునె తత్ఫలంబు నిక్
భాసినఁ గల్గు మా కఖిలభాగ్యము లేమము కాలుఁబ్రోలికిన్.—ఆ ౪

మ. అమచున్ దూతి మహీవరా సుతకళత్రార్థంబుగాఁ బాపచిం
తన లగార్జఁజేసి వాని నిరవందం బ్రోతు రంతంబునన్
దనవెంటం జనుదెంతురే కడపటన్ గానొక్కఁడే పోవుటల్
గనియున్ మోహలతానిబద్ధు లగుచున్ గానంగలే రింతయున్.—ఆ ౫.

మ. పరిచయం బానును బుత్రపౌత్రయుతుఁడై సంప్రాప్తసర్వేష్టుఁడై
యతిసంతోషముమీఱఁగా మెలఁగి దేహాంతంబునన్ లోకపా
లతతుల్ పూజ లొనర్ప సర్వసుఖసంప్రాప్తుండునై క్రమ్మఱన్
క్షితిపైఁ బుట్టెను జక్రవర్తి యగుచున్ జేతోముదం బొప్పఁగన్.—ఆ. ౬.

చ. పొలుపగు కాంచనంబుఁ దిలపుష్పము నచ్చెలి నాసికోపమం
బలరఁగవచ్చి దానిసమ నాటకుఁజాలక యూర్ధ్వదృష్టిఁ గొ
మ్మలఁ దలక్రిందుగాఁ దగుల మూలగఁజేసి ఫలించు వేళ మే
నులు విడిచెన్ నలంగఁడె సుగంధయుతన్ బలవద్విరోధియై.—ఆ. ౭

ఉ నీవును దీపదానములు నెమ్మిఁ జేయుము దాన మోక్షమున్
శ్రీవరుఁ డిచ్చుజ్ఞానమును జేకుఱు జ్ఞానముచేత మోక్షమున్
భూవర నీకుఁ గల్గు హరిపూజ లొనర్పుము కార్తికంబునం
దీవిమలేతిహాసము మహిన్ వినువారికిఁ గల్గుసౌఖ్యముల్.—ఆ. ౮.

## రామనామాత్యుఁడు.

ఈకవి గయోపాఖ్యాన మనెడి రెండాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; తిమ్మామంత్రిపుత్రుఁడు. గయోపాఖ్యానమునకు కృష్ణార్జునసంవాదమని నామాంతరము గలదు. ఈతఁడు నూఱుసంవత్సరముల క్రిందటివాఁ డయి యుండవచ్చును. ఇతఁడు తనగ్రంథమును శ్రీమదహోబిల నృసింహస్వామి కంకితము చేసెను. ఈతని గ్రంథమునందు లక్షణవిరుద్ధము లైన ప్రయోగము లనేకము లున్నను, మొత్తముమీఁద కవిత్వము సరసముగానేయున్నది. గయోపాఖ్యానములోని పద్యములు రెండిందు క్రిందఁ జేర్పఁబడుచున్నవి.—

ఉ. వారిజనాభ నీ వనప వాసవనందనుఁ డున్నచోటికిన్
హిమాద్రిధైర్యునకుఁ జెప్పితి బుద్ధులు పెక్కురీతులన్

భూరిదయాబ్ధి యాఘునిబుద్ధికి నేమని యెంచిచూడ నీ
ధారుణిఁ బాండవేయులకు దాపునుదండయు నీవెకా హరీ — ఆ. ౧.

ఉ. ఏమని చెప్పవచ్చు బళి యీబలపార్థులబాహువీర్యముల్ ని
రాముని సాటి వత్తురు శరాసనవిద్యకు ధీరధైర్యముల్
హేమమహీధరంబునకు నెక్కువ వీరలతోడ మార్కొనన్
సోమధరుండు వాసవుఁడు సూర్యకులోద్భవుఁడైన నోర్తురే. — ఆ. ౨.

## పోచన.

ఈకవి చంద్రాభ్యుదయ మను ప్రబంధమును రచియించెను. ఇతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. ఈతనితండ్రి నృసింహసోమయాజి. ఈచంద్రాభ్యుదయము అమ్మనమంత్రి కుమారుఁడగు చిన్నయామాత్యున కంకితము చేయఁబడినది. ఈకవికాల మేదో తెలియరాలేదు. ఇతఁడు నూఱుసంవత్సరములకంటెఁ బూర్వమునం దుండినట్లు తోఁచుచున్నది. ఈప్రబంధము శబ్దాలంకారములతోనిండి శ్రావ్యముగా నున్నది. చంద్రాభ్యుదయములోని పద్యములు రెం డిందుక్రిందఁ బొందుపఱుపఁబడుచున్నవి—

చ. తిమిరపుజవ్వనంబున నతీతసతీతనవృత్తమైనచి
త్తముతమి పౌరవారవనితాజనతాజనితానురాగయో
గమున ముఱింగి దర్పకవికారము తోరముగా ఘటింపన
క్కుమరుమిటారిబారిపడి కుఁరివృత్తిఁ గ్రమక్రమంబునన్. — ఆ. ౧.

చ. అన విని గుండె జల్లుమన నవ్వనితామణి యమ్మచెల్ల యీ
యన మదనాతురత్వమని యాత్మఁదలంచి తలంచి సాధ్వసం
బును వెఱఁగుం దడంబడఁగఁ బొంపిరినట్లను భర్తతోడని
య్యనువున మిమ్ముఁ బ్రోవఁగ మహాత్మ యొరుల్ మన కెవ్వ రియ్యెడన్. — ఆ. ౨.

## పెనుపల్లి బాపనామాత్యుఁడు.

ఈకవి సీతావిజయమను నేకాశ్వాసప్రబంధమును రచించెను. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; కోనయామాత్యపుత్రుఁడు. ఈతని కవిత్వమునందు లక్షణవిరుద్ధములైనప్రయోగము లక్కడక్కడఁ గానఁబడుచున్నవి కవనరీతి తెలియుటకయి సీతావిజయమునందలి రెండుపద్యము లిం దాహరింపఁబడుచున్నవి.—

ఉ. పోల శతాననుండు శివపూజ యొనర్చుచు నుండి యంతలో
నాలనువార్త కర్ణములయందు వినంబడ నుల్కి యుగ్రుఁడై
చాలను దేవపూజయని చారులఁ గన్గొని యేమి మత్పురీ
జాలఁగ నందనున్ గలుగుచందము తోఁచెను జెప్పుఁ డంతయున్.

ఉ. భూరిరయంబునం దొడరి భూసుత కన్నుల నెఱ్ఱచేసి యా
రోషశతాస్యు ద్రుంగి తరి యొక్కట బాణసహస్రకోటి తా
నారజనీచరేంద్రుతనువందును గ్రుచ్చిన నెత్తురొల్కఁగాఁ
బోవుచు వాఁడు నొప్పెసఁగెఁ బూచినమోదుగుచెట్టుకైవడిన్.

## చదువుల-సోమలింగయ్య.

ఈకవి మదనసాయక విలాసమనెడి యైదాశ్వాసముల శృంగారప్రబంధమును రచియించి శ్రీశైలమల్లికార్జునున కంకితము చేసెను. ఇతఁడు శైవబ్రాహ్మణుఁడు; గారుత్మతద్యుతి గోత్రుఁడు. వేంకటాచలమయారాధ్యునకును అన్నపూర్ణమకును పుత్రుఁడు. ఇతఁ డేకాలపువాఁడో సరిగాఁ దెలియరాదు. ఇంచుమించుగా నూఱుసంవత్సరముల క్రిందట నుండెయుండును. ఈతనికవిత్వము మృదుమధురపాకమున వెలయుచున్నను నిరుపమమైనది కాదు. ఒక్కొక్కయాశ్వాసమునుండి యొక్కొక్కటి చొప్పున నిందుక్రింద నుదాహరింపఁబడిన పద్యములనుబట్టి కవియొక్క కవిత్వరీతి కొంతవఱకు తేటపడవచ్చును —

చ. చలిశశికాంతసంఘటితచారుసువర్ణవికారసౌధమం
దును నెనలేనిగద్దెపయి దొరముగాఁ గొలువుండి సాధుస
జ్జనపరివారయుక్తుఁడయి సత్యముఁ దప్పక మూఁడులోకముల్
తనదుయశంబు గప్పఁగను దద్దయు రాజ్యము చేయుచుండఁగన్. — ఆ. ౧.

చ. అని దరిఁజేరి బాలకుని నక్కునఁ జేరిచి చెక్కుదోయి ము
ద్దొనరిచి ముంచు దువ్వుచు మృదూక్తులు పల్కి కడింది ప్రేమ నె
మ్మనమున నల్లిబిల్లికల మాటికి నల్లుకొనంగ నక్కుమా
రునిముఖచంద్రదర్శనవిలోచనకైరవుఁ డౌచు నయ్యెడన్. — ఆ. ౨.

చ. తెలిపులుమంజిమత్తిగులు తీఁగనిల్పిరి క్రేవఁ జక్కనౌ
ఖలువగుకెంపుగుంపులశుభస్థితకాంతులు చల్లుమేలుత

ష్మలకు నివాళు లిచ్చి కనుమచ్చికలున్ జెలువొందఁ దావిపు
వ్వులసర మొక్క_కేల నిడి యొప్పఁగ నప్పి నేగుచుండఁగన్ —ఆ. ౩.

ఉ. ఉల్లము చల్లగాఁ గనినయొప్పులకుప్పపయిన్ సుమాస్త్రుయుల్
పెల్లుగ నేసినట్టికరుపెద్దపు నీకొక లక్ష్యమా సవో
త్ఫుల్లసరోజలోచనలపొంక మడంచుట మన్మథా ధరన్
తల్లికి ముక్కుకోసి పినతల్లికిఁ గమ్మలొసంగ నేర్తురే.—ఆ. ౪.

ఉ. మారుని గేరు వీనిసుకుమారశరీరము నవ్యచంద్రికా
సారము తీరు హాసము సుసారససారము లౌర కన్నులిం
పారెడుగండుతుమ్మెదలబారుల నేలుకురు లౌర వీనిసిం
గారము నీరజాసనునికైన మదిం దలఁపంగ శక్యమే.—ఆ. ౬ ౫.

## శ్రీధరమల్లె-వేంకటస్వామి

ఇతఁడు బ్రహ్మోత్తరఖండము నయిదాశ్వాసముల పద్యకావ్యమునుగాఁ దెనిఁగించెను. ఇతఁడు బడగలనాటి కన్నడవంశజుఁడు; ఆశ్వలాయనసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; అయ్యనార్యతనూజుఁడు. కవి యీగ్రంథమును జ్యోతిరామనాదుల ప్రేరణముచే రచియించి, సిద్ధవటమునకు సమీపముననున్న యంబాపురమందలి పార్థివేశ్వరస్వామి కంకితము చేసెను. ప్రేరకులయిన రామనయు లక్ష్మీనారాయణుఁడును వెంగల్వరాయుఁడును దన్నుఁ గూర్చి పలికినట్లుగాఁ గవి యీక్రిందిపద్యములలోఁ జెప్పికొన్నాఁడు—

శా. శ్రీమద్వేంకటరామనాముని గవిశ్రేష్ఠున్ రమావల్లభ
ప్రేమాపాంగవిశేషలబ్ధకవితాభివ్యక్తసూక్త్యన్వితుం
గామారిస్తవభక్తియుక్తు విలసద్గాంభీర్యధైర్యాఢ్యు న
న్నామోదంబునఁ జూచి పల్కిరి సముద్యత్కౌతుకం బొప్పఁగన్.

* * * * * *

క. ఖండేందుధరప్రియ మా । ఖండలభాగ్యప్రదంబు కల్పలతికా
ఖండన మగుబ్రహ్మోత్తర । ఖండము రచియింపు పద్యకావ్యము గాఁగన్.

ఈకవి యీబ్రహ్మోత్తరఖండమును రచియించి యెనుబదిసంవత్సరము లయినట్లు గ్రంథాంతమునందలి యీక్రిందిపద్యమునుబట్టి తెలియవచ్చుచున్నది.—

సీ. శరవర్షగణనంబు శైలరామమునీందుపరిమితంబై ధాత్రిఁ బరఁగుచుండు
యువనామసంవత్సరోపేత కార్తికమాసరాజిత పౌర్ణమాసియందు
ధన్యులు విష్ణువర్ధనసగోత్రులు జ్యోతిసుబ్బన్న పుత్రులు సుగుణమణులు
రామన్న లక్ష్మీనారాయణ వెంగళ్వరాయఁడు నసుపువ్వ రమలయాఖ్యులు
చిత్తమున భక్తి వెలయ బ్రహ్మోత్తరాఖ్య
ఖండ మాంధ్రప్రబంధంబుగా ఘటించి
యెలమి సంబాపురపుఁ బార్థివేశ్వరునకు
భాసురముగ సమర్పణఁ జేసి రపుడు.

ఈ పద్యమునుబట్టి శాలివాహనశకము ౧౭౩౭వ సంవత్సరమునందనఁగా క్రీస్తుశకము ౧౮౧౫వ సంవత్సరమునం దీగ్రంథము రచియింపఁబడినట్లు స్పష్టముగాఁ దెలియ వచ్చుచున్నది. ఈగ్రంథమునం దక్కడక్కడఁ గొన్ని వ్యాకరణదోషము లున్నను మొత్తముమీఁదఁ బుస్తకము హృదయరంజకముగానే యున్నది. బ్రహ్మోత్తరఖండములోని పద్యములు కొన్ని యిం దుదాహరింపఁబడుచున్నవి.—

ఉ. ఓ మునిసార్వభౌమ మహిమోజ్జ్వల మీ రిట కేఁగుదెంచుటన్
గామది సంతసం బొదవె నాదుగృహంబు పవిత్ర మయ్యె మ
త్కామితము ల్ఫలించెఁ గడు ధన్యుఁడ మాన్యుఁడ నైతి నంచు నా
భూమివిభుండు పల్కుచును బూజ లొనర్చె మహాముదంబునన్.—ఆ. ౧.

శా. ఆ రాజేంద్రుఁడు కంఠసూత్రరహితన్ వ్యక్తాంజనాపాంగశృం
గారప్రాభవహీనగాత్రి గళితగ్రైవేయహారాదికన్
దూరీభూతశుభాంగరాగలలికన్ దుర్వారశోకార్దితన్
సారాచారపరాయణం గనియె నాసాధ్వి స్వచిత్రంబుగన్.—ఆ. ౩.

మ. రణదుద్యన్మణిదీప్యమానకనకగ్రైవేయకోటీరకం
కణహారాంగదనూపురాదుల నలంకారంబు గావించినన్
క్షణమాత్రంబునఁ బాయఁద్రోచి కడు వేడ్కన్ శ్రీల రుద్రాక్షభూ
షణము ల్దాల్తురు వారలిర్వురు మహోత్సాహంబు దీపింపఁగన్.—ఆ. ౪.



## ఓరుగంటి - సోమశేఖరకవి.



ఈకవి రామకృష్ణార్జునరూపనారాయణీయమను నాలుగాశ్వాసముల ద్వ్యర్థికావ్యమును రచియించి శ్రీపూసపాటి నారాయణరాజుగారి కంకితము చేసెను. పుస్తకము

యొక్క పేరుచేతనే యిందు రాఘవయాదవపాండవార్థము లిమిడియున్నవని తెల్లమగుచున్నది. ఈకవి వైదికబ్రాహ్మణుఁడు; కౌండిన్యసగోత్రసంభూతుఁడు. ఇతఁడు సంస్కృతాంధ్రములయందు చక్కని వైదుష్యము కలవాఁడయి కవితారచనయందత్యంత సామర్థ్యము గలవాఁడుగా నుండెను. ఇతఁడు నూఱుసంవత్సరములకు లోపలివాఁడు. ఈతని త్ర్యర్థికావ్యములోనివి కొన్ని పద్యము లిందుదాహరింపఁబడుచున్నవి.—

శా. సంభూతాతిశుభాతి దర్శనకళాసంపన్నుఁ డారాజు స
ద్గాంభీర్యాంబుధి యేలె సర్వధరణిన్ గాంగేయచాపోరుసం
రంభప్రాధిసహాయుఁడై విదురసారన్యాయమార్గంబుతో
శుభకీర్తి మహోత్పలప్రియకులస్ఫూర్తుల్ విజృంభింపఁగన్.— ఆ. ౧.

ఉ. సంతస మొప్పఁ దోఁచెను వసంతము మంజులకోకిలస్వనా
క్రాంతము కోరకప్రకరకాంతము బంభరగానశోభితా
శాంతము సర్వమంగళనిశాంతము మోహితమానమానినీ
స్వాంతము ధూతసత్పథికశాంతము పుల్లలతాంతతాంతమై.— ఆ. ౨.

చ. సుజనకృతస్తవా జనకసూక్తి యలంఘ్య మటన్న చూడఁ దా
నిజము సముత్సుకమందుఁ దగనిన్ను సమర్థునిగాఁ దలంచి త
ద్ద్విజము నుతింపఁ బంచుపని వారకచేయు సుధర్మసంస్థితిన్
గుజములు ప్రుక్క శ్రీహరి గొల్చినవాఁ డనయుంబు నెమ్మనిన్.— ఆ. ౩.

శా. కళ్యాణీభవదర్పితోగ్రవరసత్కారుణ్యతన్ సద్విషల్
కళ్యాణీధరవిఘ్నవవ్యవసతీకాండప్రభూల్లంఘనా
కళ్యాణాతిశయంబు నాకు నిచటన్ గల్గెన్ని రాఘూటమై
కళ్యాణాంబరకాంతుఁ జేయుము కృపన్ గాంభీర్యధీప్రముక్కదన్.— ఆ. ౪.

## ముడుంబి-వేంకటాచార్యుఁడు.

ఈకవి రసప్రదీపిక యనెడు మూఁడాశ్వాసముల వైద్యగ్రంథమును జేసెను. ఇతఁడు శ్రీవైష్ణవుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; వేదాంతాచార్యపుత్రుఁడు. ఇతఁడు గోదావరీమండలములో నూఱుసంవత్సరములకు లోపల నుండినవాఁడు. కవిత్వమునందుఁ గొన్ని స్ఖాలిత్యములు గలవు. రసప్రదీపికలోని రెండుమూఁడుపద్యముల నిందుదాహరించుచున్నాను.—

ఉ. పారదగంధకంబు లొకభాగము నాలుగుభాగముల్ సహా
సారము కుప్పెఁ బెట్టి పదియాములు వండినఁ గెంపుసొంపుతో
భాసిలఁ బుట్టు సిందుర ముదారత నద్దిగ యెత్తు నిచ్చినన్
బోరన రోగపుంజములఁ బోవహరించు నమోఘవీర్యమై.—ఆ. ౧.

చ. ఘృతమునఁ గొండపిప్పలి మిరెంబులతోడుత నభ్రకంబు సం
తతమును జిన్నమెత్తు గొన దారుణమౌ కఫవాతపిత్తసం
యుతగ్రహణీక్షయంబుల వియుక్తప్రమేహగుదాంకురంబులన్
గతుకఁగఁజేసి దీపనము గల్గఁగఁ జేయు నమోఘవీర్యమై.—ఆ. ౨.

ఉ. మంచిసువర్ణభస్మము క్రమంబునఁ గొన్నను రాజయక్ష్మమున్
సంచితకృచ్ఛ్రజంబు లగుసర్వరుజంబుల భూతవేదలన్
ద్రుంచి యమోఘవీర్యమయి దోర్బలమున్ ఘనకాంతి తేజము
త్యంచితబుద్ధిమార్గము చిరాయు వొసంగును మానిచంద్రమా.—ఆ. ౩.



## అక్కెనపల్లి-నృసింహకవి.



ఈకవి యాదిలక్ష్మీవిలాసము, వల్లీభాగబాహపరిణయము, ఓఘవతీపరిణయము, అను మూడుప్రబంధములను రచియించెను. వీనిలో నోఘవతీపరిణయము శ్రీగోడే జగ్గారాయనింగారిపుత్త్రు లగు శ్రీసూర్యప్రకాశరాయనింగారి కంకితము చేయఁబడి తత్సోదరపుత్త్రు లగు శ్రీమహారాజా గోడేనారాయణగజపతిరాయనింగారిచే ముద్రింపఁబడినది. ఈగ్రంథము శాలివాహనశకము ౧౭౩౯వ సంవత్సరమునందు రచింపఁబడినట్లు గ్రంథాంతమందలి యీసీసపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

సీ. శాలివాహనశకసంవత్సరంబులు లజాగ్నిభూధరతుషారాంశు లైన
యీశ్వరాబ్దంబున నెసఁగువైశాఖమాసంబున శుక్లపక్షమున మూర్తి
శశిసంఖ్య భౌమవాసరమున శుభవేళ నక్కెనపల్లినృసింహకవి యోఘ
వతిపెండ్లికథ సమున్నతిమీఱెడి గోడెజగ్గారాయసూర్యప్రకాశరాయ
మణికి రాజ్యాయురారోగ్యసహితపుత్త్ర। పౌత్త్రనికరాభివృద్ధిగా భవ్యబుద్ధిఁ
గృతి యొసంగెను దద్యశం బతిశయిల్లి। జగతి నాచంద్రతారార్కముగ వెలంగ.

ఇతఁడు కృష్ణామండలములోని యెల్లమంద నివాసుఁ డయినను తనయాదిలక్ష్మీవిలాసమును గోదావరీమండలములోని యంతర్వేది నృసింహస్వామి కంకితము చేసెను.

అనిలక్ష్మీవిలాసము నాలుగాశ్వాసములు గల ప్రౌఢకావ్యము. వల్లభాంబాపరిణయము విఘ్నేశ్వరుని పెండ్లికథ మూడాశ్వాసముల ప్రబంధము. ఇది పులిపాక సీతయామాత్య పుత్రుఁ డయినరామమంత్రి కంకితము చేయఁబడినది. ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; కౌండిన్యగోత్రుఁడు; జోగయామాత్య పుత్రుఁడు ఈకవి నూఱుసంవత్సరములకు లోపలివాఁడు. ఈతనికవిత్వము రసవంతముగా నున్నది. ఈతని పుస్తకములోని యీక్రిందిపద్యములవలన నీతని కవితాధోరణి కొంత తెలిసికొనవచ్చును.—

అనిలక్ష్మీవిలాసము.

ఉ. మాయలు నింద్రజాలములు మా కవి క్రొత్తలు గావు మామనో
నాయక యిప్పుడీవు రతినాయకసాయకభిన్నకాయనై
పాయనిమోహ మందునను బన్నగఁ గౌఁగిటఁ గూర్చి యొయ్యనన్
శ్రీయుతసౌఖ్యవైఖరులు చేఁదలంపుల దీఱఁ గూడుమా.—ఆ. ౧.

ఉ. ఎక్కడిగొల్లవాఁడ విది యెక్కడిజాణతనంబు దొంగవై
యెక్కడిపౌరుషంబు మఱి నింత తలఁపక ప్రాలుమాలినన్
దక్కునె నీకుఁ గోక లవి తక్కక యిమ్మికఁ గామపాలివై
యక్కలతోడ నీసరసి నాడఁగఁ జీరలు దొంగిలింతువే.—ఆ. ౨.

ఉ. వారిజనేత్ర మీచరణవారిజముల్ హృదయాంబుజంబునన్
గూరిమినిల్పి యెల్లపుడుఁ గొల్చు రమాపతియంచు రుక్మిణిం
దారయు లేక చైద్యునకు నంగన నిచ్చెదనన్న మాట బ
ల్నారసమట్ల కర్ణమున నాఁట ననుం గృపఁ గాంచి యిట్లనెన్. ఆ. ౪.

వల్లభాంబాపరిణయము.

చ. అరయఁగ సిద్ధసాధ్యగరుడామరకిన్నరనాగయక్షకిం
పురుషులయిండ్లలో నెలమిఁ బుట్టెదఁ జేసెదుపాట్ల మీగణే
శ్వరునకుఁ బెద్ద దేల యనిశంబును బొట్టికి బ్రహ్మచారియై
పరఁగెడిమేటికిన్ గతిరభావులతో నిల వియ్య మేటికిన్.—ఆ. ౨.

చ. ముద మొనరించు ముచ్చటల ముంచును గంధముఁ బెంచు సౌఖ్యము
ల్గదురఁగ నించు నించువిలు గొంచుఁ జరించువజీరుశాస్త్రసం
పద గడియించు నిత్యరసపద్ధతుల న్నిరసించు మించు ని
మ్మదిరయుటంచు నెంచుచును మానుగఁ గ్రొవ్విరిమించుబోండ్లగిన్.—ఆ. ౫.

శుభవతీపరిణయము.

ఉ. మేలగు మేలు గూర్చుటకు మీ రరుదెంచితి రంటివా బళీ
చాలు భవన్మనోరథము చక్కఁ లభించు ఫలం బటంచు నా
లోలవిశాలనేత్ర యొసలోఁ గలతియ్యనికల్లు నొయ్యనన్
మేలుకొనంగఁ జేసి యొలమిం జని సంయమిరాజు సయ్యనన్.—ఆ. ౧.

ఉ. అంతట నేర్చె విద్య లిసుమంత కొలంత యలంతలేక భూ
కాంతునిముద్దుపట్టి యజుకాంతరొ యంచు సమస్తసజ్జనుల్
వింతగ సంతసించి తను వేయివిధంబుల సన్నుతింప న
త్యంతకళావినోదమహిమాతిశయంబు శయంబుఁ జేరఁగాన్.—ఆ. ౪.

## పైడిపాటి-వేంకటనృసింహాకవి.

ఈకవి నృసింహవిలాస మను మూడాశ్వాసముల గ్రంధమును రచియించెను. ఈతఁడు వెలనాటియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శతమర్షణగోత్రుఁడు; లక్ష్మీపతికిని వేంకమాంబకును బుత్రుఁడు. ఈతఁడు నెల్లూరుమండలములోని పైడిపాటి గ్రామనివాసుఁడయి గ్రామచతుష్టయమునందు స్థావరజీవనము కలవాఁడయినట్లు నృసింహవిలాసములోని యీక్రిందివచనమువలనఁ దెలియవచ్చుచున్నది—

సీ. శ్రీశైలంబున నొప్పు కృష్ణాపినాకినీదివ్యనదీమధ్యదేశభూమిఁ
గడుఁబూర్వవార్ధికిఁ బడమట యోజనదూరమై తగుఁ గందుకూరు మఱియు
నగరొ సీతానామమై యొప్పు నాకందుకూరికిఁ దనరు వాయవ్యదిశను
పాలేట దానికిఁ బాల స్త్ర్యంశఁ బైడిపాడొప్పదానికిఁ బశ్చిమమున
నెగడుఁ జదలపాడు నిబ్బరి వేంపాడు। దెలఁగు గాడ్పుమూల నిలవరయన
సమరుపురచతుష్టయం బిది తృణకాష్ఠజలసమృద్ధి సిరుల నలగుచుండు.

గీ. గ్రహణవేళ గోపరాజు రామన గోల। కొండప్రభువుచేతఁ గొనినదాన
మహిమ దష్టమతుల మడియించి స్థావర। జీవనములు ద్విజులఁ జేర్చె మున్ను.

వ. తదీయాన్వ్రగహాలబ్ధంబైన యేతద్గ్రామచతుష్టయు స్థావరజీవనజీవితు లయిన
మదీయవంశజులు &c

ఈకవి యెక్కకాల మేదియో కానరాదుగాని యితఁ డాధునికుఁ డయినట్లు తెలియవచ్చుచున్నది. నృసింహవిలాసములోని రెండుపద్యము లిందుక్రిందఁ బొందుపఱచఁబడుచున్నవి—

మ. శశి పక్షక్షయ మెన్ని యక్షయకళాసంప్రాప్తికిన్ ధాతృహృ
ద్వశుఁడై దీని సృజించుకాలమున వక్త్రిం బన్యోన్యనో తా మహా
గ్నిశ మూర్ధ్వస్థితి నుంట రోసి తొలఁగన్ రేఖాఁ దటంచుం దదం
ఘ్రిశయాక్రాంతసఖాకృతిం బొలిచెనో క్రిందై క్వచిత్తాకరల్.—ఆ. ౨.

శా. పోరా వేఁటకు వేఁటకాండ్రు గహనంబు ల్గ్రుమ్మరన్? గ్రమ్మఱన్
రారా రాత్రి కైనఁ? వా రలసులై రాకున్న నారాత్రికై
యోరీతిం దపియించుబోఁట్లు కలరే యెందైనఁ? జంద్రాస్యలా
ఘోరారణ్యముఁ జొచ్చి చూడఁగలరే గోవిందు రేజాముల౯.—ఆ. ౩.

## కొటికెలపూడి - వేంకటకృష్ణకవి.

ఇతఁడు శ్వేతాచలమాహాత్మ్యమను మూడాశ్వాసముల గ్రంథమును రచియించి, బొబ్బిలిపురాధీశ్వరుఁ డగు రాయణప్ప రంగరాజున కంకితము చేసెను. ఈకవి వైదిక బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; హరితసగోత్రుఁడు; శివరామపౌత్రుఁడు; వేంకటరామపుత్రుఁడు. కృతిపతి తన్నుఁగూర్చి పలికినట్లు కవి తనగ్రంథములో నిట్లు వ్రాసికొనియున్నాఁడు.—

మ. నను శ్రీమజ్జనకాత్మజాధిపపదన్యాసప్రపన్నాంతరం
గుని వాణీకరుణాకటాక్షకలనాంకూరత్సుధామాధురీ
వినుతాంచత్కవితాప్రతోషితమహావిద్వత్కవిగ్రామణి౯
ఘనకార్యాంతికతాండిలేయుఁ గడు వేడ్కం బిల్చి తా నిట్లనె౯.

చ. హితులు మదన్వవాయజుల కెల్లఁ బురోహితు లార్యలోకపా
లితకవితాప్రకల్పితదిలీపచరిత్రముఖోజ్జ్వలప్రబం
ధతతులు పౌరికాగ్రణు లుదారగుణాన్వితచిత్తుల స్సదా
శ్రితులు సమస్తసూరినుతశేముషు లెన్నఁదరంబె మిమ్ములన్.

సీ. ధీరత మేఘసందేశంబు తెనిఁగించి ప్రీతి దిలీపచరిత్ర మనెడు
గొప్పప్రబంధంబుఁ జెప్పి శ్రీరాముల కర్పించితివి మున్న నేర్పుమీఱఁ
గార్తాంతికులు మెచ్చఁగా శ్రీపతి గ్రంథగతిని మామకజాతకము లిఖించి
మా కొసంగితి విప్పు డేకాగ్రచిత్తత సంచితంబుగఁ దెనిఁగించుచున్న
కూర్మమాహాత్మ్య మొసఁగుము కూర్మిమాకు। రమ్యచారిత్ర వేంకటరామపుత్ర
కీర్తిదౌదార్య వేంకటకృష్ణమార్య। యనుచు బహుమతిచేయు నాహ్లాదమునను,

కృతిపతిపూర్వులు సర్వజ్ఞ సింగమనాయుని సంతతివారయిన రావువంశజులయినట్లును, వారిలో లింగప రంగరాయఁడు బొబ్బిలిసంస్థానమును స్థాపించినట్లును, కవి యీ క్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు—

మ. హరిపాదంబునఁ బద్మనాయకులు గంగాన్వీతులై యుద్భవిం
చిరి తత్పాదజులం దతిప్రబలులై శ్రీరావువంశ్యుల్ వెలం
గిరి తద్రావుకులీనులం దలరె గాంగేయస్తుతౌదార్యశౌ
ర్యరసోపేతుఁడు రాజశేఖరుఁడు సర్వజ్ఞుండు సర్వజ్ఞుఁడై.

క. అలరి తదన్వయసంభవుఁ డై లింగప రంగరాయఁ డలరె నిజభుజా
ఖేలాసిదళితరిపునృప ఫాలాస్థూలస్ఫురత్కపాలుం డగుచున్.

క. బెబ్బులి రిపునృపులరియెను గిబ్బల కితఁ డంచు జనులు కీర్తింపఁగఁ దా
బొబ్బిలిపట్టణ మేలెను నిబ్బరుఁడగు లింగపావనీవరుఁ డెలమిన్.

బొబ్బిలి చినరంగారాయనికి దత్తపుత్రుఁడును కృతిపతియు నైన రాయణప్ప రంగారాయనింగారు ౧౮౨౧వ సంవత్సరము మొదలు ౧౮౩౦వ సంవత్సరము వఱకును రాజ్యపాలనము చేసినందునఁ దదాస్థానకవీశ్వరుఁడైన యీ వేంకటకృష్ణకవి యిప్పటికి డెబ్బదిసంవత్సరములకుముందే యీగ్రంథమును రచియించినట్లు చెప్పవచ్చును. ఈయన కవిత్వమునందు లక్షణదోషములు కొన్ని యున్నను కవనము మృదువయి మధురముగానున్నది. శ్వేతాచలమాహాత్మ్యములోని కొన్నిపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

శా. ఆమాట ల్విని భూమీశుండు నిజభార్యన్ సద్వ్రతాసక్తికిన్
శ్రీమత్స్నానవభక్తికిన్ బొగడి ధాత్రిన్ మూఢచిత్తుండనై
భామారత్నము పాటిబుద్ధి గణుతింపం బూనఁగా లేక యా
సోమార్కుం బపకీర్తిపాలయితినంచున్ లోనఁ జింతిల్లుచున్.—ఆ. ౧.

ఉ. వేరొకభూవరాత్మజుఁడు విప్రుఁడు మగుచ్ఛాను రత్నకంకణో
దారకరారవిందమునఁ దాల్పె లతాంగి నను న్వరించినన్
భూరిశుభక్రమాకలన బోటిపదాంబుజ మీరజంగునం
గూరిమితోడఁ బట్టుకొనఁ గోరవ నంచును దీనుఁడై వడిన్.—ఆ. ౨.

శా. జంబాలుం డవమాని కొన్నిదినముల్ జాయాన్వితుండై తదు
ర్వ్యం బుణ్యస్థితి నుండి గర్భవతినారం బాసి స్వర్గంబు చే
రంబోవంగ శమీసమీపమున గర్భస్థార్భకుం బెట్టి నె
య్యం బొప్పారఁగఁ జేసెఁ దత్తగుణ దాఁ నగ్నిప్రవేశం బొగిన్.—ఆ. ౩.



## కాకరపర్తి-కృష్ణకవి.

ఈకవి శశిరేఖాపరిణయము ముఖలింగక్షేత్ర మాహాత్మ్యము, అనుకావ్యములను జేసెను. ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు; తిరుపతి పాత్రకవికిని సీతమాంబకును తనూజుఁడు. ఈపాత్రకవి సత్యభామాకృష్ణసంవాదాది గ్రంథములను రచియించి శ్రీమహారాజా గోడే నారాయణగజపతిరాయనింగారి పూర్వుఁడైన జగ్గారాయనింగారివలన నగ్రహారాదులను బడసెనఁట. ఈకృష్ణకవి విశాఖపట్టణ మండలములోనివాఁడు. ప్రపౌత్రుఁ డిప్పుడు జీవించియుండుటచే నితఁడు నూఱుసంవత్సరముల లోపలివాఁడు. ఈయనకవిత్వము దోషరహితమయి హృదయంగమముగానున్నది. కవికృతపుస్తకద్వయము నుండియు రెండేసిపద్యముల నుదాహరించుచున్నాను —

### ముఖలింగక్షేత్రమాహాత్మ్యము.

చ. అరుదుగ సర్వలోకనిచయం బతివేలఘనాంధకారభీ
కరవిపదబ్ధిలోఁ బడ నకారణవైరముతో వనూర్జ్వల
త్తరణిముఖప్రచారములు తప్పఁగఁ జేయుచు నన్నిదిక్కులన్
బెరిఁగెను వింధ్యభూధరము పీతమహాంబునిధీ తపోనిధీ.— ఆ. ౧.

ఉ. ఈనగ వైభవాతిశయ మెన్నఁగ శక్యమె ధాత్రికైన జాం
బూనదరౌప్యరత్నముఖభూరిమనోహరవస్తువిస్ఫుర
త్సానుచరన్మరుద్దనుజచారణకిన్నరసిద్ధసాధ్యసం
తానసమృద్ధి నొప్పు వితతంబగుమేరునగంబుకైవడిన్ .— ఆ. ౩.

### శశిరేఖాపరిణయము.

ఉ. మౌనుల నెట్లు ప్రోచితివొ మానసవీధిఁ దలంపఁ బాపముల్
మానక ధార్తరాష్ట్రుఁ డవమానమునుం దగఁ జేయుచుండెఁ గృ
ష్ణానను గావవే యనెను నాపలు కిప్పు డొకించుకైన నీ
వీనుల సోఁకకుండు టిదెయింత జనార్దన కంసమర్దనా.— ఆ. ౧.

చ. అనవిని వానితోడ విజయాత్మజుఁ డిట్లనియెన్ దురాత్మ యీ
వనమును గుత్తగొంటివొర వచ్చినవారి నెఱుంగ కీవు పో
మ్మనుటకు నీవె యీజగతియందును విక్రమశాలివా మదం
బున నిటుపల్కఁగాఁ దగదు పొమ్మిఁక దూరక వైర మేటికిన్.— ఆ.

ఉభయపుస్తకముగాక కోనపల్లి నివాసుఁడగు వేంకటరంగకవి రచితమైన దో

టియు, అప్పప్ప యను భట్టరాజు రచితమైన దొకటియు, శశిరేఖాపరిణయ మనుపేర రెండాధునికప్రబంధములు ముద్రింపఁబడియున్నవి వానినుండియు రెండేసి పద్యముల నిం దుదాహరించెదను.—

వేంకటరంగకృత శశిరేఖాపరిణయము.

శా. శుద్ధాంతంబున భైరవార్చనకు శాశుద్ధిన్ జరాసంధుఁ డు
ద్యద్ధైర్యంబున నిత్య మొక్కొక్క నృపుఁ గ్రోధావేశసంభూతస
ద్బుద్ధిం బట్టి కరుక్కరుక్కనఁగఁ దోడ్తో శిరస్సుం ద్రుంచి శ
శ్వద్ధాత్రిం బలి యిచ్చుచుండె విలసద్బాహాబలోదగ్రుఁడై.—అ. ౧.

ఉ. అందఱికంటె ముందుగనె హాయిగ మజ్జనభోజనంబు లం
దందు నొనర్చి సాత్యకిసహాయుఁడుగా వసుదేవదేవకీ
నందను లవ్విధంబు దళనాయకకోటి కెఱుంగఁ జేసి బల్
దుందుభికాహళానిపటుతూర్యరవంబులు భోరుకల్గఁగన్.—అ. 3.

అప్పప్పకృత శశిరేఖాపరిణయము.

ఉ. అన్నలు మాటలాడుసమయంబున లేచి సుభద్ర ప్రీతితో
నన్నయకాలి యైనముసలాయుధుఁ గన్గొని నీవుమున్నె యొక్
నన్నిటఁ బంపుచుండి పరిణామము వేఁడె భవత్కుమారియా
కన్నియ మత్సుతాగ్రణికిఁ గారుణికోత్తమ పెండ్లి చేయవే.—అ. ౧.

ఉ. పోరున ధార్తరాష్ట్రులను భూరిమదంబు బడఁగించి పిమ్మటన్
సేనని మిక్కిలిన్ భయముఁ జెందఁగఁ జేసి నీపరాక్రమం
బారగ నాలింప వ్యాళపతి కైనను శక్యము గాదటంచు నా
మామతిపుత్రునిం బొగడి మక్కువతోఁడఁ గిరీటి యంతటన్ —అ. ౪.

## కృష్ణయ్య.

ఈకవి పార్వతీపరమేశ్వరపరిణయ మనెడి మూడాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఈతఁడు స్మార్తబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు; చంచయార్య పుత్రుఁడు. ఈతని వాసస్థలము పినాకనీతీరమునందలి కామలాపురము. ఈతఁ డుండినకాల మేదియో తెలియరాదు గాని యితఁ డేఁబది యఱువదియేండ్లక్రిందటనుండిన ట్లూహింపఁదగియున్నది. ఈతని కవిత్వమునందుఁ గొన్ని వ్యాకరణ దోషములు గలవుగాని మొత్తముమీఁదఁ గవిత్వము శ్రావ్యమయి కొంతవఱకు శ్లాఘ్యముగానే

చున్నది. పార్వతీపరమేశ్వరపరిణయములోని పద్యములఁ గొన్నిటి నిం దుదాహ రించుచున్నాను.—

ఉ. ఆపురిఁ గాంచి నిర్జరు లహర్నిశమున్ మదిలోన నెన్నుచున్
గాపుర మున్న నాకమునకంటెను మేలని చూచువేడుకన్
దాపునఁ జేరి యనంగఁ దత్పురసౌధసమీపవర్తులై
గోపవిభుండులోనగను గొల్చెడురీతిగ నుందు రాస్థలిన్.—ఆ. ౧.

ఉ. ఈవిధి వచ్చువిప్రులఁగని యీశ్వరుఁ డర్ఘ్యమొసంగి యిట్లనన్
భూవినుతార్య మీధరను భూమిసురుల్ సుఖులై చరింతురా
మీవనమందుఁ బుష్పములు మేలగుకాయలు పండ్లు పత్రముల్
గావలెనన్నఁ గల్గుఁగద కారణ మేమిట రా విభాస్వజా.—ఆ. ౨.

ఉ. పంచశరుండు నిట్లనుచుఁ బల్కె విరించికి సమ్మదంబుగా
మించులమించుశంకరుని మీఱుచు ల్గన నాకు శక్యమే
మంచిది యేమియైన నిఁక మద్దళముల్ గొలువంగ నేగెదన్
వంచనలేక నన్నిలను వర్తిలఁజూచుచు పోయివచ్చెదన్ —ఆ. ౩.

## తరిగొండ - వెంకమ్మ.

ఈమె మంచి విద్వాంసురాలు. ఈమె చేసిన పుస్తకములు తరిగొండ నృసింహస్వామి కంకితము చేయఁబడినవి. తరిగొండ కడపమండలములో వాయిల్పాడునకు నాలుగుమైళ్లదూరములో నున్నది. ఈమె రచియించిన గ్రంథములలో రాజయోగసార మను ద్విపదకావ్యమును వేంకటాచలమాహాత్మ్యమను పద్యకావ్యమును ముద్రింపఁబడియున్నవి. ఈమె తాను భాగవతము ద్వాదశస్కంధములను ద్విపద కావ్యముగా రచియించినట్లు వేంకటాచలమాహాత్మ్యములోని యీ క్రిందిపద్యములోఁ జెప్పుకొన్నది.

సీ. దారునిర్మితవీణ నారూఢిఁ బల్కించు గాయకపురుషుని కరణి గాను
బురుషోత్తముఁడు దయాపూర్ణుఁడై నాజిహ్వ యందుఁ దావసియించి యరుదుగాను
బలికించఁ గావున భాగవతపురాణ మమర నే ద్విపదకావ్యంబుగాను
ద్వాదశస్కంధము ల్తగఁ జెప్పి హరికి సమర్పించి శ్రీవేంకటాద్రిమహిమ
మతనికై రమ్యపద్యకావ్యంబు చేసి। శ్రీనివాసునకే సమర్పింపనుంటి
నీఁగ తోఁ నుదధిఁ దాటఁబోయినవిధమున। నాస్వతంత్రత కిల బుధు ల్నవ్వవోరు.

ఈపుస్తకములోని

క. అలకాశినుండి వెలువడి । వలనుగ మాకొఱకు నందవరపురమందే
నెలకొని కులదైవతమై । యలరుచు మమ్మేలుచౌడమాంబను గొలుతున్.

అను పద్యమునుబట్టి చూడఁగా నీమె నందవరీక బ్రాహ్మణస్త్రీ యయినట్టు తెలియవచ్చుచున్నది. ఈమె తనభర్తయొక్క నామగోత్రములను జెప్పక "వసిష్ఠగోత్రపవిత్ర కృష్ణయామాత్య తనూభవ" యని తాను కృష్ణయామాత్యుని కూఁతురయినట్టుమాత్రము చెప్పుకొనుటచేత నీమె బాలవితంతువయి తన కాలమును వేదాంతగ్రంథపఠనాదుల యందుఁ గడపినట్లూహింపఁ దగియున్నది. ఈమె ౧౭౪౦వ సంవత్సరమునందు జీవించి యుండినట్లు గౌరీదొరగారు తమనిఘంటువునందు వ్రాసియున్నారు. కాఁబట్టి యీమె యేఁబదిసంవత్సరములక్రిందట నుండినట్లు తెలియవచ్చుచున్నది. ఈమెకుఁ బూర్వమునం దుండిన బ్రాహ్మణస్త్రీలు రచియించిన పద్యకావ్యము లేవియు నిప్పుడు కానరావు. ఈమెకవిత్వమునం దల్పదోషము లక్కడక్కడఁ గానవచ్చుచున్నను మొత్తముమీఁద కవన మతికఠినముగాక మృదుమధురరచనను గలదయియున్నది. వారాంగన యయినముద్దుపళనివలె శృంగారవర్ణనమని యవాచ్యములు పలుకక కులాంగన కుచిత మయినరీతిగానే వర్ణించుచువచ్చుటయే కాక శృంగారవాక్యములు వచించుట సహితము తన కనిష్టమని సూచించుటకయి శృంగారరసాధిదైవత మయినకృష్ణుని నిట్లు నుతించియున్నది—

శా. శృంగారాంకృతితోడ వచ్చి పదముల్ శృంగారసారంబుతో
దం గూఢంబుగఁ జెప్పి నీవలెఁగ నేఁ జెప్పలే నన్న నన్
ముంగోపంబునఁ జూచి లేచి యటనే మ్రొక్కంగ మన్నించి త
చ్ఛృంగారోక్తులు తానె పల్కికొను నా శ్రీకృష్ణు సేవించెదన్.

ఈపద్యమునుబట్టి చూడఁగా నీమె తాను బుస్తకమునం దక్కడక్కడ సందర్భోచితముగా రచించిన శృంగారపద్యములుకూడఁ దనవిగాక కృతిపతి విరచితములే యని లోకమునకుఁ జూప నుద్దేశించినట్టు కనఁబడుచున్నది. ఈమెకవిత్వరీతిని దెలుపుటకయి కొన్నిపద్యము లిందుదాహరింపఁబడుచున్నవి—

వేంకటాచలమాహాత్మ్యము.

ఉ. రామనృపాల ఘోరతరరావణశౌర్యవిఫాల భవ్యను
త్రామనురార్యయోగిజనతాపసపాల కృపాలవాల శ్రీ
భూమిసుతాత్మలోల పరిపూర్ణసుకీర్తివిశాల వానర
స్తోమముతోడ వచ్చి మిముఁ జూచి కృతార్థుల మైతి మిద్ధరన్.— ఆ. ౧,

ఉ. ఇంతట యోగపూరుషుఁడు హెచ్చఁడు తగ్గఁడు సంతతంబు నే
కాంతము నన్వసించుఁ దనయందుఁ బరాత్మను జూచుచుండు వి
భ్రాంతులు దన్నుఁ దిట్టినను గ్రమ్మఱ వారిని దాను దిట్టఁ డీ
శాంతుఁడు రాజయోగి ఘనసద్గురుఁ డంచు వచింపఁగాఁ దగున్. — అ. ౩.

చ. అడవికి వేఁటఁబోయి విపులాద్భుతఘోరమృగాళి నచ్చటన్
బొడగని భీతి నొందితివొ భూతము సోఁకెనొ లేక ఱాళ్ళపై
వడిచెడజాతి మ్రొగ్గితివొ వాగులలోఁ బడి లేచివచ్చితో
కొడుక నిజంబుఁ జెప్పు మిఁక గొబ్బున నొక్క చికిత్స చేసెదన్. — అ. ౪.

ఉ. ఆకురవంజి యిట్లనియె నాపకు రమ్మని పిల్వవచ్చినా
రాఁకొనినాఁడు బిడ్డఁ డిపు డమ్మల నక్కల నేడ నైన నే
జోకఁగఁజేరి వారలకు సోద నిజంబుగఁ జెప్పకుండినన్
నాకడు పెట్లు నిండు నని నవ్వుచుఁ బల్కుచు మూల్గి యిట్లనెన్. — అ. ౫.

రాజయోగసారము.

ద్విపద. కాయ మస్థిరమని కానంగలేక
మాయక సంసారబద్ధులై మమత
వదలక కామార్థవాంఛితు లగుచు
మదమత్తు లగుచు దుర్మార్గత నొంది
మదిలోన నబ్బి కామక్రోధలోభ
మదమోహమత్సరా ల్మాటికిఁ బెంచి
సంపద గలిగిన సామర్థ్య మనుచు
సొంపుమీఱిన తుచ్ఛసుఖ మిచ్ఛగించి
కామాంధులై తమగతి గానలేక
భామలవలలోనఁ బడి లేవలేక
తలఁగని యీషణత్రయవార్ధిలోను
మతిమతి మునుఁగుచు మమత కట్టి పె
నాలుబిడ్డలకని యర్థంబుఁ గూర్చి
కాలంబు నూఱకే గడపుచునుండి
యంతకాలము వచ్చినప్పుడు యమునిఁ
జింతఁజేయుచు హింసచేఁ గందికుంది
కష్టంబులోఁ బడి కొన్నినాళ్లుండి

పాపాత్ములగుచుఁ బ్రపంచంబునందుఁ
బుట్టుచుఁ గిట్టుచుఁ బొరలుచుండెదరు.

ఈతరిగొండ వెంకమ్మకుఁ దరువాతఁ దెలుఁగులోఁ బద్యకావ్యములను రచియించినస్త్రీ లెవ్వరును గానఁబడరు గాని శతకములు రచించినవారు కొందఱు గానఁబడుచున్నారు. ఇట్లు శతకములు రచియించిన స్త్రీలలో శ్రీరాజా గోడే నారాయణ గజపతిరాయనింగారి మేనత్త యగుచుండిన సుభద్రయ్యమ్మగారగ్రగణ్యురాలుగాఁ గానవచ్చుచున్నది. ఆమె ౧౭౮౦ వ సంవత్సరమునందు జననమొంది యించుమించుగా తరిగొండ వేంకమాంబతో సమకాలికురాలుగా నుండినది. ఈమె రచియించిన శ్రీరామదండకము, రఘునాయకశతకము, కేశవశతకము, కృష్ణశతకము, రాఘవరామశతకము మొదలయినశతకము లోకోపకారసంపుటముగా నీనడుమను బ్రకటింపఁబడినవి. ఈమె కవనకౌశలమును జూపుటకయి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. శ్రీరమణీకళత్ర సరసీరుహనేత్ర జగత్పవిత్ర స
త్సారసబృందమిత్ర సుసన్నుతిపాత్ర నరేంద్రపుత్ర శృం
గారసమగ్రగాత్ర జనకక్ష్మసుదారణకృచ్చరిత్ర శ్రీ
నారదమౌనిగీతచరణా రఘునాయక దీనపోషకా.

ఉ. మన్నన దప్పియున్నయెడ మక్కువ దగ్గినవారి నెయ్యమే
దిన్నఁగ మందలించినను దల్లుముగా మదినొవ్వకుండునే
యన్నకు ధార్తరాష్ట్రునకు నాదరమొప్ప హితోపదేశమి
ట్టెన్నఁగఁ జేసి గావిదురుఁ డేమిఫలంబును జెందెఁ గేశవా.

ఇప్పుడు తెలుఁగుదేశమునం దంతటను బాలికాపాఠశాలలు స్థాపింపఁబడి స్త్రీవిద్య ప్రబలుచున్నందున మంచిగ్రంథములను రచింపఁగల కులకాంతలు శీఘ్రకాలములోనే బైలుదేఱుదురు గాక!

## పిండిప్రోలి-లక్ష్మణకవి.

ఇతఁడు లంకావిజయమనఁబడెడు రెండాశ్వాసముల ద్వ్యర్థికావ్యమును జేసెను. ఇతఁ డాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; గోపాలామాత్యపుత్రుఁడు. ఈకవి గోదావరీమండలములోని రామచంద్రపురమునకు

సమీపముననున్న కొయ్యేరను గ్రామమునకు కరణము. ఈ గ్రామమును గుత్తచేసిన రావు ధర్మారాయఁడను పద్మనాయకకులజుఁ డీకవియొక్క లంకనేల మూఁడుపందుము లపహరింపఁగాఁ గోపావేశముచేత యౌవనమునం దితఁడు ధర్మారావును రావణాసురునితోఁ బోల్చుచుఁ దనక్షేత్రాపహరణకథను రామాయణపరముగా శ్లేషార్థము వచ్చునట్లు రచియించెను. ఇతఁడు తిట్టుకవిత్వమునకుఁ బేరుపడినవాఁడు. ఈ విషయమును గూర్చి లంకావిజయమునఁ గవియే యిట్లు వ్రాసికొనియున్నాఁడు—

క. తెలియుఁడి సురామకావ్యా । దులు నూరకవిప్రముఖపృథుప్రతిభావం
తులు భీమ శ్రీనాథు । ల్వెలయఁగ నాకరణిఁ దిట్టలే రూఢముతోన్.

ఇతఁ డిట్లు యౌవనదశయందుమాత్రమే కాక వార్ధకమువచ్చి యవసానదశ సమీపించువఱకునుగూడ నల్పములైన యైహికలాభముల నిమిత్తము పరులను దూషించుచు భూషించుచుఁ బద్యములను జెప్పి కాలము గడపుచుండెను. ఈ లంకావిజయమునకు రావణదమ్మీయమని నామాంతరము. కవి సమర్థుఁ డయ్యును రాఘవపాండవీయాదుల వలె రావణదమ్మీయ మంతప్రౌఢముగా లేదు. కవి గ్రంథమునందు రామాయణకథ కనుకూలముగాఁ దనకథను మార్చుకొనుచు నల్పసంఖ్యగల రెండర్థముల పదములతోనే గ్రంథమునంతను బూరించినాఁడు. ఈ గ్రంథములోని

క. లేదమ్మా కష్టము నీ । కేదమ్మా సిగ్గి భీతి ఘృణ నీ వొందన్
రాదమ్మా యిఁక మిన్నక । పోదమ్మా యుక్తి నిజము పొలుపుగ దమ్మా.

గీ. ఏడుపందుము లల్లోకంబు లెఱుఁగ లంక । నేలకోల పరక్షేత్రాప్తి మేలుగాదు
పేర్మి నాభూమిజాతసంప్రీతితోడ । వీఁడు మనిరెయు సౌఖ్యము లిచ్చు వేయు నేల.

ఉ. ప్రాజ్ఞత నెవ్విధంబునను రామునకుం దగుసాటి గావు స
ర్వజ్ఞ నృసింహుఁ డాయననువంశమునన్ జనియించి పెద్దదు
ష్ప్రజ్ఞుఁడ వీవు కానకు విచారము లన్నియుమాని ధర్మగో
ష్ఠీజ్ఞులు మెచ్చుచొప్పు కని సీతను వే విడుమంత మే లగున్.

గీ. జ్యేష్ఠుఁడా లక్ష్మణాగ్రజక్షేత్ర మీవు । వదలకుండిన మోసంబు వచ్చునింకఁ
జండనిర్భీకవనచారిపిండిప్రోలి । కవికులవరుతో రిపుత ముఖ్యముగ వలదు.

ఇత్యాదిపద్యముల ననేకులు మెచ్చుకొనుచున్నారు. లక్ష్మణకవి లంకావిజయమును క్రీస్తుశకము ౧౭౯౪ వ సంవత్సరమునందుఁ జేయ నారంభించెను. అప్పటి కితని కిరువదియైదుసంవత్సరముల ప్రాయ ముండినపక్షమునఁ గని ౧౭౭౦ వ సంవత్సర ప్రాంతములయందు జనన మొందియుండవలెను. ఈతఁడు ౧౮౪౦ వ సంవత్సర ప్రాంతమువఱకును సజీవుఁడయి యున్నందున నించుమించుగా డెబ్బదియేండ్లు బ్రతికి

ఉ. చందురువంటి నెమ్మొగము చాఁగెడుకన్నులు వృత్తదంష్ట్రికల్
సుందరపల్లవాధరము సోగకురుల్ మణికుండలప్రభా
బంధురకర్ణయుగ్మమును బారెడుచేతులుఁ గల్గు రాము నిం
కెందుఁ గనుంగొనన్న నిలుపోపఁ దరంబె సుమంత్ర యుత్తమా.—అయో.

చ. ఇనకిరణాళికిం జొరవ యీక సదాగతిరాక కైనఁ బ
ల్చనపడ కర్కసైకతముఁ జల్లిక రాలఁగనీక దట్టమై
దనుజవిముక్తకాండములఁ దట్టుచు దిక్కుల రామకాండముల్
ఘనసితభంగి నిండుటయుఁ జూచి సుర ల్వెఱఁగంది రయ్యెడన్.—అరణ్య.

ఉ. భూవరవర్య యెవ్వని సముద్ధతిఁ జంపుటకై కడంగి సు
గ్రీవునితోడ నెయ్యము మొనరించి తదీప్సితసిద్ధిఁ గోరి స
న్నీవిధిఁ జంపి తట్టిదనుజేంద్రుని రావణుఁ గీటడంచి నీ
దేవిని నెందు డాఁచినను దెచ్చియొసంగనె యొక్కవేళిడన్.—కిష్కింధా.

ఉ. ఓరిదురాత్మ యీఁదు బుధు లుండరొ యుండిన నీవు వారలం
జేరవొ సాధువాక్యములు చేకొన వొల్లవొ శిక్షలేమి నా
చారవిహీనమై సకలసజ్జనగర్హిత మయ్యె నీమతం
బారయ నీకతంబున నిశాటకులంబు చెడు న్నిజంబుగన్.—సుందరకాం.

మ. మరియున్ రావణి సాయకంబులు ధనుర్జ్యావిం దగంగూర్చి బ
ల్గురులాడం దెగనిండఁదీసి వెస వక్షం బుచ్చిపో నేసినన్
గురుబాణక్షతజాతరక్తకలితాంగుండై సుమిత్రాసుతుం
డరయం బొల్చె విధూమవహ్నిగతిఁ బుష్పాఢ్యద్రుమప్రక్రియన్. యుద్ధకాం.

కృష్ణజన్మఖండము.

చ. సలలితశుద్ధతోయములు చారుమణీదళపద్మకైరవో
త్పలములు గంధలుబ్ధసుతానమధువ్రతగీతనాదముల్
కలరవచక్రకుక్కుటమరాళమనోహరమంజులధ్వనుల్
గలిగి మనోజ్ఞసంపదలఁ గ్రాలు విశాలసరోవరం బొగిన్.—అ. 3.

మ. పఠికింపం గడు దుర్లభం బవనిలోఁ బ్రాణేశ కాంతామణీ
పురుషప్రేమగుణాతిరిక్త మనిశంబుర్వీతచారిత్రయున్
స్వరసారజ్ఞయు సాధ్వియున్ రసికయున్ జాతుర్యసంయుక్తయౌ
తరుణీరత్న మెఱుంగు సత్పురుషుఁడున్ దథ్యంబు చింతింపఁగన్.—అ. ౯.

శిశుపాల వధము.

శా. సామర్థ్యంబున మాఱులేనిబల మస్యం బబ్ధి నీతివి
ద్యామర్యాద నెఱింగి పోవుబల మస్యం బిట్టు లీరెంటికిన్
నేమం బేర్పడ భూరితేజమునకుం జీఁకట్లకుం బోలె బ
ల్సామానాధికరణ్య మెట్లు గలుగున్ జర్చింప లోకంబునన్.—ఆ. ౧.

చ. అలఘుధనుష్ప్రభావము గుణాతిమహత్త్వము ముష్టిశక్తియో
యిలయు దిగంతముల్ గగన మీఁచుచు నున్నవొ యేమిచిత్రమో
తెలియఁగరాదు శౌరిసముదీర్ణశరంబులు చిత్రజల్లుల
ట్లలవడ నొక్కరీతిఁ గురియం దొడఁగెన్ ధ్వనిపూర్వకంబుగన్.—ఆ. ౪.

భగవద్గీత.

ఉ. మెండుగ వృష్టికాలమున మిన్నక పాఱునదీప్రవాహముల్
నిండి చలింపకున్న యలనీరధిఁ జేరినమాడ్కి నెవ్వఁడుం
దండిగ సర్వకామనలు తప్పక చేర నతండు శాంతుఁడై
యుండు సకాముఁడైనరుఁ డొందఁడు శాంతిని బాండునందనా.

చ. అలయక యోగు లీతనిఁ బ్రయత్నము సేయుచు నాత్మయందు ని
శ్చలముగ నున్నవానిఁగ నిజంబు నెఱుంగుదు రజ్ఞులైన ని
శ్చలమతిహీనులొక్క మొగిఁ జాలఁ బ్రయత్నము చేసియున్ సము
జ్జ్వలుఁ దగునీశ్వరుం దెలియఁ జాలరు భ్రాంతి నిక్క మింతయున్.

